

చెన్నపట్టణము, సెప్టంబరు ౧౯౩౨

సంపుటము ౯ ఆంగీరస సంవత్సరము, భాద్రపదమాసము సంఖ్య ౯.

# శ్రావణి

సముద్రాల వెంకట రాఘవాచార్యులుగారు

చండగభస్తి ప్రచండతాపమ్ముతో మగనాలి బింకమ్ము మాసిపోయె
నెడనెడ బలితెంచు బడమటిగాడ్పుతో సరసుల చిత్తంబు చల్లబాఱె
బుడిబుడిరాలు జంబూఫలశ్రేణితో గలికిడెందంబులు పలకబాఱె
నెత్తావిచ్చిన ధరణీముఖశ్రీలతో మొగిలిపొదల్ నవ్వు లుప్పూచె
నరుగుదెంచె శ్రావణము సంధ్యాప్రకాశ-హైమసారవిలిప్తకుశాగ్రబింబి
తామల తటాకగర్భమ్మునందు డెంద-మలవఱిచి కూరుచుంటి సాయంతనమున.

సాధుమానీంద్ర రచితాభిచారహోమ-ధూమములు మబ్బులయ్యెనో తోచ మింట
నామధురచిత్తవీథి నానందకలిత-భావనారేఖ కంచితౌపమ్యము లయి.

పాలమెఱుంగు వ్రజములపై బ్రసరించెడు నీలకాంతులుం
బోలె దటాకగర్భమున బొల్పెసలారు విచితనీలమే

ఘాల మెరుంగుసోయగము గన్గొనుచుంటి మదీయతాపముల్
పోలి సురింగిపోవ నొకచోద్యము నా కగుపించె నయ్యెడన్.

త్రిజగతీవస్తుసౌందర్యదీధితు లవి-కలసి యొకచోట కరడుగట్టెనేమొ
భువనమోహనమాంత్రికమూర్తి నేడు-సరసులకు జూపె మబ్బుల తెరలు దీసి.

అవి పరమేశ్వరీమృదుపదాంబుజబద్ధసువర్ణనూపురా
లవి తపనీయశాంకరజటాంతర్గతగాంగవీచు ల
య్యవి మధురోషసీయవనికాంతరసూచితసాంధ్యరేఖ ల
య్యవి జలదాంగనా సహృదయప్రతిబింబితటిల్లతాద్యుతుల్.

ఆ విద్యుత్ప్రభ నాముఖప్రభలతో నద్వైతముం బొందుచున్
నీ వాల్లభ్యమె బ్రహ్మమంచు నభినందం చూపాలే సూపెడున్
భావాతీతము తత్స్వరూపమయినన్ భావంబు నొందుం దనూ
లావణ్యం బెట నేకరించినదొ చిత్రంబైన యీ యర్థమున్.

ఇదమిత్థం బని నిర్ణయింపగను లేనేలేదు నాచిత్తమం
దుదయంబందిన భావవీచిక తదీయోద్యత్ప్రభాక్రాంతిచే
నది యేమోయగుచుండె దా దనలొ త్రోవైపోవుచు న్నామనం
బిది యేలా కికురించి వెంటగొనిపో నేనాటి బాంధవ్యమో.

దిశలు మిఱుమిట్లుగొలుపుచు త్రిదశకాంత-హృదయతేజోమృతములు వర్షించిపోయె
నా విమలనూత్నదర్శనాయాతబోధ-కళిక మా ప్రాతచుట్టఱికమ్ము దెలిపె.

కేరడమానొకో యనుచు గ్రీవ మొకించుక పైకినెత్తి నే
నా రసికావతంసుని ఘనాఘనమూర్తిని మూగిచూపులన్
గేరుచునుంటి నాఘనుడు నీజననంబు పవిత్రమయ్యెరా
భీరుడ యంచు నాకు వినిపించె గభీరమధుస్వరంబులన్.

---

# స్వరవిపరిణామము

శ్రీపరవస్తు వెంకటరామానుజస్వామిగారు, యమ్. ఏ.

౪౧. ఇదివరలో (భారతి, ౭ సంపుటము, ౧ సంఖ్య, ౫ పుట మొ.) సంస్కృతభాషాస్వరములకును 'ఇండో-యూరపియన్' మాతృభాషాస్వరములకును గల సంబంధము సోదాహరణముగాఁ దెలియఁజేయఁబడినది. ఇప్పుడు మాతృభాషలోను దజ్జన్యములగు భాషలలోను స్వరవశమున నచ్చులకుఁ గలుగు విపరిణామములు తెలియఁజేయఁబడుచున్నవి. స్వరములకుఁగలుగు విపరిణామ మగుటచే (స్వరవశమునఁ గలుగుటంజేసియు) దీనికి 'స్వరవిపరిణామము' (Vowel Gradation) అని వ్యవహారము గలిగినది.

పరస్పరసంబంధము గల పదములలోఁ బ్రకృతిభాగమునఁ గాని ప్రత్యయభాగమునఁ గాని గల యచ్చులకు స్వరూపమునందుఁ గాని కాలమునందుఁ గాని రెంటియందును గాని కలుగు మార్పునకు స్వరవిపరిణామ మని పేరు. ప్రకృతిభాగమునఁ గలిగినమార్పున కుదాహరణములు:—సం॥ అపప్తమ్—పతామి—అపాతి; సం॥ భిన్నః—భేత్స్యామి—అభైత్సీత్; సం॥ బుద్ధః—బోధామి; సం॥ స్థితః—తిష్ఠామి; సం॥ దత్తే—దదామి; లా. pedem—గ్రీ. poda—లా. పేస్; గ్రీ. didōmi—లా. datus—సం॥ దద్మః. ప్రత్యయభాగమునఁ గలిగిన మార్పున కుదాహరణములు: సం॥ పిత్రా, గ్రీ. patros—సం॥ పితరమ్, గ్రీ. patera—సం॥ పితా, గ్రీ. patēr—సం. నామ్నః, లా. Carnis—సం॥ నామసు—సం॥ అర్యమణామ్, గ్రీ. poimena—సం॥ అశ్మానమ్, గ్రీ. akmona; గ్రీ. luke—గ్రీ. lukon—గాథి. wulfos, స్వరూపమునందు విపరిణామము a, ā, e, ē అనువర్ణములకే సంభవించును. ఇవి o, ō అను వర్ణములుగా మారును. (చూ. పై యుదాహరణములు.) ఈరెండువర్ణములును (e, o) అకారములోనికి మారుటచే సంస్కృతమున నీమార్పును గ్రహించుట కవకాశము లేదు. ఈమార్పునకుఁ గారణము తెలియకున్నది. కాలమునందును, రూపకాలములందును విపరిణామ మక్షరములను దేల్చి పలుకుటవలన సంభవించును. ఉ॥ ఏమి—ఇమః. ఇచ్చట రెండవపదమున 'మః' యను రెండవయక్షరము నొత్తి పలుకుటచే మొదటివర్ణము తేలిపోయి ఇకారరూపమును బొందుచున్నది. ఇట్లు 'ఇమః' అనురూప మేర్పడినది. ఇట్టి విపరిణామము తరచుగా ē, ō, ā అను దీర్ఘాచ్చులకు సంభవించుచుండును. తేల్చి పలుకుటచే హ్రస్వాచ్చులు లుప్తము లగుచుండును. ఉ॥ అస్మి—స్మః.

ఈ విపరిణామము 'ఇండో-యూరపియన్' కుటుంబములోఁ జేరిన భాష లన్నిటియందును నుపలబ్ధమగుటచే మాతృభాషలోనే యుద్భవించి జన్యభాషలన్నిటికిని సంక్రమించినదని భాషాశాస్త్రజ్ఞు లభిప్రాయపడియున్నారు. ఈవిపరిణామమునకుఁ గారణము లనేకములు గలవని భాషాశాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. స్వరము దీనికి ముఖ్యమగు కారణమై యుండవచ్చును. మాతృభాషయందు రెండువిధములగు స్వరము లుండినవని యింతకు ముందె తెలుపఁబడినది. అందు నిఃశ్వాసదార్ఢ్యము ననుసరించిన స్వరము కాలవిపరిణామమునకును, ధ్వనివగు నున్నతత్వానున్నతత్వముల ననుసరించినది స్వరూపవిపరిణామమునకును గారణము లగుచున్నవి. స్వరభేదమే కాక, యచ్చులసంధి, వర్ణలోపమువలన సంభవించు స్వరముల దైర్ఘ్యము, పదాంతరసాహచర్యము, స్వరవిపరిణామరూపముల వినిమయము, మొదలగు మఱికొన్ని కారణములుగూడఁ గలవు. స్వరవిపరిణామకృత భేదములు ప్రత్యేకభాషలజననమునకుఁ బూర్వమే మాతృభాషలో నుద్భవించుటచేతను, నీభాషలలో తిరుగ నచ్చు లనేకనూతనవిపరిణామములను బొందుటచేతను మాతృభాషలోని స్వరవిపరిణామస్వరూపమును సరిగాఁ దెలిసికొనుట కవకాశము లేదు. కాని ప్రత్యేకభాషల స్వభావములను బరిశీలించి మాతృభాషలోని స్వరవిపరిణామము లీక్రిందవిధముగా నుండెడివని యూహింపవచ్చును.

1. e-విపరిణామములు (e-వర్గము)

i. — ii. — iii. e iv. o v. e vi. $\bar{o}$

2. o-విపరిణామములు (o-వర్గము)

i. — ii. — iii. o iv. — v. $\bar{o}$ vi —

3. a-విపరిణామములు (o-వర్గము)

i. — ii. — iii. a iv. o v. $\bar{a}$ vi. $\bar{o}$

4. $\bar{e}$-విపరిణామములు ($\bar{e}$-వర్గము)

i. — ii. ə iii. $\bar{e}$ iv. o . . .

5. $\bar{o}$-విపరిణామములు ($\bar{o}$-వర్గము)

i. — ii. ə iii. $\bar{o}$ . . .

6. a-విపరిణామములు ($\bar{a}$-వర్గము)

i. — ii. ə iii. $\bar{a}$ iv. $\bar{o}$ . .

స్వరవిపరిణామము స్వరకార్యమగుటచే స్వరయుక్తములగు నచ్చులకే సంభవించుచుండును. మాతృభాషలోఁ బై మూఁడచ్చులే స్వరయుక్తములుగా నుండెను. కావున మిగిలినయచ్చులు పైరీతి మార్పులను బొందకుండెను.

మాతృభాషలో స్వరము నియతముగా నుండలేదనియుఁ గారణాంతరములచేఁ బదమునం దొకయక్షరమున నొకప్పుడును మఱియొకయక్షరమున మఱియొకప్పుడును నాశ్రయించియుండెడిదనియు విశదమగును. ఒకప్పుడొత్తిపలికినయక్షరము మఱియొకప్పుడు తేల్చిపలుకలసియుండెను. పైపట్టికలో నాయాయచ్చులకుఁ దేల్చిపలుకునప్పుడు సంభవించురూపములు i, ii కక్ష్యలలోను, స్వాభావికములగు (అనగా ఒత్తిపలుకునప్పుడుసంభవించు) రూపములు iiiవ కక్ష్యయందును, స్వరవశమునఁ గలుగు రూపాంతరములు iv వ కక్ష్యలోను, ఒత్తి పలికినపుడే హ్రస్వాచ్చుల కప్పుడప్పుడు సంభవించు దీర్ఘరూపములు v, vi కక్ష్యలలోను జూపఁబడినవి. ఇట్లు హ్రస్వాచ్చులకయిదేసి రూపాంతరములును, దీర్ఘాచ్చులకు మూఁడేసి రూపాంతరములును సంభవించుచున్నవి. పైయచ్చులలో మొదటిదే భాషలో విశేషముగాఁ బ్రయుక్తమైయుండుటచే దానిమార్పులకే యుదాహరణము లధికముగా దొరకును; మిగిలినవాని కుదాహరణములు విరళముగా నుండును.

ఉదాహరణములు

| | i, ii. | iii. | iv. | v. | vi. |
|---|---|---|---|---|---|
| 1. e— | గ్రీ. epibdai | గ్రీ. peda | గ్రీ. poda | లా. $\bar{e}$ pes | గ్రీ. $\bar{o}$ pos |
| | గ్రీ. patros | గ్రీ. pateres | గ్రీ. eupatores | గ్రీ. pat$\bar{e}$r | గ్రీ. eupat$\bar{o}$r. |

| | i. | ii. | iii. |
|---|---|---|---|
| 4. e— | సం. దధ్మః | సం. హిత(=ధిత) | సం. దధామి. |
| | | గ్రీ. thetos | గ్రీ. tithemi |
| | | లా. cr$\bar{e}$ditus | |
| 5. $\bar{o}$— | వై. దేవత్తః | గ్రీ. danos | సం. దదామి |
| | సం. ఆత్తః | లా. datus | గ్రీ. did$\bar{o}$mi |
| | | | లా. donum |
| 6. a— | సం. సవ్యేష్ఠర్ | సం. స్థిత. | సం. తిష్ఠామి |
| | | గ్రీ. statos | గ్రీ. hist$\bar{a}$mi |

పై యచ్చులకు యణ్ణులు గాని మకార నకారములు గాని పూర్వపరములయందున్నప్పు డాయచ్చులు లోపించినయెడల నీవర్ణములు హల్లు పరమైనయెడల నచ్చులుగాను, నచ్చు పరమైనయెడల హల్లులుగాను నుచ్చరింపఁబడుచుండెను.

ఉదాహరణములు

| | i, ii. | iii. | v. |
|---|---|---|---|
| ei— | సం. భిన్నః, భిద్యతే | సం. భేత్స్యామి, బిభేద | సం. అభైత్సీత్ |
| eu— | సం. బుద్ధః, బుధ్యతే | సం. బోధామి, బుబోధ | — |
| er— | సం. తీర్ణః, తిత్రత్ | సం. తరామి, తతర | సం. అతార్షీత్, తతార. |
| | సం. భృతః, బభ్రే | సం. భరామి, బిభర్మి | సం. అభార్షీత్ బభార |

em—సం. తిమిరః  సం. తమః  సం. తామ్రః.

en — సం. మతః, సం. మంస్యతే  సం. మానయామి.
మమ్నాథే

సం. బద్ధః, సం. బన్ధిష్యామి, సం. అభాన్త్సీత్.
బధ్నామి  బబన్ధ

౪౨. 'ఇండో-యూరపియన్' మాతృభాషలోని e, o; ē. ō అను వర్ణములు సంస్కృతమున అకారములుగా మారుటచే మాతృభాషలోని యారువిధములగు నచ్చులవిపరిణామములును సంస్కృతమున రెండువిధములగు నచ్చులవిపరిణామములవలెఁ గన్పడుచుండును.

1. 'అ'కార విపరిణామములు (అకారవర్గము)
i.—  ii. అ  iii. ఆ

2. 'ఆ'కార విపరిణామములు (ఆకారవర్గము)
i.—, ఇ  ii. ఆ

వీనికి యణ్ణులును మకార నకారములును బూర్వమునఁ గాని పరమునఁ గాని యున్నచో నట్టియెడల రూపభేదము లీక్రిందివిధముగా నుండును.

| | i. | ii. | iii. |
|---|---|---|---|
| 1. | అయ్ — ఇ, య్ | ఏ, అయ్, య | ఐ, ఆయ్, యా |
| | అవ్ — ఉ, వ్ | ఓ, అవ్, వ | ఔ, ఆవ్, వా |
| | అర్ — ఋ, ర్ | అర్, ర | ఆర్, రా |
| | అల్ — ఌ, ల్ | అల్, ల | ఆల్, లా |
| | అమ్ — అ, మ్ | అమ్, మ | ఆమ్, మా |
| | అన్ — అ, న్ | అన్, న | ఆన్, నా |
| 2. | ఆయ్ — ఇ, య్, ఈ | ఐ, ఆయ్, యా | ... |
| | ఆవ్ — ఉ, వ్, ఊ | ఔ, ఆవ్, వా | ... |
| | ఆర్ — ఋ, ర్, (ౠ) | ఆర్, రా | ... |
| | ఆల్ — ఌ, ల్, (ౡ) | ఆల్, లా | ... |
| | ఆమ్ — ఆ, మ్, ఆ | ఆమ్, మా | ... |
| | ఆన్ — అ, న్, ఆ | ఆన్, నా | ... |

పైరెండువర్గములలోను ననేకరూపములు సదృశములుగానే యున్నవి. ఈసాదృశ్యమునుబట్టి సంస్కృతమున రూపము లనేకవిధములగు సాంకర్యములను బొందియున్నవి. కావున పైని జేర్కొన్న యన్నివిధము లగు విపరిణామములకును సరియగు నుదాహరణములు దొరకుట సంభవింపదు. దిఙ్మాత్ర ముదాహరింపఁబడును.

## 1. అకార విపరిణామముల కుదాహరణములు

| i. — | ii. అ | iii. ఆ |
|---|---|---|
| స్తి | అస్మి | ... |
| పిబ్దమాన | పద | పాత్ |
| i. ఇ(ఈ), య | ii. ఏ, అయ్ | ఐ, ఆయ్ |
| ఇమః, యన్తి | ఏమి | ... |
| దిశతి | దేశః | ... |
| జిత | జేతర్, జయతి | అజైషమ్ |
| క్షితిః, క్షీయతే | క్షయః | ... |
| శ్రీః, శ్రియః | శ్రేయాంస్ | ... |
| అగ్నిః | అగ్నేః, అగ్నయః | ... |
| సఖ్యా | ... | సఖాయః |
| i. ఉ(ఊ), వ | ii. ఓ, అవ్ | iii. ఔ, ఆవ్ |
| శత్రుః | శత్రోః, శత్రవః | శత్రౌ |
| అగు | గోషు, గవి | గౌః |
| ప్రభు, అభ్వ, భూత, భువన | భవతి, భవితుమ్ | ... |
| శ్రుత, శ్రూయతే | శ్రోతర్, శ్రవః | ... |
| విధుతి, ధూత, ధునోతి | ధవిష్యతి | ... |
| i. ఋ, ర్ | ii. అర్ | iii. ఆర్ |
| భృత | భరతి | అభార్షమ్ |
| తిరతి, తురతి, తీర్యతి | తరతి | అతారిమ |
| i. అ | ii. అమ్ | iii. ఆమ్ |
| గచ్ఛతి, జగ్మివ | గమతి | ... |

| i. అ | ii. అన్ | iii. ఆన్ |
|---|---|---|
| రాజ్ఞే, రాజభ్యః | రాజని | రాజా |
| నామ, నామ్నః | నామని | నామాని |
| ఘ్నన్తి, హాత | హన్తి, జఘాన | ... |
| జాత | జజన, జనిష్యతే | ... |

**2.** ఆకార విపరిణామముల కుదాహరణములు

| i. —, ఇ | ii. ఆ |
|---|---|
| దధ్మః, హిత | దధామి |
| ... మిత | మాతుమ్ |
| దదతి, దేవత్త, అదిత | దదామి |
| తస్థుః, స్థిత | అస్థామ్ |
| ... ఈప్సతి | ఆప్నోతి |
| i. ఈ | ii. యా, ఆయ్ |
| దేవీ | దేవ్యాః |
| గీత | గాయతి |
| i. ఊ | ii. వా, ఆవ్ |
| ధూత | ధావతి |
| i. ఈర్ (?) | ii. రా |
| దీర్ఘ | ద్రాఘిష్ఠ |
| i. ని (?) ఆ | ii. నా |
| సంజ్ఞిత, జానాతి | జ్ఞాత |
| i. ఈ | ii. ఆ |
| పీత | పాతి, పాత్రమ్ |

పైరూపముల సాహచర్యమున సంస్కృతమునఁ గొన్ని క్రొత్తరూపము లేర్పడినవి. బుధధాతువునుండి 'బోధయతి' అనురూపమునుబట్టి తులధాతువునుండి 'తోలయతి' అనురూపము వ్యవహారములోనికి వచ్చినది. భాషాంతరములలోని రూపములను (గ్రీ. tel-) బట్టి చూడఁగా, తులధాతువు పూర్వము తలధాతు వయినట్లు తెలియుచున్నది. ఈరీతిగానే పూర్వము స్ఫుటధాతు వగు స్ఫుటధాతువునుండి 'స్ఫోటయతి' యను మొదలగు రూపములు వ్యవహారమునఁ గల్గినవి.

§3. హిందూ వైయాకరణులు గూడ నీస్వరవిపరిణామమును గమనించియున్నారు. కాని దానిస్వరూపమును నిరూపించుటలోఁ బైని దెల్పిన పాశ్చాత్యులరీతికిని మనవారిరీతికిని భేదము గలదు. భాషాంతరసహాయము లేకపోవుటచేతను, సంస్కృతమును మాత్రము దృష్టియం దుంచుటచేతను మనవారు స్వరవిపరిణామ విషయమున స్వరమునకుఁ బ్రాధాన్య మిచ్చియుండ లేదు. కానఁ బరిణామస్వరూపమును వ్యత్యాసముగాఁ జెప్పియున్నారు. ఇకు్కలను మూలముగా తీసికొని వానికి ఏ, ఓ, అర్, అల్ అనునవియును, ఐ, ఔ, ఆర్, ఆల్ అనునవియును ఆదేశములుగా వచ్చునని మనవారు చెప్పియున్నారు. ఒకప్పుడు యణ్ణుల కికు్కలాదేశముగా వచ్చు ననియుఁ జెప్పియున్నారు. ఇట్లు చెప్పుటవలన సంహితాకార్యముల నుపదేశించుటలో వారికి లాఘవము ప్రాప్తించినది. పాశ్చాత్యులు భాషాంతరపరిచయము గలవారగుటచేతను, భాషాచరిత్రమును వర్ణించునుద్దేశము గలవారగుటచేతను విపరిణామములు స్వరజన్యము లగుటచేతను, వీనిచర్చయందు స్వరమునకుఁ బ్రాధాన్య మిచ్చి, 'ఏ, ఓ, అర్, అల్' అనువర్ణములే మూలభూతములనియు, నివి స్వరరహితములయినయెడల (అనఁగా తేల్చి పలుకఁబడినప్పుడు) 'ఇ, ఉ, ఋ, ఌ' అను రూపముగా నుచ్చరింపఁబడు ననియుఁ జెప్పియున్నారు. అనేకభాషాసంబంధముకల భాషాశాస్త్రమున నిట్లు చెప్పియున్నారు. కాని సంస్కృతమునకు మాత్రము వ్యాకరణము వ్రాసినప్పు డెట్లు చెప్పినను బాధ లేదని పాశ్చాత్యులుగూడ మనవారివలెనే స్వరవిపరిణామస్వరూపమును వర్ణించియున్నారు. ఇట్లు వర్ణనావిధానమునఁ గొంత భేదముతో మనవారుకూడ స్వరవిపరిణామమును బోధించి, తదంతర్గతములగు భేదములకు "గుణము, వృద్ధి, సంప్రసారణము" అను మొదలగు సంజ్ఞలను జేసియున్నారు.

వృద్ధి యిట్లు ధాతుప్రత్యయములలోని యచ్చులకే కాక తద్ధితప్రత్యయాంతములలోని ప్రథమాచ్చునకుఁగూడ వచ్చుచుండును. ఉ॥ సం. వారుణ, మైత్ర, దైవ, పౌత్ర, మానస, వైష్ణవ, భౌమ, పార్థివ, ద్వైప, సౌఖ్య, సౌమ్య మొ. ఈ పదాదివృద్ధి 'ఇండో-యూరపియన్' మాతృభాషలోనే ప్రారంభమైనదని భాషాశాస్త్రజ్ఞుల యభిప్రాయము. ఇదియును, సంహితలో వచ్చు గుణవృద్ధ్యాదేశములును నిజముగా స్వరవిపరిణామము క్రిందఁ బరిగణింపఁబడవు.

# విహారము

౧

ప్రణయినీ! స్వచ్ఛదర్పణ ప్రతిమమయిన
నాదుహృదయమ్ములోన నీనడచునపుడు
నతిమృదులపాద లాక్షారసాభిషేచ
నారుణాంకమ్ము లియ్యవే హత్తుకొనియె
హృదయమున చిహ్నితమ్ము నీపదమొకొక
ప్రవిమలారుణపాదపరాగతతులె
హృదయరూపమ్ము దాల్చెనో యెట్టులేని
లేదు అధికరణాధేయ భేదశంక.

౨

శబ్దసంకులాభావప్రశాంతమగుచు
ప్రవిమలంబైన నా యంతరంగసీమ
ననునిమేషమ్ము తా ప్రతిధ్వనుల నీను
చెలిరో! తావకపాదమంజీరరవము.

౩

తరళతాళక్రియాప్రబంధములగూర్చు
మెట్టియల ఘల్లుఘల్లనునట్టి రవము
త్వత్స్వరూపసంస్మృతిని తన్మయుడనైన
నాకు చైతన్యమూదు కర్ణములలోన.

౪

నా హృదయదేశ సంచరణమ్మువలన
నామహాలక్ష్మివే సందియమ్ము లేదు
ప్రణయినీ! నీదు ఈ విహారమ్ముకతన
నేను లక్ష్మిసనాథుడ నేల కాను
అలరు మనకు నన్యోన్యాశ్రయాన్వయమ్ము.

౫

అతివ! నీమృదుపాదవిన్యాసమపుడు
హృదయమే పుష్పమయమయి పదములందు
నాచరించు పూజాక్రమ మనుదినమ్ము
ప్రేమధారల నర్ఘ్య సత్క్రియలగూర్చి.

౬

ఎపుడు భవదాగమంబుకై యెదురుసూచు
భావపుష్పవికాసవైభవము సెడదు
ప్రణయినీ! హృదయోద్యానవాటిలోన
నాచరింపుమీ! నిత్యవిహారదీక్ష.

---

# సీతమ్మశోకము — పాపరాజు

ఇంద్రకంటి హనుమచ్ఛాస్త్రిగారు
(శ్రీ వాణీవిలాసము)

శ్రీతమసాతీరమున దినమణి దివ్యతేజఃపుంజము వెల్లివిరిసి వెలుఁగు మధ్యాహ్నకాలమున పాప మేనిపాదుఁడు జక్కవకవనేయ సమకట్టెనోగాని ఆపుణ్యక్షణమున, ఆ సువర్ణక్షణమున ఆదికోకిల కన్నెట్టఁజేసి తియ్యనిగొంతు కదపి 'కూ' యని గద్గదించినది. ఆకూఁతకు వాక్పతి తాళపువేఁత దొరకినది. దాని కనంత కల్యాణగుణాభిరాముఁడగు శ్రీరామచంద్రుని శుభచరిత్రము కేలూఁతయైనది. ఆ యనంత మధురగానము ముల్లోకములను ముమ్మరించి, భోరుభోరున నేటికి మ్రోఁతవెట్టు.

మొదటికోయిల 'కూ కూ'లు మేలుబంతులు కుమార కలకంఠములు గొంతుసవరించి హావణించి, తీర్చి దిద్ది దిద్ది మించి పాడుకొన్నవి.

భవభూతికి శ్రీమద్రామాయణపు రుచి తగిలినది. రెండునాటకములుగా మనసుపడి వ్రాసికొన్నాఁడు. కాని "ఉత్తరే రామచరితే భవభూతి ర్విశిష్యతే."

పాపరాజు పసికట్టినాఁడు. పరమపురుషుని యుత్తరకథపసందు పాడుకొన్నాఁడు. భవభూతి యభిమానించిన పాత్ర శ్రీ రామచంద్రుఁడు. పాపరాజు భక్తితోఁ బోషించుకొనిన పాత్ర సీతమ్మ. "హృదయంత్వేవ జానాతి ప్రీతియోగం పరస్పరం" అని రాముఁడై యన్న భవభూతి హృదయమును దెలిసికొని సీతమ్మయై పాపరాజు "భావ మెప్పుడు దనమూర్తిఁ బాయదనుము" అనినాఁడు.

కంకంటి పాపరాజు నుత్తరరామాయణమున నొక రసవద్ఘట్టము సీతమ్మ శోకము. భవభూతి యెట్టి యనుభూతితోఁ దన యుత్తర రామచరితపుఁ దృతీయాంకమును వ్రాసెనో యట్టిరసవన్నిష్ఠతోఁ బాపరాజు జానకీ శోక ఘట్టమును విరచించెను. భవభూతి యుత్తర రామచరితమునఁ బుటపాక ప్రతీకాశమగు వియోగబాధచే గ్రుమ్గిపోవుచున్న శ్రీరామచంద్రుని దుఃఖాక్రందనములకు జవాబుగాఁ బాపరాజు సీతమ్మ పవిత్రమధుర స్నిగ్ధహృదయమును జూపినాఁడు. నే నీఘట్టమును జదువునప్పుడు హృదయము దుఃఖాభుగ్నమైనది. కన్నులు చెమ్మగిలినవి. ఏదియో మధురిమ స్ఫురించి ముగ్ధుని జేయును. "ఏక స్స్వాదు న భుంజీత" కనుక పాఠకులకుఁ గొంత చవి చూపఁదలఁచితిని.

చిత్రకారుఁడు గీసిన గీఁతలో జీవరేఖ యంతర్వాహినిగా ప్రవహించును. వస్తువును భావించుటలోను, అవస్థను గనిపెట్టుటలోను, ఔచిత్యమును గమనించుటలోను, రసానుభూతిలోఁ దొప్పదోఁగిపోవుటలోను గవితో సమానముగఁ జిత్రకారుఁ డావేదపడును. కాని చిత్రకారుని కుంచియ కంటెఁ గవికలమున

విశిష్టరచన కలదు. చిత్రమున మూఁగసోయగము గలదు. కవిగీతమునఁ జిత్రకారుని చిత్రణాసౌష్ఠవమును, గాయకుని రాగమాధుర్యమును నెలకొనుటయేగాక కావ్యోపనిబద్ధ తత్తత్పాత్రలు తమ యపూర్వసూత్రధార కౌశలమున రసమూర్తులై వారివారి యవస్థలలో మనలనుగూడ నాకర్షించుకొని తత్తద్రసాలంబనములలో మనలనుగూడ జోడించి చొక్కింతురు.

పాపరాజు హృదయము రసభరితమైనది. ఈ శోకఘట్టమును నటించుటకుఁ దానె యీ భూమికను ధరించుకొని రంగమున కురికియుండును. ఎంత నిష్ఠతో, ఎంత యనుభూతితో ఎంత వస్తుతత్త్వజ్ఞతతో నీపాత్ర నాయత్తపరచినాఁడోగదా కవిచంద్రుఁడు! "ఆకృశాంగి మఱలఁ గన్నుఁదామరలు విచ్చి విచ్చలవిడి వెడలెడు నశ్రుధారాప్రవాహంబులు చెక్కుటద్దంబులపై జాలువార జాళువామెఱుంగు పయ్యెద మీఁదికి దిగజారి యుత్తుంగతరస్తన కనకకలశంబులు నిండుకొన మెండుకొను నిట్టూర్పుసెకలం దగిలి చిగురువాతెఱ తుకతుక నుడుక నుడుగణంబుల బెడంగునడంగఁద్రొక్కు చేర్చుక్క తెరల తరళతర చికురనికరంబు లళికఫలకంబుపయిం జెఱలాడ తురిమిన విరుల సరులతో నొఱలి కొప్పుపెన్నెఱు లంసభాగంబునం బొరలిపడ జడుపుఁ జెమ్మటలు గ్రమ్ముకొని నెమ్మేను గడగడ వడంక కడంకదక్కి చిన్నిమొగంబు విన్నఁదనంబున కిమ్ముఁజూప పరితాపదవానలంబునం బడి పురపురఁ బొక్కుచుఁ దాల్మిఁదూలి స్రుక్కుచు లేచి కూర్చుండి శోకరసం బాకారంబుఁదాల్చినచందంబున, చిత్రరూపంబు గాత్రంబుఁ గైకొన్న చెన్నున, సాధ్వసంబు సాధ్వియైన కరణిం, గరుణంబు కరణంబు నొందిన తెఱంగున నుఱక వెక్కివెక్కి యేడ్చుచు, నేడుపువిడిచి మౌనంబుఁబూనుచు,మౌనంబుమాని దనలోఁదా నగుచు, నగవుడిగి తలయూఁచుచుఁ, దలయూఁపుటవిడిచి ముక్కుపై వ్రేలు గీల్కొలుపుచు జాలిఁగొని హాహాకారంబులు సలుపుచు"న్న సీతమ్మను జూచిన నేసహృదయుని గుండె కంపించి నీరుకాకమానును? కవిచంద్రుఁడు కన్నులుమూసి కాంతారాంతరమునఁ గటకటంబడుచున్న సాధ్వీమతల్లి కష్టదుర్దశను దన యద్వితీయభావనాశక్తి వలనఁ గనిపెట్టినాఁడు. చూచిన హృదయము కరుణాప్లావితమైనది రసవీచికాపటలిఁ దూఁగి తోఁగి జోగి పోయిన్నాఁడు; రసానుభవమైనది. ఇఁకఁ దన కావ్యప్రసక్తికై కలముచేకొనినాఁడు. పదములను ప్రోఁగించి పలుకుబడి ననుసరించి పరస్పరోప సందాన సౌష్ఠవము నుపలక్షించి సీతమ్మ నెంత స్వభావసుందరముగఁ జిత్రించినాఁడో చూడుఁడు. అంత శోక దీనదశయందును సహజగంభీరశీలయగు సీతమ్మ దుఃఖావేగ మాఁపుకొని ప్రోల భయవిషాద సంచలితగాత్రుఁడై

"మితిలేని యీ మిడిమేలంపు మొకములు
సకియల బలఁగమే జనని నీకు?
పరికింపరాని యీ బలుమలల్ నవరత్న
మయచంద్రశాలలే మాత నీకు!"

"పతిఁ బాయంజేసి నిన్నొంటిడించిన పా
పాత్ముఁడ"నని వాపోవు మఱందితో

"అడలకుమన్న నీకు వసు
ధాధిపు నానతిదాఁటవచ్చునే
యిడుమలఁ జెందుమంచు విధి
యీధర నన్ను సృజించియుండఁగాఁ
గడవఁగ నెవ్వ రోపుదురు?"

అని గుండె రాయిచేసికొని యూరటఁ బల్కు విచక్షణత, ఓరిమి, ఆయమకుఁగాక యేరికిఁ జెల్లును? ఆసాధ్వి యున్నతహృదయమును గురుతించి పలికించుటకుఁ బాపరాజునకుఁగాక యేరికి సాధ్యము?

వాల్మీకిమునీంద్రుని యుత్తరకాండలో నింత రసస్ఫూర్తి నెలకొనలేదు. ఆతపస్వి యాప ట్టును గవితాదృష్టితోఁ గాక కథాదృష్టితో మాత్రమే రచించెఁగావలయు. చూడుఁడు:

"తదేత జ్జాహ్నవీతీరే బ్రహ్మర్షీణాం తపోవనం,
పుణ్యంచ రమణీయంచ మా విషాదం కృథాః
శుభే.
తాజ్ఞో దశరథ స్యేష్టః వాల్మీకి ర్మునిపుంగవః.
..............................................
ఉపవాసపరైకాగ్రా వస త్వం జనకాత్మజే,
పతివ్రతాత్వ మాస్థాయ రామం కృత్వా సదా
హృది".

లక్ష్మణుఁడు సీతమ్మ నడవిలో డించిరావ లసివచ్చినపుడు, అతనికిఁ దనజీవితముపై రోఁత, ధేనువును వత్స విడువలేనట్లు పవిత్రమాతృ ప్రేమామృతమును గోల్పోవునప్పటి వేల తన పుటుమ్మలిక, దుఃఖోన్మాదము సహజములు. సీతమ్మను చూచినంతనే గుండె చెదరిపోయి కన్నీరు వరదవాఱఁ గాళ్లను జుట్టుకొనుటకు మారుగా "ఇది యందమైన జాహ్నవీతీర తపోవనము నీవేమియు విచారింపకుము. ఇది మాతండ్రిగారి మిత్రునియాశ్రమము. పతివ్రత వై యుపవాసములు చేయుచు నెల్లపుడు రాముని ధ్యానింపుము" అని యెవఁడు చెప్పును? ఈరచన యస్వాభావికము. పైనుదాహరించిన పాపరాజురచన స్వాభావికము.

రామచంద్రుని ప్రతిథమనిలోను సీతా ప్రేమ కూలముద్రుజమై ప్రవహించుచున్నది. అఖాతసీతాహృదయమునఁ బవిత్రప్రణయమ ధువు నిండి నిబిడీకృతమైనది. ఆ ప్రేయోమూ ర్తుల ప్రేమ, అగమ్యము, అసాధారణము. "హృదయం త్వేవ జానాతి" అట్టి ప్రేమైకజీవికి లక్ష్మణుని యుపదేశముద్ర యేమి? పాపరాజు లక్ష్మణుఁడు

"జననీ, నీవు మహాపతివ్రతవు, నీ
సౌశీల్య మిల్లాంధ్ర కె
ల్లను మెచ్చంతి రఘూద్వహాంఘ్రి యుగళీ
లగ్నాత్మవై యుండుమీ
యని నే నెవ్వాఁడ విన్నవింప?"

అని యుచితముగా మనవిచేసికొన్నాఁడు. తిక్కనార్యుఁడును నిష్పట్టున నీరసముగ నె చెప్పి యున్నాఁడు.

"క. ఆశ్రమ మల్లదె మునిచర
ణాశ్రయవు నిరస్తశోకవై యుండు జగ

ద్విశ్రుతియగు నీ పతియును,
నాశ్రమరహితుండయింకననిపల్కుటయుఁ."
(నిర్వచనోత్తర రామాయణము)

ప్రాణపతి నెడఁబాసిపోయి మిన్నుమన్నుఁ గానక నేకధారగా నేడ్చు సీతమ్మతో "నిరస్త శోకవై యుండు"మని యెంత జాలిమాలి పల్కినాఁడో యీ లక్ష్మణుఁడు! ఇంక నీసీతమ్మజవాబు చూడుఁడు.

"క. అగుఁగాక యట్ల చేసెద,
జగతీపతిపనుపుఁ జేసి చను నీవును, నీ
తెగువ రఘుపతికి నీకుం
దగవఁట, యే ననెడి దేమి?"

అని నిస్స్నేహముగఁ దెగువమైఁ బలికినది. సీతమ్మ య ట్లెన్నఁటికిని బలుకఁజాలదు.

"అడలకు మన్న నీకు వసు
ధాధిపు నానతి దాఁటవచ్చునే,
యిడుమలఁ జెందుమంచు విధి
యీ ధర నన్ను సృజించి యుండఁగా
గడవఁగ నెవ్వ రోపుదురు?"

అనియే యనఁజాలును! సాధ్వీరత్నములకుఁ బ్రాణపతివియోగముకంటె దుర్భరతాపము, దురంత వేదన, వేఱొక టుండదు. ఇట్టి కష్టస్థితికిఁ దొలిపుట్టువునఁ బ్రేమపాశబద్ధు లగు దంపతుల నెడఁబాపిన ఘోరకిల్బిషమే కతమని వారిమెడంద తల్లడపడును. ఇంకెట్టి మహాపాతకమును నిట్లు చేసియుండునని వారు నమ్మరు. ఇం కెట్టి పాపఫలమునైనను వారు సంతోషముతో నిర్భరానందముతో ననుభవింప సిద్ధముగానుందురు.

సీతమ్మ కట్టియూహయే పొడకట్టినది. పూర్వపు కాఱడవివాసము ప్రాణపతితోఁ బరమసంతోష మనిపించినది. ఇప్పటి, ఈ రమణీయజాహ్నవీపరిసర పవిత్ర తపోవనవాసము 'మేనఁ బ్రాణములు భరింప'నీయని దైనది.

"చ. ఎడపక పూర్వజన్మమున
నే మిథునంబులఁ బాయఁజేసి వా,
రడలఁగ నవ్వుచుండితినో?
ఆయఘు మూరకపోనె? నాఁడు కా
ఱడవుల రామపాదజల
జాప్తి వసించితి నేఁడు నాథు పొం
దెడసి యనాథనై యిచట
నేగతి మేన భరింతుఁ బ్రాణముల్."

తపోధనకవియు,

"కింను పాపం కృతం పూర్వం
కోవా దారై ర్వియోజితః
........................
పురాహ మాశ్రమే వాసం
రామపాదానువర్తినీ,
అనురుధ్యాపి సౌమిత్రే
దుఃఖేచ పరివర్తినీ,
సా కథం హ్యాశ్రమే సౌమ్య
వత్స్యామి విజనీకృతా."

అని చెప్పెను.

ఇంకఁ దిక్కు-సూర్యుఁడు

"ఇడుమలు పొందఁగఁ బుట్టిన
యొడలిది యిటు లోపుఁగాక యొద్దులు నాచే,
బడిరి తొలుభవమునం ది
ప్పుడు తత్ఫలమందకున్నఁ బోవునె నాకున్".

అని

"మామి కేయం తనూర్న్యూనం
సృష్టా దుఃఖాయ లక్ష్మణ"

అనుమాటతో నందుకొని కుదించి కుంటు వటించినాఁడు.

సీతమ్మ వెనుకటి జీవితమును దలఁచుకొనినది. పూర్వాభర్తృవాల్లభ్యమును భావించుకొని కుంగిపోయినది. గుండె వ్రయ్యలైపోవ దేమని యడుగుచున్నది:

"గీ. ఏను సాధ్వి ననుచు నెల్లవారలు నన్ను
సన్నుతింతు రనుచు సంతసింతుఁ
గాని నడుమ నిట్టి కటికనిందలు పుట్టి
యడవిఁ ద్రోయు రాముఁ డనుచు నెఱుఁగ.

చ. కటకట లక్ష్మణా ! పిడుగు
కంటెను బెట్టిదమైన మాట నేఁ
డిటు వినియుండియున్ బగుల
దింతలు నింతలు గాదు గుండె యె
ప్పటివలె నున్న దీ కటిక
భావముతో నసువుల్ భరించి యి
య్యటవిని యింక నేవలన
నాపద లొందఁగనున్న దాననో !"

తన ప్రేమమూర్తిని, హృదయపతిని తలంచుకొనుసరికి హృదయము పరవశ మైనది. ప్రేమోన్మాద మెత్తినది.

పదునాలు గేఁడులేడుగడయై, దాసుఁడై భర్తుఁడై తమ్ము నెడఁబాయక పుత్రునివలె మెలంగిన సౌమిత్రిపై నమ్మకము లేక

"కళవళమంది తెల్పితివా ?
కాక పరాకునఁ దప్పవింటివో,
కలనయినన్ రఘూద్వహుఁడు
కానలలో ననుఁ ద్రోయఁ బంచునే
తెలిసి గణింపు లక్ష్మణ మ
తిభ్రమ మైనదో?"

అనినది. కొంతవడికి తెలివితెచ్చికొని

"హా సహింపుమి
ప్పలుకు లెఱుంగఁగంటి వెత
వాటిలె నీ క్కొక భ్రాంతి యున్నదే?"

అన్నది.

క్రమముగా సీతమ్మకుఁ బ్రళయము క్రమ్మినట్లయినది. ఏనరకలోకమునకో యీడ్చుకొనిపోవుచున్నట్లయినది. తమ యనంత ప్రణయప్రబంధరసవద్ఘట్టమున కాశ్వాసాంత మాయెనని పాప మా పువుబోడఁద వేగిరించినది. పొంగిపోవుచున్న బెంగతో

"ఎన్నఁటికిన్ రఘూద్వహుని
నేనును నన్నిఁక రామచంద్రుఁడున్
గన్నులఁ జూడఁగల్గదొకో ?
కల్గకయుండినఁ బ్రాణ మేల పో
దన్న"

అని బేలగా జగన్మాత ప్రశ్నించుచున్నది. ఆ దురంతవేదన భరింపఁజాలక వెఱ్ఱి

నిస్పృహతో "నాదుమే నున్నది చెంత గంగ మడుగున్నది యైనటు లయ్యోదుం దుదిన్"అను చున్నది. వాల్మీకి ప్రేమోన్మాదమును జిత్రింప లేదు. "అద్యైవ సౌమిత్రే, జీవితం జాహ్నవీ జలే త్యజేయం" అని వదలివేసినాఁడు. కవి రాజగు పాపరాజు "చెంత గంగమడు గున్నది" అని కావ్యజీవితమును గమనించినాఁడు.

ఇప్పట్టున నిర్వచనోత్తర రామాయణమున "జాహ్నవీ సలిలసేచన మూర్ధ్వగతి ప్రదంబు" అని యున్న వాక్యము సరసముగ లేదు. సీతమ్మకుఁ గావలసినది శ్రీరామ ప్రేమామృతము. ఆ యమృతము నాస్వాదించుచుఁ గాఱడవుల నైన హాయిగాఁ గడుపఁగలదు. కాని ఆ ప్రేమామూర్తి లేని స్వర్గరాజ్యమునైన నేవగించుకొనును. ఎన్నఁటికైన రఘూద్వహుని నీమె కనుంగొనఁగల్గుచో నీభయంకర ప్రదేశమునను నిద్రాహారములు మాని నిరీక్షింపఁగలదు. "చూడఁగల్గదొకో?" అప్పుడు రాముని జూడని యావేదమును భరింపలేక ప్రాణోత్క్రమణోపాయముగ గంగమడుగును జూడఁదలచును గాని ముముక్షువై యూర్ధ్వగతి ప్రతి గ్రహణమునకుఁ గాదు. పాపరాజీపద్యమును (ఎన్నఁటికిన్ అనునది) పాపరాజై వ్రాయలేదు. సీతమ్మయై ప్రేమోన్మత్తుఁడై విలపించినాఁడు. ప్రేమైకజీవికి ప్రేమయే భోజనము, ప్రేమయే వస్త్రము, ప్రేమయే దివ్యసౌధము, దానితోడనే సీతమ్మ యశోకవనమును గల్పించుకొనినది. ప్రతిపాదపచ్ఛాయను, ఆస్నిగ్ధమోహాన జలధరమూర్తి చిరునవ్వుఁ జిలుకుచు మ్రోల నిలుచును. కనుకనే యాదుర్భరవియోగమును దృణప్రాయముగ సహించినది. కాని యీనిరవధి ప్రళయమున నిలువఁజాలనని బేలయై వాపోవుచున్నది.

"చ. పతి మతి నెంచెనేమొ తనుఁ
బాసి యశోకవనంబులోపలన్
బ్రతుకదె పెక్కునాళ్లనుచుఁ
గ్రమ్మఱఁ దాఁ జనుదెంచు శత్రునిన్
హతునిగఁ జేయు నేలు నను
నాశగదా బ్రదికించె నాఁటి కా
గతి నిఁక నేమియాసఁ గొని
కాయము నిల్పుదు తెల్పు లక్ష్మణా!"

క్రమముగా హృదయ ముద్రిక్తమైనది. సింహావలోకనమునఁ బౌరజానపదులు పొడకట్టిరి. యెద రవుల్కొనిపోయినది. కన్నుల ముంచు కోపము వచ్చినను జిగురువాతెఱ యొత్తి మందలింపని దయామయస్వాంత,"ఎఱుఁగని మూఢు లాడుకొను నెగ్గులకున్ భయమందె"న కఱకుఁదనమునకు గర్హించుచు,

"ఆ కరుణ యా ప్రసన్నత
యాకూరిమి యా ప్రియోక్తి యా గౌరవమున్
గాకుత్స్థుఁడు మఱచెఁగదా"

యనుచున్నది.

అమ్మా! మరువలేదు, మరువలేదు, ఆ పురుషోత్తము నొక్కసారి కన్గొనుము.

"నన్వకరుణే వైదేహీ! క్వాసి ప్రియే! దేవి ప్రసీద! ప్రసీద! న మా మేవంవిధం పరిత్యక్తు మర్హసి.........సౌమిత్రేరపి పక్షిణా

మవిషయే తత్ర ప్రియే క్వాసి మే. హా హా
దేవి స్ఫుటతి హృదయం."

అయ్యో! చూచితివా?

"ఆకర్ణాయతనేత్రమై మణిమయోద్య
త్కుండల ద్వంద్వశో
భాకీర్ణాంచితగల్లమై సురదనం
బై సుందరభ్రూయుతం
బై కమ్రస్మితచంద్రికా పిలసితం
బై, యొప్ప శ్రీరాముమోము"

నీకొఱ కెట్లు పరిపాండుదుర్బల మైపోయినదో."

అమ్మా! డగ్గుత్తికతో నే మరుచున్నావు?

"వనమున కేల వచ్చితివి
వల్లభునిం బెడఁబాసి యొంటిగా
నని మునిపత్ను లెల్ల గుమి
యై యడుగన్, ధృతిమాలి వారి కే
మని వివరింతు నింత విప
దంబుధి నేకరణిం దరింతు నే
యనువును నీ ప్రతిక్షణ మ
హాయుగముల్ క్రమియింతు లక్ష్మణా!"

ఎంత వెఱ్ఱిపడుచున్నావు.

"జననీ నీవు మహాపతివ్రతవు నీ
సౌశీల్య మిల్లాంధ్ర కె
ల్లను మేల్బంతి"

యని వా రెఱుంగుదురు. నీ యంఘ్రికమల రజోలేశములఁ గన్నుల నద్దుకొందురు.

* * * *

ఈ మహాకవింగూర్చి యొక గ్రంథము వ్రాయవచ్చును. ముఖ్యముగా నాకు నచ్చిన దీయన యద్వితీయభావనాశక్తి. దానికిఁ దగిన పదముల నాణెము. రసబంధురకవిత్వ మీయన సొమ్ము. ఏకసందర్భమునుగూర్చి వ్రాయునపుడు నిష్పాక్షికముగా వ్రాయఁదలంచుటచే నిందలి నిరసనాభాసములకు వే ఊహించుట తప్ప.

నాగపూడి కుప్పసామయ్యగారు నిర్వచనోత్తర రామాయణ పీఠికలో "వ్రతానా ముత్తమం వ్రతమ్" అన్నట్లే వ్రాసినారుకాని యితరపుస్తకముల జోడింపరైరి. ఇది సారస్వత వికాసమునకుఁ ద్రోవకాదని నాతలంపు. సుధీవరమిత్రు లిట్టి సంయోజక పరిశీలనలఁ గావించిన నాంధ్రసారస్వతమునకు మంచి మేలు చేసినవార లగుదురు.

---

# దశావతారతత్త్వము

శ్రీశ్రీశ్రీ రాజా విక్రమదేవవర్మ మహారాజులుంగారు (జయపురము)

జగమునకు నాది జల మౌట జలచరంబె
యాదిఁ బ్రభవించెనని మీన మవనిఁ జాటు
ధరణి గ్రొత్తగఁ గలుగంగ స్థలజలచర
సమితి ప్రభవించెనని చాటు కమఠవరము

అతిరజోగుణయుతమ్మగ మవలఁ బొడమె
ననుచుఁ బ్రకటించుఁగద వరాహంబు దలఁప.

అవల మృగనరగుణయుతవ్యక్తిచయము
పొడమెనని చాటు నరసింహమూర్తి యెన్న.

పదపడి యపూర్ణమానవు లొదవి రనుచు
వామనావతారము సేయుఁ బ్రకటనంబు.

మొదట నరులు రజోగుణపూర్ణు లనుచుఁ
బరశు రామావతారంబు బయలుపఱచు.

పిదప నిక్కంపు గృహమేధి వెలయఁగలిగె
ననుచుఁ దెలుపును శ్రీరామజనవరుండు.

అవల నరులకు మూఁడవయాశ్రమంబు
గలిగెనని ప్రకటించెడు బలుఁడు గనఁగ.

సత్యగుణరాశి-సన్యాసి సంభవించెఁ
బిదప నని బుద్ధరూపంబు వెల్లడించు.

దుష్టహరుఁడు-సజ్జనసుఖదుండు నైన
స్వామి గలిగె నావలనని చాటుఁ గల్కి.

చూడ రామత్రయము పరశువును గార్ము
కాశుగములను హలమును హస్తములను
దొడుగు టవి సాటు మనుజులు దొల్లి వనుల
నఱుకు టావలఁ బోరు టనంతరంబు
పుడమి దున్నుట క్రమముగాఁ బొడమెననుచు.

---

సత్యమును బాయఁ జనదని; సాధుజనుల
సాయమును జేయవలెనని; జన్మభూమి
గారవించుట దగునని; కడఁగి శ్రితుల
సాఁకవలె నని; మఱి బ్రహ్మచర్య మొనరఁ
జేయ వలె నని; శత్రుల శేష ముంపఁ
దగదని; గృహస్థధర్మంబు దగ నొనర్ప
వలె ననియు; నుదాసీనత భవ్య మనియు;
రాగరాహిత్యమే సుఖప్రకర మనియు;
ధర్మసంస్థాపనంబు కర్తవ్య మనియుఁ;
దెలుపు నవతారముల కార్యములు జనులకు.

---

ఇదివఱలోఁ గావ్యప్రకాశికా వివరణమగు ఋజువృత్తినిగూర్చి పాఠకులకు నివేదించికొన్నాఁడను. ఇపు డముద్రితమును నూతనోపలబ్ధమునగు నాంధ్ర ప్రబంధవిషయము విశదీకరించుకొనుచున్నాఁడను.

మాయావిలాసము నాలుగాశ్వాసముల శృంగార ప్రబంధము. కథ శైవపురాణములలోని యల్లముఁడను శివభక్తుని జితేంద్రియత్వమును మహిమను వర్ణించునది. కథానాయకుఁడు మాత్రమే ప్రసిద్ధుఁడు కాని మిగిలిన పాత్రము లన్నియుఁ గవికల్పితములే. దీనిని రచించినకవి

తులగాన నీలకంఠకవి :— జంగములలో సావరు లనియుఁ, జరులనియు రెండు తెగ లాంధ్రప్రాంతమునఁ గలవు. సావరు లనఁగా శివాలయములం దర్చనాదికమే చేయుచుండువారు. వీరికి శిష్యు లుండరు. చరు లనఁగా దేవాంగులు మొదలగువారికి. మంత్రోపదేశములు లింగధారణములు గావించుచు దేశమున మతప్రచారము గావించువారు. మనకవి సావరజాతిలోనివాఁడు. సావర శబ్దము స్థావరశబ్దముయొక్క వికృతరూపము. ఇంటిపేరు తులగానవారు. తండ్రి నీలయాహ్వయుఁడు. తల్లి మల్లమ. నివాసము గంజాం మండలములోని తులగా మను గ్రామము. శ్రీకాకుళమునకు ముప్పదిమైళ్ల దూరమునఁ బర్లాకిమిడిసంస్థానములో వంశధారానదీతీరమున నీగ్రామ మున్నది. ఈగ్రామనామమును బట్టియే కవియింటిపేరు వచ్చినది. తులగాము అనుదాని కొకవిధ మగు నామవిభక్తికప్రత్యయము చేర్పఁగా తులగాన అని యేర్పడినది. కూర్మాన పట్నాన అనుపేళ్లు సైత మిట్టి పరిణతి నొందినవే. లాక్షణికవ్యాకరణములలో నీప్రత్యయ మంగీకరింపఁబడకున్నను వ్యవహారమందు మాత్ర మీరూపములు బహుళముగానే కలవు. తులగామునన్ తులగానన్ అనురూపములు సప్తమ్యంతములుగా లాక్షణికు లంగీకరించినవి. ఈరూపములు సైతము మొదట సప్తమ్యంతములుగానే యుండి కాలక్రమమున నామవిభక్తికములుగా మాఱినవి. మాఁగాపు, అంధవరపు, అను రూపములవలెనే యిదియు సమాసమందలి వికారమే. అయితే ప్రస్తుతమునకు వత్తము. ఈ కవి పుట్టువు తోడనే అనూరుఁడు. తొడలపై నున్న శరీరముమాత్రమే కాని పూర్వకాయము లేదు. కావున నితఁడు గురువులకడ కేగుట విద్యాభ్యాస మాచరించుటయు సమకూడినవి కావు. ఇతరలౌకికవ్యాపారముల కసమర్థుఁ డగుటచే నీకవి సంతతము విద్యాభ్యాసమునందే కాలము గడపినవాఁడు. తమయింటికి వచ్చిన పెద్దలెవ్వరో కొంచెము కొంచెము విద్య నేర్పఁగా దానిపైని దానే స్వతంత్రముగా విశేషగ్రంథవ్యాసంగ మొనరించి బుద్ధిబలమువలనఁ గవిత్వమునకు సమర్థుఁడైనవాఁడు. తనంత తానే నేర్చినకవిత్వ మనుటచేతనే ఆశ్వాసాంతగద్యములందు "శ్రీమన్మహేశ్వరకరుణాకలితాస్మదభ్యాసోచితకవిత్వ మహత్వ" యని స్వవిషయము వ్రాసికొన్నాఁడు. గురుశుశ్రూష లేమిచేఁ గవిత్వమునఁ దోషములు చాలగా నగపడుచున్నవి. ఇందుఁ గవిప్రయుక్తములు కొన్నియు లేఖకప్రక్షిప్తములు కొన్నియుఁ గలవు. లేఖకదోషములు పరిహరించినఁ గవిదోషము లంత హెచ్చుగా నుండవు. గ్రంథము మిక్కిలి రసవంతమైనది. శృంగారరస మిందు పొంగిపొరలి పరాకాష్ఠ నందియున్నది. దాక్షిణాత్యకవుల కీకవి సమానుఁడా యధికుఁడా యను విచికిత్స గలిగింపఁజాలునంతగా నిందు శృంగారము వర్ణింపఁబడినది. కథానాయిక పుట్టిన యూరగు బసవశీపురంబును మధుకేశ్వరావాసమగు ముఖలింగమును గవి నివాసగ్రామమునకు దగ్గఱగానే యున్నవి. కవి యిప్పటికి నూటయేఁబదియేండ్లకు పూర్వుఁడని నరసన్నపేటనివాసులగు వేళంగి చంద్రయ్యస్వామిగారు చెప్పుచున్నారు. చంద్రయ్యస్వామిగారు చరజంగమశాఖవారు. వారును వారిపూర్వులును శైవమతాంధ్రగ్రంథములందు విశేషవ్యాసంగ మొనర్చినవారు. ఇపుడు వారి వయస్సు డెబ్బదికి పైఁగా నుండును. వారిచిన్నతనమందే

యీ కవినిగూర్చి నూటేండ్లకు ముందువాఁడని వినెడివారఁట. కావున నీకవి నూటేండ్లకుఁ బూర్వుఁడని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును.

ఇందలి కథా విధానము:— నైమిశారణ్యమున మునులు శైవపురాణములనెల్ల సూతునివలన వినుచుండి యొక్కనాఁ డల్లమ గణాధిపతి చరిత్రమును దెలుపుమని వేఁడ సూతుఁ డీకథ వక్కాణించెను. బసవళీపురంబున మమకారుం డనురాజు సంతానాపేక్షచే మధుకేశ్వరునిఁ గూర్చి తపంబొనరింప నాతనికొక్క తనయారత్న ముద్భవించెను. ఆబాలిక పుట్టినంతనే యరణ్యములందుఁ దపం బొనరించుచున్న మనంబులు హఠాత్తుగాఁజలించి సమాధివిరహితము లయ్యెను. మునులు మనస్స్థైర్యనాశమునకు హేతువు గానక విచారించుచున్నతఱి దుర్వాసో మహర్షి యచ్చటికేతెంచి వారికి ధైర్యము గొల్పుచు నా బాలికపూర్వవృత్త మిట్లని చెప్పెను. కైలాసంబున నొక్కనాఁడు శివుఁడు నిండుకొలువున్నతఱి నచ్చటి కల్లమగణపతి రాఁగా శివుఁడు లేచి యెదురేఁగి యర్ఘ్యపాద్యాసనాదులచే నాతని గారవించి వీడ్కొలిపెను. అది చూచి పార్వతి యీర్ష్యాసూయాపరవశయై 'నాథా, యాతనినంతగా గారవింప నేల? కామవశుఁడై క్షణములో నధఃపతితుఁడు కావలసినవానికి మదనారివగు నీ విట్లు సపర్యలు చలుపవచ్చునా' యని శివు నడిగెను. శివుఁ డాతఁడు జితేంద్రియుఁ డనియుఁ దనకంటెఁగూడ నధికమహత్త్వము గలవాఁడనియుఁ బ్రత్యుత్తరం బీయ నపర్ణ వానిని భ్రంశమొనరింప శపథమూని తన మనంబునంగల యహంకారమునెల్ల నొక్క వనితగా భూలోకంబున కవతరింపఁబంచెను. ఆ యహంకారమే మమకారభూపునకుఁ దనయయై యుదయించెనని యీ బాల వృత్తాంతము దెలుప మునులు దిగులుడిగి యథాపూర్వముగ నియమవ్రతులై యుండిరి.

మమకారునిభార్య మోహిని యీ బాలికకు మాయ యనునామము గావించి పెంచి సమస్త కళలు నేర్పుచున్నంత నొక్కనాఁడు శివాజ్ఞాప్రచోదితుఁడై మార్దంగిక రూపంబున నల్లముం డేతెంచి మధుకేశ్వరాలయాంగణంబున మృదంగ వాద్యంబున స్వామి నారాధించెను. అంతకు మున్న మధుకేశ్వరారాధనమునకు గర్భాలయంబు సొచ్చియున్న మాయ యతిలోకమగు నావాద్యప్రౌఢి కచ్చెరువంది వచ్చి చూచి యాతనిసౌందర్యముం గని కామపరతంత్రయై యాతని వలచె. ఆసంగతి నెఱింగి మాయ చెలి యొకతె రాజున కీమద్దెలకాని ప్రౌఢి తెల్పి మాయకు విద్య నేర్పఁ బ్రోత్సాహపఱిచెను. రాజును కుమారికి వాద్యంబు నేర్ప నల్లము నొడంబఱిచి కన్యాసౌధోపాంతమున నొక యింట నీతని విడియించె.

విద్య నేర్చుసమయమునఁ దన హావభావాదుల వల్లముని వశము గావించికొనఁ బ్రయత్నించియు విఫల మనోరథయై తుదకు తానే విరహవేదన నైఁపఁజాలక యసువుల వీడునంతటి దుర్దశకుఁ బాలయ్యెను. ఆసమయమున నొక్క చెలికత్తె దాని యాప్తిత మెఱింగి యల్లముని కడ కేతెంచి దాని బాధ నివేదింప నాతఁ డౌనుగాదనక దానితోడన కన్యాంతఃపురి ప్రవేశించె. కేళికాగారంబున మాయాల్లముల నుంచి సఖు లంతంత బయట కేగినపిదప మాయ తన మాయ లన్నియుఁ బ్రకటించి యాతనిఁ గరఁగింపఁజూచెను కాని యాతఁ డెంతమాత్రము చలింపలేదు. ఆ సమయంబున మోహిని యరుదెంచి కూఁతు విరాళి నాలించి చూచి తన తనయ నిల్లాలిఁగాఁ గైకొనుమని యల్లమునిఁ బ్రార్థించె. ఒకచెలికత్తె యల్లముని వాద్యమునకు సరిగ లయ తప్పకుండ నృత్యము చేసినచో నల్లముఁ డాపిల్లను బెండ్లాడునట్లును లయ తప్పినచో నల్లముఁడు దాని వీడునట్లును పన్నిద మేర్పఱిచెను. అందఱు దాని కంగీకరించి మధుకేశ్వరాలయమున నాట్యసభ స్త్రీలు మాత్రము కావించిరి. కామాతుర యగు మాయ యల్లముని సౌందర్యదిదృక్షాపరవశయై లయ తప్పఁగా నాతఁ డామద్దెల చితుకఁగొట్టి యరణ్యములవెంటఁ బరువెత్తెను. వానివెంట మాయయుఁ జెలికత్తియలును బరువెత్తి వానిఁ జుట్టుముట్టి వానితో ననయవాగ్వివాదము గావించుతఱి మాయ తా నధికురాల ననియుఁ దనకు వశము కానివా రుండరనియుఁ బల్క నల్లముఁడు దాని నీసడించి శివభక్తుల మహిమము వర్ణించెను. మాయాప్రేరణంబున నాతనిం జెలికత్తియలు బం

ధింపఁ జూచునంతలో నాతఁ డంతర్ధాన మొందెను. మాయ పార్వతీప్రేషిత యగు దూతికతోఁ గూడి కైలాసంబున కేగెను.

కూఁతు రట్లు వనమున కరిగినదని విని మమకారుఁడు మోహినియు నేతెంచి వనంబున మాయావిరహితలై వచ్చుచెలికత్తెలవలన జరిగిన వృత్తాంత మెఱింగి ఖిన్నులై పురంబున కేతెంచి శోకించుచుండ, నాతని గురువర్యుండగు సిద్ధుఁ డేతెంచి యథార్థ మెఱింగించి వారి శోకాగ్ని చల్లార్చెను. ఇది కథ.

కథాసంవిధానమున వేదాంత మిమిశ్ర యతి శృంగారముగా వర్ణించిన కవిప్రతిభ శ్లాఘ్యము. కవి సహజపాండిత్యుఁ డగుటచేఁ గథాకల్పనమందుఁగూడఁ గొన్ని చిన్నిదోసఁగులు పొసఁగినవి. కవితాశైలి తెలియుటకై కొన్ని పద్యము లుదాహరించెదను.

ఉ. తమ్ములనీటు, నీలశర
దమ్ముల నీలిమ, గండు తేఁటిమొ
త్తముల డాలు, నిర్ఝరప
దమ్మ చోకారము, తళ్కుఁగుల్కు ట
దమ్ములచాయ నేలె నల
తామరసాయతనేత్ర కన్ను లం
దమ్ము, మెఱుంగు వేనలి వి
ధ, మ్మలయూరును, గోను, జెక్కులున్.

చ. కనుఁగొనవచ్చినట్టి కల
కంఠికి నవ్వనరాజ్యలక్ష్మి సొం
పెనయఁగ హాసపంకజము
లెత్తి నివాళు లొసంగి నేసప్రా
లొనరఁగఁ జల్లెనో యనఁగ
నొప్పె మరుచ్చలదామ్రపల్లవా
భినుతసుగంధపుష్పరసభృ
త్సముదగ్రలతాంతజాలముల్.

సీ. రహి గుబ్బదోయి భారము భరింపఁగలేక
యలఁతి నెన్నడుము జవ్వాడుచుండ
కోలుకులు వెలువడి కొనలారు కరిమాపు
లలరుచెక్కులమీఁద నలముకొనఁగ
నొఱపైన పేరెద మెఱయు కట్టాణి ము
త్యాలహారంబు లుయ్యాలలూఁగ
దరహాసచంద్రికల్ నెఱి మించుమోముపైఁ
బ్రోవుసేయుచుఁ గళల్ పొంగి పొఱ
పసిఁడిగాజుల మిసమిసల్ పరిఢవిల్ల
శంబరారాతి మెఱుఁగు కలంబమట్లు
శీఘ్రగతి నేగి కడిఁది యచ్చెరువు నొంది
వలపు మరి నంటి చూచె నావాలుఁగంటి.

సీ. కూర్మి నంకస్థలిం గూర్చుండఁబోయిన
మంచంపుదండయై మరఁగుచుండు
నిద్దంపుఁ జెక్కులు ముద్దాడ నుంకింప
నంతటఁ దొలఁగి యలంత మెఱయుఁ
గవగూడి గట్టిగాఁ గౌఁగిలింపఁగఁబోవఁ
గను నిరాకారమై కను మెఱుంగు
నధరసుధారసం బాన నూహింపంగ
నందంద యందక యాసగొల్పు
భువనమోహన సుందరమూర్తియైన
యల్లమస్వామి యిట్టు లత్యంతవిరహ
శిఖిశిఖలచేత వేఁచి యాచెలువ నపుడు
త్రిప్పులం బెట్టెఁ గేళిమందిరములోన.

గీ. పురుషుఁ డాజ్యఘటము పూఁబోణి దావాగ్ని
యట్టి దవనియందు నంద్రు పెద్ద
లహహ యిపుడు చూడ నతివ యాజ్యఘటంబుఁ
బురుషుఁ డగ్నిరీతిఁ బొసఁగె నౌర.

ఇట్లే యీతని కవిత్వమెల్ల లలితములగు పదజాలములతో నింపగు వర్ణనములతోఁ బాఠకుల యుల్లంబుల నుల్లాసంబు గూర్చుచుండును.*

---

* జన్మమాత్రంబున ననూరుండై సహజ పాండిత్యుండై రసవత్తరంబులగు కృతులు రచించి లోకంబున కర్పించి కీర్తిగన్న యీ శైవాగ్రణిగ్రంథంబులు సరసశేఖరు లెవ్వరేని ముద్రించి ప్రకటించినఁ జాల బాగుగ నుండును. ధనికుఁడఁ గామింజేసి నేను ముద్రింపఁజాలను. ఎవ్వరేని ముద్రింప నియ్యకొనిరేని చక్కఁగఁ బ్రతి వ్రాసి యచ్చున కనువగురీతి నర్పింప సిద్ధముగా నున్నాఁడను. ఈతని యితరగ్రంథములు నీలకుంతలాపరిణయము, బసవకల్యాణమును. వానింగూర్చి వేఱొకసారి నివేదించికొందును.

# ఆంధ్రముద్రాక్షర విలేఖనయంత్రము*

'బహారి'

౧

క్రిందటి డిసెంబరు ౯-వ తేదీని వెలువడిన "ఆంధ్రపత్రిక" లో ప్రచురింపబడిన "విజ్ఞప్తి" యందు, నే నాంధ్రముద్రాక్షర విలేఖన యంత్రమునుగూర్చి పేర్కొన్న విషయములన్నియు జనెవరి "భారతి" యందు విపులముగ దెల్పుకొందునని విన్నవించుకొంటి గాని, కొన్ని యిబ్బందులవల్ల నింత యాలస్యముగ ప్రకటన కందజేసినందులకు పాఠకులు నన్ను మన్నింపవేడుచున్నాను.

ఇతరభాషాలిపులవిషయ మెట్లున్నను, మన యాంధ్రభాషాలిపిమాత్రము కాలక్రమమున మార్పుల జెందుచునేయున్నది. అట్లు మార్పుల జెందునప్పుడెల్ల కొంత వ్రాతసౌకర్యమును, మరికొంత యందమైన రూపమును సేకరించుకొనుచునే యున్నది. ఇందలి సత్యాసత్యములు దర్శింపనెంచిన, పూర్వశిలాతామ్రాది శాసనములను, ప్రాచీనతాళపత్రగ్రంథములను, ప్రస్తుత ముద్రితగ్రంథములను వరుసగ బరిశీలించినపక్షమున బోధపడగలవు. మరియు నాంధ్రభాషాలిపి యట్లు మార్పుల జెందుట కుత్తరవాదులు భాషావిలేఖకులని చెప్పక తప్పదు. వా రావిధి లిపిని మార్చునప్పుడెల్ల అప్పటికి వాడుకలో నున్న లిపియందలి యక్షరములకే యించుక మార్పును గల్గజేయుచువచ్చిరి కాని, యంతకు పూర్వమం దెప్పుడో వాడబడిన లిపియందలి యక్షరములకు మార్పు కల్పించియుండలేదు. ఈపద్ధతి ననుసరించియే ముద్రాక్షరయంత్రము (Printing Press) ఆంధ్రదేశ మలంకరించునప్పటి కప్పుడు వాడుకలోనున్న యిటీవలి తాళపత్రగ్రంథాంతరాక్షరములను, అప్పటికి నూతనముగ ప్రచారములోనున్న బుడుతకీచుల పీచుకాగితపు గ్రంథాంతరాక్షరములను ఇంచుక సంస్కరించి ముద్రాక్షరముల నేర్పర్చుకొనిరి. ఇందులకు నిదర్శనముల గొన్నింటి నిచట మచ్చునకు పేర్కొనుచుంటి గమనింపుడు.

ఇటీవలి తాళపత్రగ్రంథములందు "ప్పా" యను సంశ్లిష్టవర్ణ మీక్రింద నుదాహరింపబడిన ఒకటవచిత్రమం దెన్ని విధముల వ్రాయబడినదో యన్ని విధముల వ్రాయబడినది. (ఇంతకన్న నెక్కుడురూపములు గలవు గాని యవి యంతయొప్పులుగ దోచనందున విడువబడినవి.) కాని యా యిటీవలి తాళపత్ర గ్రంథాంతరాక్షరముల సంస్కరించి యేర్పచుకొనిన ముద్రాక్షరములం దీసంశ్లిష్టవర్ణము "ప్పా" యని యొక్క విధముననే ప్రస్తుతముద్రణమందు వాడబడుచున్నది.




చిత్రము ౧

ఇందలి సంశ్లిష్టవర్ణము లిటీవలి తాళపత్ర గ్రంథాంతర్గతములును, ఐత్వము ప్రాచీన తాళపత్రగ్రంథాంతర్గతమును నై యున్నవి.

ఐత్వము ప్రస్తుత ముద్రణమందువలెనే యిటీవలి తాళపత్రగ్రంథములందును గలదు గాని యంతకు పూర్వమందు లిఖింపబడిన ప్రాచీన తాళపత్ర గ్రంథములం

* నే నడుగకపోయినప్పటికిని, నాకు లభింపని మ. రా. రా. శ్రీ M. S. వెంకయ్యగారి "తెలుగు లిపియు దత్సంస్కరణ" మను వ్యాసము నా కుచితముగ బంపిన భారతిపత్రికాధిపతులకును, నా చిత్రించిన చిత్రపటంబుల నతిజాగ్రత్తగ బరిశీలించి కష్టమున కోర్చి నా యభిప్రాయానుసారముగ I, III,IV, V, VI చిత్రముల నిండియన్ యింకు (Indian Ink) తో వ్రాసియిచ్చిన నా స్నేహితుడగు మ. రా. రా. శ్రీ V. వీరబ్రహ్మంగారికిని ఇందుమూలమున నాకృతజ్ఞతాభివందనముల నర్పించుకొనుచున్నాడను.

దైత్వము మొదటిచిత్రమందు జూపబడినవిధమున గానంబడుచున్నది.

ఐత్వము మొదటిచిత్రమందు జూపబడిన విధమున వాడబడుకాలమున వట్రువసుడియు, సుడిదీర్ఘమును, ఇప్పటివలె హల్లక్షరమునకు ప్రక్కభాగమం దించుక క్రిందుగా చేర్పబడెడిది గాని, యంతకు పూర్వమందు లిఖింపబడిన తాళపత్రగ్రంథములందు హల్లక్షరమున కూర్ధ్వభాగమందు జేర్పబడినట్లు, నే నెచ్చటనో యతిపురాతనమై చాల శిథిలమై యున్న తాళపత్రగ్రంథమందు చూచినట్లు నా కించుక జ్ఞాపకమున్నది కాని యట్టి యతిపురాతనతాళపత్రగ్రంథముల గొన్నింటి నింకొకసారి చూచిన గాని దృఢముగా జెప్పజాలను.

కనుక నీవాదానుసారముగ, ప్రస్తుతవిలేఖనముద్రణాదులయందు వాడబడుచున్న అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఎ ఏ ఐ ఒ ఓ ఔ అఁ అం అః, క ఖ గ ఘ ఙ చ ౘ ఛ జ ౙ ఝ ఞ ట ఠ డ ఢ ణ త థ ద ధ న ప ఫ బ భ మ య ర ఱ ల ళ వ శ ష స హ క్ష యను నీయేబదియేడక్షరములను, వీనిసంజ్ఞాచిహ్నములగు నేబదియేడుసంజ్ఞలను నేకరించి, వానిలో గొన్నింటికి మాత్ర మతిస్వల్పములగు మార్పుల జేసి, *ముద్రాక్షరవిలేఖనయంత్రకుంచికాఫలకమునం దమర్చుట కనువుగా నుండునట్లేర్పాటుచేసియుంటిని. ఆ యేర్పాటుచేయబడినయక్షరంబులు ప్రస్తుతముద్రాక్షరంబుల బోలియున్నప్పటికిని, అందలి వ్యంజనాక్షరములలో గొన్నింటికి గుడిని గాని, లేక గుడిదీర్ఘమును గాని చేర్చినపుడు మాత్ర మించుక భేద మగపడగలదు గాని యది యంత గొప్పమార్పులో జేర్పదగినది గాదు.

ఇక ముఖ్యముగా గమనింపవలసిన దైత్వమునకు జేసినమార్పు తప్ప మరేదియును గాదు. కాన నీ యైత్వమునుగూర్చి యించుక విపులముగ జెప్పవలసియున్నది. ఆంధ్రాక్షర తత్వవేత్తలలో నగ్రగణ్యులగు పాడి వేంకటస్వామి యను వేంకటనారాయణపాఠీగారిచే రచింపబడిన "ఆంధ్రాక్షరతత్వ" మను గ్రంథమందు ౬౨-వ పుటలో ఐత్వ, వట్రువసుడులగూర్చి యీక్రిందివిధముగ నున్నది:

"గుణితక్రమమున నచ్చులన్నియు వ్యంజనములకు బైభాగమునను, హల్లులన్నియు గ్రిందిభాగమునను, బూర్వంబునకు బరం బాదేశంబుగను జేర్పవలయు. (ృ) వట్రువసుడి తలమీద నొకవైపునను, (ై) ఐకారము (ె) ఎత్వమునొద్దనుండి యెడమవైపునకు వంగియు ప్రాచీన లిఖితగ్రంథముల గానంబడియెడు. ఇప్పుడు ముద్రణముల గ్రిందిభాగమున సగము వేఱుగ బెట్టుచుండిరి. (ఇది యుచితము కాదు.)"

దీని నాధారముగ దీసికొనియే ప్రస్తుతము వాడుకలో నున్న యైత్వము నిందు వర్ణింపబడిన పగిది మార్పుచేసి ప్రథమచిత్రమందు లిఖించియుంటిని. ఇయ్యది ప్రస్తుతపు ఐత్వమునకు భిన్నముగ నున్నను, ఇప్పటియైత్వమువలె వ్యంజనాక్షరములకు క్రింద జేర్చు ఒత్తుల కవినమగు నాటంకమును గలుగజేయక, లేఖిని యొక్క వేగమునకు దోడ్పడుచు ముద్రాక్షరవిలేఖనమున కనువుగ నున్నందున స్వీకరింపబడినది. కాని పాఠీగారి వచనానుసారముగా వట్రువసుడిని వ్యంజనాక్షరమున కూర్ధ్వభాగమందు జేర్చినపక్షమున, ఆ వ్యంజనాక్షరరూపము వికృతమగుటయు, లేఖిని కుంటువడుటయు, ముద్రాక్షరవిలేఖనమున కంత యనుకూలముగా నుండక పోవుటయు సంభవించుటయే గాక, చూచువారి కనవసరమగు మార్పై, ప్రస్తుతాచారమునకు భంగము వాటిల్లగలదు. అంతియే గాక వాని కిప్పటి కున్న స్థానము వ్రాతకును, ముద్రాక్షరవిలేఖనమునకును జాల అనుకూలముగ నుండుటంజేసి వానిస్థానమును మార్చియుండలేదు.

పై జెప్పిన ౫౯ వర్ణములును ౫౯ వర్ణచిహ్నములును గలసి మొత్తము ౧౧౮ చిహ్నములలో గొన్నింటి

* ముద్రాక్షరవిలేఖనయంత్రములగూర్చి సామాన్యముగ దెలిసికొనవలసినవిషయము లెల్ల మ. రా. రా. శ్రీ M. S. వెంకయ్యగా రిదివరకే నవంబరు "భారతి"యందు దెల్పియుండిరి గాన వానిగూర్చి మరల నే నిందు పేర్కొనుట మానితిని.

దీసివేసి మిగిలినచిహ్నములను, ఆ వదలివేసిన చిహ్నముల స్వీకరించిన చిహ్నములతో సమకూర్చుకొనుటయందు గావలసిన మరికొన్ని చిహ్నములను, వ్యంజనాక్షరములలో గొన్నింటికి స్వరసంజ్ఞల జేర్చునప్పు డవసరమగు మరికొన్ని చిహ్నములను, లేఖిని కవసరమగు మఱికొన్ని విరతులను, అంకెలను స్వీకరించి, వాని నన్నింటిని ముద్రాక్షరవిలేఖనయంత్ర కుంచికాఫలకమం దొక్కొక్క కుంచికకు మూడేసి చిహ్నముల చొప్పున కూర్చియుంటిని. ఆ విడిచిన వర్ణములను వర్ణచిహ్నములను సమకూర్చుకొనువిధాన మిచట పొందుపరచితిని జూడుడు. (చిత్రము ౨)

చిత్రము ౨

ఈ విధానమువల్ల లిపి కించుక భేద మబ్బగల దనుసంగతి నిశ్చయమె. అట్లించుక భేద మబ్బినప్పటికి నీ విధానము నంగీకరించిన పక్షమున ముద్రాక్షరవిలేఖనయంత్ర కుంచికాఫలకమందలి కుంచికలసంఖ్యచాల భాగము తగ్గుటకు వీలున్నది. ఇందు కుదాహరణముగా నీ ప్రక్కపుటయందలి మూడవ చిత్రమున పొందుపరచిన కుంచికాఫలకమును జూడుడు.

ఇందు కుంచికల సంఖ్య చాల తక్కువగ నుండుటం జేసియు, ఉన్న కుంచికలన్నియు మూడు వరుసలం దమర్పబడి యుండుటంబట్టియు, కుంచిక కొక్కొంటికి మూడుసంజ్ఞలు గల్గి రెండు పరివర్తనకుంచికలు (Shift Keys) ఉండుటవల్లను నిజముగనిది యెంపైర్ (Empire) యంత్ర కుంచికాఫలకము (Key Board) ను బోలియున్నది. ఇందుగల వరుస కొక్కొంటికి

పదొకండేసి కుంచికల చొప్పున మూడువరుసలకును [౧౧ × ౩=౩౩] ౩౩ కుంచికలు గలవు. కుంచికకు మూడుసంజ్ఞలచొప్పున [౩౩ × ౩=౯౯] ౯౯ సంజ్ఞలిం దమర్పబడియున్నవి. మరియు నిందొక పూర్వస్థలదర్శిని (Back Space) కూడ గలదు. ఇందుగల సంజ్ఞలన్నియు స్థిరాస్థిరకుంచికల (వీనిగూర్చి తర్వాత దెల్పబడును) సౌకర్యమును బట్టి సమకూర్పబడినవి.

ఇందు ౪౨కుంచికలుండుటజేసి పదియవనెంబరు రెమింగ్టన్ (Remington No. 10) యంత్రముయొక్క కుంచికాఫలకమును, కుంచిక కొక్కంటికి మూడుచిహ్నములుగల్గి రెండుపరివర్తనకుంచికలుండుటంజేసి యెంపైర్ యంత్రముయొక్క కుంచికాఫలకమును బోలియున్నది. ఇందు నాల్గువరుసలుగల్గి, ఒకటవ, నాల్గవవరుసలందు పదేసి కుంచికలును, రెండవ, మూడవ వరుసలందు పదొకండేసి కుంచికలునుగల్గి మొత్తము ౪౨ కుంచిక లున్నవి. కుంచికకు మూడుచిహ్నములవంతున [౪౨ × ౩=౧౨౬] ౧౨౬ చిహ్నము లిం దమర్పబడినవి. మరియు నిందురెండు పరివర్తనకుంచికలును, ఒక పూర్వస్థలదర్శిని (Back Space)యునుకూడ గలవు. ఇటువంటి కుంచికాఫలకములకు త్రిరంగుళీవిన్యాసము (Three—Finger Method) కంటె జతురంగుళీవిన్యాసమే (Four—Finger Method) సమంజస మని నా యనుభవమువలనదోచుచున్నది.




స్థిరాస్థిర కుంచికాసహితంబైన ద్విపరివర్తిన కుంచికాయుతంబగు ఆంధ్రకుంచికాఫలకము

చిత్రము ౩




స్థిరాస్థిరకుంచికాసహితంబైన ద్విపరివర్తన కుంచికాయుతంబగు ఆంధ్రకుంచికాఫలకము

చిత్రము ౪

ఇందు మొదటివరుసలో కుంచికలలో నంకెలు, విరతులు తరచుగా వాడబడని యక్షరాదిచిహ్నములు మొదలైనగురుతులును, మిగిలినమూడువరుసలందు స్వర వ్యంజనాదులు, వానిసంజ్ఞాదులును గలవు. స్వరములకు జెందినసంజ్ఞలు వానిప్రక్క కుంచికలందును, వ్యంజనములకు జెందినసంజ్ఞలు వానిప్రక్క కుంచికలందును సమకూర్పబడినవి. అట్లు సమకూర్చుటయందా సంజ్ఞల యుపయోగస్వల్పత్వాధిక్యాదులను, స్థిరాస్థిరకుంచికల సౌకర్యమును గమనించియుండకపోవలేదను సంగతి కుంచికాఫలకమును దిలకించినవారికి దెలియకపోదని నా నమ్మకము. మరియు లిపియందు చాల తక్కువగ నుపయోగింపబడుచున్న ౖ ౢ ః అను అక్షరములును, ౖ ౢ ః అను సంజ్ఞలును, ౕ అను హల్సంజ్ఞయును మొదటి వరుసలోని కుంచికలలో జేర్పబడినవి. తణుకులించుక తరచుగా నుపయోగింపబడుచున్నందున రెండవ వరుసలోని ప్రథమ కుంచికయందును, వాని సంకేతములును, ఘ ఝ ః హ యను చిహ్నములును అంత తరచుగా నుపయోగింపబడనందున వానిని గుడిప్రక్క చివరభాగమునందు గల కుంచికలయందును సమకూర్చియుంటిని.

హల్లక్షరములకు ప్రక్క జేర్పబడు ( ్చ ్ఛ ్ఖ ్భ ్శ ్ఙ ్ఞ ్ఱ ్ఫ ్వ ్శ ్ష ్న అను నీ ౧౮ వర్ణచిహ్నములలో నేదైనను, అక్షర మాక్రమించుకొను స్థలమందర్ధభాగమందే యిముడగలదు. అయినను ఆంధ్రముద్రాక్షరవిలేఖనయంత్రమందక్షరవిన్యాసమున కెంతస్థలము (Space) నిర్ణయించి విడువబడునో, యంతస్థల మీపై నుదాహరింపబడిన వర్ణచిహ్నముల కనవసరమైనను విడువక తప్పదు. అప్పు డాంధ్రముద్రాక్షరవిలేఖన మించుక వికృతముగా గోచరించును. అంతియేగాక ఋ, ౠ, యు లకు రెండుకొమ్ము లీయవలసిన యవసరమున్నది గాన, ఒకకొమ్ముప్రక్క నింకొకకొమ్ము ముద్రించినప్పుడు, రెండవకొమ్ము మొదటికొమ్మునంటి ముద్రింపబడక, యించుకదూరమున ముద్రింపబడును. అక్షరమునకు వదలినంతస్థలము కొమ్మునకు కూడ వదలుటయే యిందులకు కారణమై యున్నది. ఈచిక్కును దొలగించుకొనుటకై కొమ్ముయొక్క నిడివిని బెంచితిమేని యక్షరమునకంటె కొమ్ము పెద్దదై ముద్రాక్షరవిలేఖనము మరింతవికృతమగును. (ఇందు కుదాహరణముగా రెండవ చిత్రమందలి కొమ్మును గమనింపుడు.) కాన నీ ౧౮ వర్ణ చిహ్నములకును అర్ధస్థలము (Space) నిచ్చుటకును, తక్కిన వర్ణచిహ్నములకును వర్ణములకును పూర్ణస్థలము (Full Space) నిచ్చుటకును, యంత్రమం దించుక మార్పుజేసి, మరికొంతయంత్రభాగమును జేర్చితిని. కాని దానివలన యంత్రనిర్మాణమందు చాల కష్టము గల్గుటయేగాక, యట్లు తయారైనయంత్రముయొక్క విలువకూడ ఎక్కుడగుటచే ముద్రాక్షరవిలేఖకులు కొనబోరు. అప్పుడు ఆంధ్రముద్రాక్షరవిలేఖనయంత్రమే మూలపడవలసివచ్చును. అందుచే పైని జెప్పిన యంత్రమందలి మార్పులనెల్ల వదలివేసి, యానుకూల్యమునుబట్టి పై నుదాహరింపబడిన ౧౮ వర్ణచిహ్నముల యాకారము నించుక పెంచి, వాని కక్షరములతోపాటు పూర్ణస్థలముల వదలి, కొమ్ముప్రక్క కొమ్ము ముద్రించునప్పుడు కల్గెడిచిక్కును దొలగించుటకు మాత్రము, జంటకొమ్ములచిహ్న మొకటి ప్రత్యేకముగా రెండవ కుంచికాఫలకమందు జేర్పడమైనది.

లఘురేఫచిహ్నము ఱ్రావడియక్షరమునకు ముందు ముద్రింపవలెనన్న ప్రస్తుతవిలేఖనపద్ధతికి విరుద్ధమగుటం జేసి ముద్రాక్షరవిలేఖకులకును, అక్షరమునకు క్రింద ముద్రింపవలెనన్న సంశ్లిష్ట వర్ణంబునకు గూడ ననువుగా నుండున ట్లేర్పాటు చేయవలసివచ్చును గాన యంత్రనిర్మాతలకును గష్టంబు గల్గించును. మరియు ముద్రాక్షరవిలేఖనమందు సంశ్లిష్టవర్ణంబున కేర్పరచిన ఱ్రావడి సేనత్తును గాని లేక కొమ్మును గాని గల్గియుండని వ్యంజనాక్షరమునకుగూడ క్రింద జేర్పవలసివచ్చి చేర్చినపక్షమున ఆవ్యంజనాక్షరమునకును ఱ్రావడికిని మధ్య కొంతకాళీస్థల మేర్పడి విలేఖన మించుక వికృతంబగును. ఈచిక్కుల నివారించునిమిత్తము ప్రస్తుతముద్రణమందు వాడబడు "ౢ" అను లఘురేఫచిహ్నమును గుంచికాఫలకమున జేర్చియుంటిని.

పూర్ణానుస్వారమునకు జంటకొమ్ముల చిహ్నమిడి వానిపై దలకట్టు జేర్చిన యకార మేర్పడగలదు కాని యట్లాచరించిన యకారముయొక్క నిడివి యెక్కుడై యైత్వ మిచ్చినప్పు డాయైత్వముయొక్క చివరభాగము యకారమందు గల పూర్ణానుస్వారము మీద ముద్రింపబడి యైకారము నికారమగును. అందుచే అనుస్వార-కొమ్మను నొక ప్రత్యేకచిహ్న మిందు జేర్పబడినది. కాన అనుస్వార-కొమ్ముచిహ్నమును ముద్రించి దానికి తలకట్టిడి కొమ్ము జేర్చిన యకార మగును.

లఘురేఫమునకు జంటకొమ్ముల చిహ్నమిడి పూర్వస్థలవర్శిని నొకసారి నొక్కి కామావిరతిని ముద్రించినపక్షమున ఝకార మేర్పడును.

ఫ, వ లకు మామూలుకొమ్ము లిడిన ఫు వు, లేర్పడగలవు.

ఇందలి యకార చిహ్నమునకు దలకట్టిడి జంటకొమ్ముల చిహ్నమిడిన యుకారమును, వ, బ లకు జంటకొమ్ముల చిహ్న మిడిన వు, బు లును, ముద్రితములగును. ఇటులనే తక్కినవికూడ గ్రహింపనగును.

చెప్ప మఱచితిని. ఙ, ఞ, ఱ యను అక్కరములయొక్క సంకేతము లేమాత్రమును లిపియందు వాడబడుచుండుటలేదు గాన వానిని గుంచికాఫలకములయందు జేర్చియుంచ లేదు.

ఈ కుంచికాఫలకముల నతిజాగ్రత్తగా బరిశీలించినపక్షమున, ప్రతికుంచిక నూర్ధ్వ భాగమున A అనిగాని, B అనిగాని వ్రాయబడియున్నట్లు గానంబడును. దానంజేసి వీనియందు గల కుంచిక లన్నియు రెండుభాగములుగ విభజింపబడినవనియు, అందు A గుర్తు గలవి అస్థిరకుంచిక లనుభాగమునకు జెందినవనియు, B గుర్తుగలవి స్థిరకుంచిక లను భాగమునకు జెందినవనియు గ్రహింపనగును. అస్థిరకుంచిక లన, ప్రస్తుతము ముద్రాక్షరవిలేఖనయంత్రములందు గల కుంచికలవలె నొక్కినప్పు డక్షరమును ముద్రించి ప్రక్క రాబోవు అక్షరమునకు తావొసంగునవని యర్థము. కాని స్థిరకుంచిక లట్లు కాదు. అస్థిరకుంచికలవలెనే యీస్థిరకుంచికలును నొక్కినప్పు డక్షరవిన్యాస మొనరించును గాని, వానివలె ప్రక్క రాబోవు అక్షరమునకు జోటుమాత్ర మొసంగబోదు. (ఇందులకు గారణము దరువాత దెలుపబడును.)

ఇందువలన మనకు జాల లాభ మున్నది. మన మిపుడు "స్థా" యను సంశ్లిష్టవర్ణము ముద్రింపవలె ననుకొనుడు. అందులకు ద్వితీయకుంచికాఫలకమును దిలకింపుడు. దానియందలి రెండవవరుసలోని నాలవకుంచికను నొక్కినయెడల నాకుంచికలోని మొదటియక్షరమగు "స" కారము ముద్రితమగును. ఈసకారము గలకుంచిక స్థిరకుంచికలలోనిది గాన, దీని నొక్కినప్పుడు సకారమును ముద్రించినది గాని దానిప్రక్క రాబోవు నక్షరమునకు జోటుమాత్ర మొసంగినది గాదు. (అనగా వాహనము (Carriage) కుడిప్రక్కనుండి యెడమప్రక్కకు కదలి చోటు (Space) ఇచ్చినది కాదని యర్థము.) అందుచే నా సకారమునకు "థ" ఒత్తు నిచ్చుటకు పూర్వస్థలవర్శిని నొక్క నవసరము లేకయే "స"కారము గమ్యస్థాన మలంకరించియున్నది. కనుక నిప్పుడు నాల్గవవరుసలోని రెండవకుంచికను నొక్కిన యెడల నందలి మొదటి యక్షరమగు "థ" ఒత్తు "స" క్రింద ముద్రితమగును. ఈ "థ" ఒత్తుగలది కూడ స్థిరకుంచికయే కాన తొంటియట్లు వాహనము కదలనేరదు. అందుచే నిప్పుడును పూర్వస్థలవర్శిని నుపయోగింపకయె రెండవవరుసలోని పదునొకండవకుంచికను నొక్కిన "ా" లంబరేఖ "స్థ" పైన ముద్రితమగును. ఇదియు స్థిరకుంచికయె కాన వాహన మట్లే నిలిచియుండును. ఇప్పటికి "స్థ" అను నాకారము ముద్రితమైనది. ఇక మూడవవరుసలోని యేడవ కుంచికను (ఇందుకు పరివర్తనకుంచికసాయ మవసరమైయున్నది. ఎందుచేతనో గ్రహింపుడది.) నొక్కి "ా" దీర్ఘమును ముద్రించిన వెంటనే వాహనము కుడిప్రక్కనుండి యెడమప్రక్కకు జరిగి, రాబోవు అక్షరమునకు తావొసంగును. ఎందుచే నన, "ా" గల కుంచిక అస్థిరకుంచికలలో చేరినది. ఇప్పటికి "స్థా" యను సంశ్లిష్టవర్ణము ముద్రితమైనది.

మరియు నింకొక విషయము గలదు. పూర్వస్థల దర్శిని ఒక్కపర్యాయము నొక్కుటకు వ్యయపడు కాలములో, అక్షరకుంచిక (Key) రెండుపర్యాయములు, లేక, రెండుకుంచికలు, నొక్కుటకు వీలున్న దను విషయము విలేఖకులకు అనుభవసిద్ధమే. కాన "భారతి" యనుపదము ముద్రించునప్పుడు భకారమునకు దీర్ఘమును జేర్చునపు డొకసారి, రకారమునకు తలకట్టు జేర్చుట కొక్కసారి, తకారమునకు గుడి జేర్చుట కొకసారి గలసి వెరసి మూడుసారులు పూర్వస్థలదర్శిని నొక్కవలసినయవసరము స్థిరాస్థిరకుంచికలు లేనితరి గల్గును. ఈమూడుసార్లు పూర్వస్థలదర్శిని నొక్కుటకు వ్యయపడినకాలములో మూడురెట్లారు కుంచికలు నొక్కుటకు వీలున్న దని యీ పేరాయొక్క మొదటిభాగమందు జెప్పబడిన యంశమును బట్టి విశద మగుచున్నది. అనగా, "భా ర ॅ తి" యను నీ యారుగుర్తులచే నేర్పడిన "భారతి" యను పదము పూర్వస్థలదర్శిని నొక్క నవసరము లేనియెడల మరల నొకసారి "భారతి" యను పదమును ముద్రింప వీలగును. అంతియేగాక, ప్రస్తుతాంగ్ల ముద్రాక్షరవిలేఖన యంత్రమందలి పూర్వస్థలదర్శిని నంత తరచుగా నుపయోగింపకపోయినను త్వరలో చెడి పోవుచుండుట మనము చూచుచునేయున్నాము. అట్టితఱి మన యాంధ్ర ముద్రాక్షర విలేఖనయంత్రమందలి పూర్వస్థలదర్శిని ప్రతి అక్షరమునకు నొక్కుచుండినపక్షమున నెంత త్వరలో చెడిపోవునో వేరె చెప్పవలయునా? కాన యీ విషయములబట్టి స్థిరాస్థిరకుంచికల నేర్పర్చుట వల్ల నెంతలాభ మున్నదో పాఠకులే నిర్ణయించుకొందురుగాక.

ఇక స్థిరాస్థిరకుంచిక లెట్లేర్పడినవో విపులముగ నెరుంగుట కీప్రక్క పొందుపరచిన ౨వ చిత్రమును జూడుడు.

ఇయ్యది రెమింగ్టన్ పదియవ నెంబరు ముద్రాక్షర విలేఖన యంత్రమందలి యొక భాగము.

ఈచిత్రమందు K అనుకుంచికను నొక్కినప్పుడు, దానిస్థానము K 1 అనుచోటునకు మారగలదు. దానినిబట్టి K 2 అను ఊచ (Rod) K 3 అను స్థానమునకు మారగలదు. అప్పు డాయూచకు గల N అను చిన్నిమేకుయొక్క యడుగుభాగము A అను పేరు గల రేకుపట్టాను క్రిందికి నొక్కివేయును. అంత నారేకుపట్టా ననుసరించియున్న B యనుపేరుగల కీళ్లు (Joints) క్రిందకు లాగబడి, వాని ననుసరించియున్న C యను ఇనుపకడ్డీ కొంచెము త్రిప్పబడును. అందుచేత నా C యనుదానికి మరమేకుతో బిగింపబడి, D యనునక్షరము గుర్తువేయబడియున్న పనిముట్టు (Instrument) తనస్థానమును మారి, క్రిందకు వంగి, తననోటితో ఎట్టియుంచిన W అనుతీగను క్రిందకు లాగును. ఆ W అనుతీగ ఎస్కేప్మెంటు వ్హీల్ (Escapement Wheel) ను తిరుగకుండ అడ్డుపడుచున్న పనిముట్టును కదల్చి, ఎస్కేప్మెంట్ వ్హీల్‌ను ఒకస్పేసు మాత్రము తిరుగుటకు వీలు కలుగునట్లు చేయుచున్నది. ఈవిధముగ, ఒక యక్షరము ముద్రింపబడినపుడు (అనగా ఒక కుంచిక నొక్కబడినపు డని యర్థము) ప్రక్క రాబోవు అక్షరమునకు చోటొసంగుచున్నది. కుంచిఫలకములోని యేకుంచికను నొక్కినప్పటికిని పై వివరింపబడిన చర్యలన్నియు దప్పక జరుగునని యెరుంగునది.



చిత్రము ౨

189. నామా చ కాశ్యపశ్చాశ్వలాయనః । రామాభట్టార్యతనయో వృత్తి
190. మేకామిహాశ్నుతే । [౧౧౬॥] లింగంభట్టారకో నామ కాశ్యపశ్చాశ్వలాయనః ।
191. రామాభట్టార్య తనయో వృత్తిమేకామిహాశ్నుతే । [।*౧౧౭॥] లింగంభట్టాత్మజశ్చా
192. శ్వలాయనో మంగణాహ్వయః విశ్వామిత్రాన్వయేజాతో వృత్తిమేకామిహా
193. శ్నుతే । [।*౧౧౮॥] కృష్ణంభట్టాహ్వయశ్చాశ్వలాయనః శ్రీపతేః సుతః । విద్వాన్
194. వసిష్ఠగోత్రశ్చ వృత్తిమేకామిహాశ్నుతే । [।*౧౧౯॥] వత్సగోత్రోద్భవశ్చాప
195. స్తంబో [*ఽ] నంతప్పనామభృక్ । సూనుర్వరదరాజస్య వృత్తిమేకాం

ఐదవ రేకు : రెండవ ప్రక్క

196. ఇహాశ్నుతే । [।*౧౨౦॥] కామాభట్టాత్మజశ్చాశ్వలాయనః కాశ్యపాన్వయః ।
197. కొండంభట్టారకో నామ వృత్తిమేకామిహాశ్నుతే । [।*౧౨౧॥] భారద్వాజాన్వయ
198. శ్చాశ్వలాయనః కేశవాత్మజః । సిరిగంభట్టనామా చ వృత్తిమేకా
199. మిహాశ్నుతే । [।*౧౨౨॥] గర్గగోత్రోద్భవశ్చాపస్తంబీ శ్రీకృష్ణయాహ్వయః । శ్రీవెం
200. గడస్యతనయో వృత్తిమేకామిహాశ్నుతే । [।*౧౨౩॥] ఆపస్తంబాఖ్యసూత్రీ చ మాధ
201. వోమాచయాత్మజః । కౌండిన్యగోత్రసంజాతో. వృత్తిమేకామిహాశ్నుతే ॥ [*౧౨౪॥]
202. విరూపాక్షాహ్వయశ్చాపస్తంబీ కౌండిన్యగోత్రజః । నారాయణార్యత
203. నయో వృత్తిమేకామిహాశ్నుతే । [।*౧౨౫॥] శ్రీరామానుజదాసస్య సూనుః కాశ్యప
204. గోత్రజః । బోధాయనో[ఽ*]నందాళ్వాఖ్యో వృత్తిమేకామిహాశ్నుతే ॥ [*౧౨౬॥]
205. పోచిభట్టాహ్వయశ్చాపస్తంబీ గంగాధరాత్మజః । ధీమానాత్రేయగో
206. త్రశ్చ వృత్తిమేకామిహాశ్నుతే । [।*౧౨౭॥] మారాభట్టార్యతనయో లింగాభట్టా
207. హ్వయః సుధీః । ఆపస్తంబో[ఽ*]శ్నుతే వృత్తి మేకాం కౌశికగోత్రజః ।[।*౧౨౮॥] రామా
208. భట్టాత్మజశ్చాపస్తంబశ్చెవ్వందినామభృక్ । పరాశరాన్వయే జాతో
209. వృత్తిమేకామిహాశ్నుతే । [।*౧౨౯॥] వల్లభార్యసుతశ్చాపస్తంబీ కౌండిన్యగో
210. త్రజః । ధీమాన్తిమ్మయభట్టాఖ్యో వృత్తిమేకామిహాశ్నుతే । [।*౧౩౦॥] కామా
211. భట్టాత్మజశ్చాపస్తంబీ వాధూలగోత్రజః । లింగయాఖ్యో[ఽ*]త్తిమేధావీ
212. వృత్తిమేకామిహాశ్నుతే ॥ [*౧౩౧॥] వల్లంభట్టాఖ్యతనయ స్తిమ్మాభట్టారకా
213. హ్వయః । ఆపస్తంబో[ఽ*]శ్నుతే వృత్తి మేకాం శాండిల్యగోత్రజః । [।*౧౩౨॥] బొభ
214. ళార్యస్యతనయ స్తిమ్మయాఖ్యో మహామతిః । ఆపస్తంబో[ఽ*]శ్నుతే
215. వృత్తి మేకాం కౌశికగోత్రజః । [।*౧౩౩॥] ఆపస్తంబీ భరద్వాజగోత్రజ స్తిం

216. మ్మయామాహ్వాయః । వెంగళాఖ్యస్యతనయో వృత్తిమేకామిహాశ్నుతే ॥ [*౧౩౪॥]
217. అంనం[1]భట్టాఖ్యతనయ స్తి మ్మాభట్టాహ్వాయః సుధీః । ఆపస్తంబో[ఽ*]శ్నుతే
218. వృత్తి మేకాంసంకృతిగోత్రజః । [।*౧౩౫॥] శ్రీమాన్కేనేరిదేవాఖ్య స్తిమ్మాభ
219. ట్టాఖ్యనందనః । ఆపస్తంబో[ఽ*]శ్నుతేవృత్తి మేకాంశ్రీవత్సగోత్రజః [॥*౧౩౬॥]

ఆరవరేకు : మొదటిప్రక్క

220. లక్ష్మీభట్టార్యతనయ స్తింమ్మాభట్టాహ్వాయఃసుధీః । శ్రీవత్సాప
221. స్తంబసూత్రో వృత్తిద్వయమిహాశ్నుతే । [।*౧౩౭॥] ఆత్రేయాపస్తంబసూత్రో
222. వీరాభట్టాఖ్యనందనః । సర్వాభట్టాభిధానశ్చవృత్తిమేకా
223. మిహాశ్నుతే । [।*౧౩౮॥] ఆపస్తంబీగర్గగోత్రః సూనుర్నారయజ్వనః ।
224. యజ్వాహస్తిగిరీంద్రాయో[ఽ*]శ్నుతేవృత్తిచతుష్టయం । [।*౧౩౯॥] ఆపస్తంబీ
225. తిమ్మయార్యసూనుః కౌశికగోత్రజః । సౌమ్యకేశవదాసార్యో
226. వృత్తిద్వయమిహాశ్నుతే । [।*౧౪౦॥] సర్వాభట్టాత్మజో భారద్వాజగోత్రో
227. ద్భవఃసుధీః । ఆపస్తంబీసోమయార్యో వృత్తిమేకామిహాశ్నుతే [॥*౧౪౧॥]
228. ఆపస్తంబ్యబ్బయాఖ్యశ్చ సూనురాత్రేయగోత్రజః । ఎల్లయాఖ్యో
229. వృత్తిమేకా మశ్నుతే నిశ్చలాత్మకః । [।*౧౪౨॥] ఆపస్తంబ్యబ్బయాఖ్యస్య
230. సూనురాత్రేయగోత్రజః । తిమ్మయాఖ్యో[ఽ*]తిమేధావీ వృత్తిమేకా
231. మిహాశ్నుతే ॥ [*౧౪౩॥]స్వగ్రామవాసినాంసమ్యగ్రక్షితుఃపార్వతీపతేః
232. వృత్తిరేకాతిసుఖదా సుధాహారాయకల్పితా । [।*౧౪౪॥] స్వగ్రామవా
233. సినాంసమ్యగ్రక్షితుఃశ్రీరమాపతేః । వృత్తిరేకాతిసుఖదా
234. సుధాహారాయకల్పితా । [।*౧౪౫॥] వేదాభ్యాసరతానాంచ బాలకానాం
235. ద్విజన్మనాం । రుగ్యజు[2]ర్వేదవక్తౄశ్చ కల్పితంక్షేత్రయుగ్మకం । [।*౧౪౬॥]
236. ఈఅచ్యు[*త]రాయసముద్రవెం । బీ అగ్రహారక్కె హాంసకాల్వెయ
237. తహల్లి[3] వీరాదిమంగలద సీమెయల్లి కాల్వెయనగదు[4]
238. కొండు హోకదక్కె[5] ఆనెలనభేగెగాగి ప్రతియాగి అచ్యుత
239. రాయసముద్రదొళగె కొట్టదు ఇప్పత్తుఖండుగగద్దె ॥

---

1. అన్నం అని. 2. 'ఋగ్యజు' అని. 3. 'తహల్లి' అనునది గ్రామ్యము. 'తపఃల్లి' అనునది దీనికి సరియైన రూపము. 'తపఃల్లి' మొదట తప్పల్లిగ మారి కడపట తహల్లియైనది. 4. "నగిదు" అని. 5. హోదుదక్కె.

240. ఆఅచ్యుతరాయసముద్రద కాల్వెయమేలె పాలవనూ కట్టి ।
241. పిరాదిమంగలద కాల్వెయ నీరనూ హరియిసికాట్టు[1] ఆపాల
242. [2]ఓడుదరేముఱిదదుంటాదరె[3] ఆపిరాదిమంగలదవరె కట్టిసువ

ఆరవ రేకు : రెండవ ప్రక్క

243. ఉంపక్షుయక్కె[4] శలవాగికొట్టదు[5] యెరడుఖండుగగద్దె॥—॥
244. ఈ అచ్యుతరాయసముద్ద్రవెంబ[6] అగ్రహారక్కె ఎల్లె । తెంబాంగలీక
245. నాడిగెసలువ నీలంబేరూరు । అదఱ[7] కాల్వళి[8] పుత్తూరు । నరెయ
246. నూరనాడిగె సలువ కొళుంజవాడి యొళగాగి అగ్రహార
247. వాద । అచ్యుతరాయసముద్రద చతుస్సీమెయ మేరెయ వివర ।
248. మూడణదిక్కిగె మూలనూర ఎల్లెతలహినల్లి[9] నెట్టవామనముద్రెకల్లు
249. దక్షిణదిక్కిగె రాయగుళద ఎల్లెశిలహినల్లి నెట్టవామనముద్రకల్లు
250. అదక్కె పడువణ దిక్కిగె పత్తియూర ఎల్లెతలహినల్లి నెట్టవామన
251. ముద్రెకల్లు । అదఱింద[10] పడవలు మణకడహిన ఎల్లెయల్లి నెట్ట ।
252. వామనముద్రెకల్లు । అదఱింద పడువలు పిరాదిమంగలద హిరియకాల్వె ।
253. అదఱింద బడగలు తిరుగిద ఎల్లెవివర । అదఱింద బడగలు పిరాది
254. మంగలద కాల్వెయ వోరగొండు ఆ కాల్వెయ మూడలు నెట్టవామనముద్రెయ
255. కల్లు । అల్లింద బడగలు । మూఱు[11] ఆలదమరద కెళగె నెట్టవామన
256. ముద్రెకల్లు । అదక్కె బడగలు పిరాదమంగలద హెద్దారివిడిదుకీళు
257. మణ్ణఱే[12] వొళగాగి నెట్టవామనముద్రెకల్లు । అదకె మూడలు వోడెయ
258. పిరాటియ యెల్లెగె తెంకలాగి నెట్టవామనముద్రెకల్లు॥
249. అదక్కె ఈశాన్య అమ్రావతీహాళె । ఆకల్లిగె ఈశాన్యక్కె
260. పెరమయద ఎల్లెకల్లు । అదక్కె ఈశాన్యక్కె । (।) మూలనూర ఎల్లెకల్లు॥

ఏ డ వ రే కు

261. ఈ తామ్రశాసనవూ । (।) కొంగుధారాపురక్కె మూడలు అర్ధయోజన
262. దల్లి సర్వమాన్యవాద అచ్యుతరాయసముద్రవెంబ అగ్రహారక్కె

1. కొట్టు. 2. ఒడదరె. 3. 'ముటిగుదుంటాదరె' అని. 4. 'ఉపక్షయ' అని. 5. 'సలువాగి కొట్టుదు'. 6. 'అచ్యుతరాయసముద్రవెంబ' అని పఠించవలయును. 7. 'అదఱ' అని. 8. 'కాల్వళ్లి'. 9. 'తలెహినల్లి'. తక్కిన చోట్లను అట్లే. 10. "అదఱింద" అని. తక్కినచోట్లను అట్లే. 11. "మూఱు". 12. ఱే.

263. విద్యానగరియల్లి సింహాసనస్థరాగి ఇద్దంథా అచ్యుతదేవ
264. మహారాయర స్వహస్తద ఒప్పవనుళ్ల ఈతాంమ్ర[1]శాసనవనూ ।
265. చోళాన్వయద చెన్నరాజతనూభవ బాలరాజగళూ అచ్యుత
266. రాయమహారాయరకయ్యల్లి పాలిసికొండు ఆకొంగుథారాపురద
267. అ(గ్రా)మావతియెంబ హొళెయల్లి తంమ[2]ఉభయవాగి హొసఅణెయనూ ।
268. కట్టిసి హొసకాల్వెయనూ తందు ఆగ్రామసీమెయకుళవనూ
269. ఆనాడవరిగె కళిదుకొట్టు తమ్మస్వామి అచ్యుతదేవమహా
270. రాయరహెసరినల్లి । (।) అచ్యుత[3]రాయ సముద్రవెందు నామాం
271. కితవనూ మాడి కృష్ణార్పణబుద్ధియింద ఈఅగ్రహారద నూ రఱ[4]
272. హత్తువృత్తియనూ వేదాంతవిత్తుగళాగి ఇద్దంథా బ్రాహ్మణోత్తమరిగె
273. సహిరణ్యోదకదాన ధారాపూర్వకవాగి ఆచంద్రార్కస్థాయియాగి తంమ[5]
274. స్వామి అచ్యుతరాయమహారాయరిగె పుణ్యవాగలియెందు చోళవంశోద్భవ
275. బాలరాజగళూ కొట్ట సీలంబెరూరు కొళుంజవాడి చతుఃసీమయొల[6]గాదకొల్వళ్లి సహ
276. వాగి సర్వమాన్యవాద అచ్యుతరాయసముద్రవెంబ అగ్రహారద తామ్రశాసన ।
277. దానపాలనయోర్మధ్యే దానాచ్ఛ్రే(యో)[ఽ*]నుపాలనం । దానాత్స్వర్గమవా
278. ప్నోతిపాలనాదచ్యుతం పదం । [।*౧౪౭॥] స్వదత్తాద్ద్విగుణంపుణ్యం పరదత్తా
279. నుపాలనం । పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలంభవేత్ । [।*౧౪౮॥] స్వ
280. దత్తాం పరదత్తాంవా యోహరేతు[7]వసుంధరాం । షష్టివర్షసహ
281. స్రాణి విష్ఠాయాంజాయతేక్రిమిః । [।*౧౪౯॥] ఏకైవభగినీలోకే సర్వే
282. షామేవభూభుజాం । నభోజ్యా నకరగ్రాహ్యా విప్రదత్తావసుంధరా [।*౧౫౦॥]
283. సామాన్యో[ఽ*]యం ధర్మసేతుర్నృపాణాం కాలేకాలే పాలనీయో భవద్భిః ।
284. సర్వానేతాన్భావినః పార్థివేంద్రాన్భూయో భూయో యాచతే రామచంద్రః॥
[।*౧౫౧॥]
285. శ్రీమదచ్యుతరాయేంద్రః (।) శాసనాచ్ఛసభాపతిః ఆభాణీన్మృదు
286. సందర్భం తదిదంతామ్రశాసనం । [।*౧౫౨॥] శ్రీమదచ్యుతరాయేంద్ర శాసనాత్
287. మల్లణాత్మజః । అసౌశ్రీవీరణా
శ్రీవిరూపాక్ష 288. చార్యోవ్యలిఖత్తామ్రశాసనం॥—॥ [*౧౫౩॥][8]

1. "తామ్ర" అని. 2. 'తమ్మ' అని. 3. 'అచ్యుతరాయ'లోని 'త' మొదట విడువబడి తరువాత "చ్యు" 'ర' ల మధ్య సూక్ష్మముగ చెక్కబడియున్నది. 4. 'నూఱు.' 5. 'తమ్మ' అని. 6. 'యొళగాద' అని. 7. 'హరేత' అని. 8. శ్లోకములు ౩౭ మొదలు ౧౫౨ వఱకును అనుష్టుభులు.

# ఛాయామూర్తివిలాసము

'కవిరాజహంస'—౧

ప్రకృతి పురుష స్వభావోపపాదనమున
*ఛాయయేమూర్తి మూర్తియేఛాయ
[యనుచుఁ
దెలుపు మఱపులఁ దేల్చి సంధించి పలుకు
వాదకర్తల కెందు నావందనములు.

మూర్తి:—

కను విప్పి చూడఁగంటిని
మనసైనది కదలి మెదలి మాటాడంగా
నను మేలుకొలిపి రెవ్వరు?
ఘన యోగారూఢనిద్రఁ గాంచినవానిన్.

ఒంటినై యుండు టెఱుఁగుదు, నోరులు వచ్చి
♦పలుకలేరని యెఱుఁగుదుఁ, బిలుచుచుంటిఁ
గూడి మసలంగవలెనని కోరుచుంటిఁ
బలుకరే! రారె! యెవరున్న భ్రాంతి గాక!

ఛాయ:—

ఓయని పలుకుదు నిదె నీ
ఛాయను, నామూర్తి! †భ్రాంతి చనునయ్యా,
[నన్నున్
నీయాజ్ఞావర్తిని, నీ
ప్రేయసి, నీపాదదాసిఁ, బ్రీతిం గనుమా!

మూర్తి:—

ఛాయా! ప్రేయసి! చెపుమా!
నాయెడ లటు జల్లుమనఁగ నాకోర్కెలతో
నాయుల్లముల్ల సిల్లఁగ
సాయపడినయట్టి ‡మంత్రసానివి నీవా!

గర్భనరకమో స్వర్గమో కాని యెఱుఁగ,
అంధకారమో తేజమో యది యెఱుంగ,
ఉద్భూతాజ్ఞానమో జ్ఞానమో యెఱుంగ,
చెప్పలేని యవస్థఁ గాంచితిని నాఁడు.

మాయామయగోళంబునఁ
గాయము గనరాక బిందుకళలో డిందన్
వాయెఱుఁగనిగతి నుండితి
ఛాయా యానాఁటి కెందు చనితివి చెపుమా!

ఛాయ:—

లీలామూర్తివి నాకున్
జాలిం బడ నేల? క్రొత్తసంసారమె! నీ
కోలిం ¶బాములువడఁగా
నేలా? యది మనవిలాస మెఱుఁగవె మూర్తీ!

---

* ఛాయయే మూర్తి, మూర్తియే ఛాయ యనియును.

♦ పలుకలేరు పలుకుటకు లేరు, అనియును.

† భ్రాంతియే యొప్పుననియును.

‡ లౌక్యమునకు రాణివి - అనఁగా మంత్రివనియును.

¶ బాములు — కష్టములు — పుట్టువులు అనియును.

మూర్తి:—

నిండు వెలుఁగునఁ జూచితి నీవు లేవు,
నిండుచీఁకటిఁ గాంచితి నీవు లేవు,
వెలుఁగుఁ జీఁకటినందుల వెదకికూడ
నాఁడు నాచాయ! నిన్నుఁ గానంగనైతి.

ఛాయ:—

నిండువెలుఁగు దలంపఁగా నీవు గావె
నిండుచీఁకటి గణియింప నేను గానె
వెలుఁగుఁజీఁకటి *మనమైనవిధముఁ దెలిసి
నాఁడు నామూర్తి! వేఱె కానంగ నేల?

మూర్తి:—

నిన్ను వేఱుసేసి నే నిల్వఁగందునే
ఆకులతకు మూల మదియె కాదె,
భ్రాంతిలతకు ద్వంద్వఫలసిద్ధి యది కాదె
అదియె నీదులీల యగును గాదె.

ఛాయ:—

లేదు పాపపుణ్యంబులలీల నాకు
లేదు సుఖదుఃఖపరిణామలీల నాకు
లేదు కీర్త్యపకీర్తులలీల నాకు
నీయడుగులీల యొక్కటే నియతి నాకు.

మూర్తి:—

నాతోడునీడఁగా నడయాడుదువు గాని
యేకోరికయుఁగూడ నీకు లేదు,
నేఁ జేయుపనుల నన్నిటఁ గూడుదువు గాని
యేకర్మమునుగూడ నీకు లేదు,
నాయున్నతికొలంది †నాక మంటుదు గాని
యే‡కొలయునుగూడ నీకు లేదు,
నే బడలి పరుండ మైఁ బట్టుదువు గాని
యేకష్టమునుగూడ నీకు లేదు
నిజము నాచాయ! యేదియు నీకు లేదు,
లోకమున లేని దేదియు నాకు లేదు,
అన్ని యున్నవి నీ వున్నయపుడె నాకు,
కలది యేదియు లేదు నాకంటె నీకు.

ఛాయ:—

ఆదర్శమూర్తి! నాకున్
నీజీవన యేటిక్రొత్త, నిత్యాశ్రయస
మ్మోద ◆మనాదిగ నిచ్చిన
నాదైవమ నీవు గావునన్ సేవింతున్.

మూర్తి:—

మున్నాడి మెసవనోల్లవు
నన్నెడసి, యొకప్పుడేని నాపానుపుపై
వెన్నొంపవు మున్నగ §నా
కన్న సతీరత్న మీవు గావే చాయా!

ఛాయ:—

నిత్య పురుషమూర్తీ! నినుఁ
బత్యనురూపమునఁ బడసి బ్రహ్మాండమునఁ

---

* మనము — మన మిరువురమును, మనస్సు అనియును.

† ఉప్పొంగుదువు.

‡ కొల-కొలత, పాపము.

◆ అనాదిగ అనియు - నాదిగ - నాసొంతమైనదిగ అనియు.

§ నాకన్న-నాకంటె, నేనుకన్న అనియు.

*సత్యాఖ్యఁ బొందఁగంటిని
†సత్యమునకుఁ జాయ నైతి సౌభాగ్యమునన్.

మూర్తి:—

సుమమున సౌరభమట్టులు
క్రమమున నాలోన నిండి, కాలపవనవి
భ్రమమున వెనుకను ముందును
సమయ మెఱిఁగి సంచరించుచతురవు చాయా!

ఛాయ:—

నీలో నుండుదుఁ గానీ
నాలో నీ వుంటివే! సనాతన నన్నుఁ
గాలానువృత్తిఁ బెట్టిన
జాలికుఁడవు నీవు గావె శాశ్వతమూర్తీ!

మూర్తి:—

నా కన్నదాన వయ్యును,
నాకన్నులపాప వయ్యు, నాయడుగులనే
మైకొన్న చామ వయ్యును
నాకు సనాతన వదెట్లు నన్నుదుఁ జాయా!

ఛాయ:—

సకలలోకావనశంభుమూర్తివి నీవు
నీ ‡యొంటియద్దంపుఁజాయ నేను,
విశ్వ సమ్మోహన విష్ణుమూర్తివి నీవు
నీయెదఁ గల సిరిచాయ నేను

అక్షరాగమ చతురాస్యమూర్తివి నీవు
నీయొప్పిదపుఁ బల్కుఁజాయ నేను,
భవ్యతేజోమయ భానుమూర్తివి నీవు
నీయడుగులఁ బట్టు చాయ నేను,
మూలరూప పరబ్రహ్మమూర్తి వీవు,
మూలహేతుమాయానంతమూర్తి నేను,
నను సనాతనఁ, బ్రకృతి, ననంత, లీల
నీశ! నీయనంతచ్ఛాయ నేలికొనుము.

మూర్తి:—

§ కంటిలోఁ బాపవు గావె నాచాయ!
వెర వేది నిన్నింక వేఱుసేయంగ;

ఛాయ:—

ఇంటిలో దీపంబ వీవె నామూర్తి!
వీ లేది నిన్నింక వీడి యుండంగ;

మూర్తి:—

కష్టప్రపంచంబు గడచన్నదాఁక
నాతోడ నుండుమా నాచాయ నీవు;

ఛాయ—

సృష్టికి విశ్రాంతి చేకూరుదాఁక
నను వీడఁబోకుమా నామూర్తి నీవు;

---

* సతీ-ఆఖ్య; సత్య-ఆఖ్య అనియు: ఇందు నిత్యనకు సత్యయు, పురుషునకు సతియు అనుస్ఫురణ యున్నది.

† సత్యమునకు నిజమునకు చాయను, చాయను-మాయనైన నేను, సౌభాగ్యవశమున సత్యస్వరూపుఁ డైన నీకు జాయనైతినని ధ్వని.

‡ ఒంటియద్దము-ఏకాగ్రము, అర్ధశరీరమని.

§ కంటిన్ - లోన్ - పాపవు గావె-చిన్నబిడ్డవు, గావు అనియును.

మూర్తి:—

అద్వయానందభాగ్యము కల్గుదాఁక
ననుఁ గొల్చుచుండుమా నాచాయ నీవు;

ఛాయ:—

అమర బ్రహ్మానంద మబ్బినదాఁక
నాసేవ లందుమా నామూర్తి నీవు;

ఛాయ:—ఓ జగద్విధాత!

మూర్తి:—ఓ జగద్రూపిణీ!

ఛాయ:—వందనము.

మూర్తి:—శుభాభినందనములు.

ఛాయ:—ఓ యనంతమూర్తి!

మూర్తి:—ఓ యనంతచ్ఛాయ!

ఛాయ:—నిత్యజయము నీకు.

మూర్తి:—నిత్యశుభము.

---




3. శీఘ్రజలగామి ' మిస్ ఇంగ్లండు III.'

P. P. A.

# నూతనరాజ్యాంగవిధానము, స్వదేశసంస్థానములు

తేకుమళ్ల రామచంద్రరావు పంతులుగారు, యమ్. ఏ., బి. యల్.

## ఉపక్రమణిక

భారతదేశమునకు గావలసిన రాజ్యాంగవిధానమునుగూర్చి కొన్ని సంవత్సరములనుండి జరుగుచున్న చర్చలలో నిటీవల స్వదేశసంస్థానాధీశులును పాల్గొని మనరాజకీయములలో నొక నూతనభావోదయమును సంప్రాప్తింపజేసిరి. భారతదేశపరిపాలనవిషయమున నిర్ణీతముకాగల యెట్టివిధానమునకైనను నాధారములగు ముఖ్యసూత్రములలో స్వదేశసంస్థానములుగూడ మన భారతసామ్రాజ్యభాగములుగ నుండి బ్రిటిష్-ఇండియాయందలి రాష్ట్రములతో సరిసమానముగ తులతూగుచు భారతదేశపు కేంద్రప్రభుత్వమునగూడ ప్రాతినిధ్యము గలిగియుండుట యొక ముఖ్యసూత్రమై యున్నది. ఈసూత్రమేయొక్క-పార్టీవలననో మాత్రమే యామోదించబడినది కాదు; అందరు బ్రిటిష్‌పార్టీదారులవలనను, బ్రిటిష్‌ప్రభుత్వమువారివలనను, భారతదేశమునందలి కాంగ్రెస్, మితవాద్యాదిపక్షములవలనను నిగాఢముగ నామోదించబడినది.

కాని ఈస్వదేశసంస్థానముల నన్నిటిని రాజ్యాంగవిధానమున నెట్లు సమన్వయించుట యనునది మిక్కిలి కష్టమగుసమస్య. ఏలయన, భారతదేశమునందలి యీస్వదేశసంస్థానములసంఖ్య సుమారు ఏడువందలకు మించినది. హైదరాబాదు, బరోడా, మైసూరు, తిరువాన్కూరు, కాశ్మీర్, మొదలగు పెద్దపెద్ద భూవసతిగల సంస్థానములు మొదలు ఏయొక్క గ్రామమో రెండుగ్రామములో తమ యావత్సంస్థానముగ గల కథియవాడ్ సంస్థానములవఱకును మనదేశమున గలవు. ఇవన్నియు బ్రిటిష్-భారతదేశపు పెద్దపెద్ద రాష్ట్రములతోపాటు పరిపాలనావిషయమున సమానసత్వములు గలిగి యెట్లు నిలువబడగలవు? పెక్కురకములుగనున్న యీ యేడువందల సంస్థానములను మనమెట్లు మేళగించగలుగుదుము? ఈసంస్థానాధీశుల కందరకును సమానత్వ మొసగుటయు, శాసనసభలను వీరందరితోను బ్రిటిష్-ఇండియా ప్రతినిధులతోను నింపుటయు అనువుగానట్టియు, హాస్యాస్పదములగునట్టియు మార్గములని యెల్లరును గ్రహించుచున్నారు. కావున భవిష్యద్రాజ్యాంగవిధానమున స్వదేశసంస్థానములను గూడ బ్రిటిష్-యిండియాతో కలిపియే తత్సంస్థానములును మనమును సమానముగ నిలువగల 'ఫెడరల్' పద్ధతిని తయారుచేయుట ప్రస్తుతసమయమున ముఖ్యమైయున్నది. రౌండుటేబిల్ కాన్ఫరెన్సువారును తదితరులును ఈవిషయమై శ్రద్ధవహించుచున్నారు. కాని, ప్రజలకు స్వదేశసంస్థానములను గుఱించికాని వానివిషయమై రానున్న మార్పును గుఱించికాని యేమియు తెలియదు. తెలిసినసంగతులు సరిగ బోధపడుట లేదు. ఆంధ్రదేశీయుల కీవిషయములనించుక బోధపరచుటకును, నాయభిప్రాయములను వారి కందజేయుటకును ఉద్దేశించి యీవ్యాసలేఖనమున కుపక్రమించితిని. ఈవ్యాసమును పఠించుటవలన ప్రస్తుతము రాజకీయచర్చలలో ముఖ్యస్థానము నాక్రమించుచున్న యీ క్లిష్టసమస్యనుగూర్చియు, యిందలి క్లిష్టతను నివారించుటనుగూర్చియు ఆంధ్రదేశస్థులు చక్కగ తెలిసికొనగలుగుదు రని నా యాశయము.

## సంస్థానముల యావశ్యకత

ఈమధ్య సంస్థానముల ప్రజల సమావేశములు కొన్ని జరిగినట్లు పాఠకులు పత్రికలలో జూచి యుందురు. సంస్థానాధీశుల పరిపాలనము సరిగ లేదనియు, వారు తమ ప్రజలను బాధలు పెట్టుచున్నారనియు, ప్రజలకు సంస్థానముల పరిపాలనమునం దేవిధమగు జోక్యము నొసగుట లేదనియు ఇట్టిపరిస్థితు లంతరించి

సంస్థానము లాధునిక మార్గమున బ్రవర్తిల్లినగాని సంస్థానముల ప్రజలకుగాని బ్రిటిష్-ఇండియా ప్రజలకుగాని క్షేమము కలుగజాలదనియు పైన పేర్కొనబడిన సమావేశములు సలిపిన యాందోళన మైయున్నది. సంస్థానములనుగూర్చి యేమియు నెఱుగని వారీపైసంగతులను పత్రికాముఖమున నప్పుడప్పుడు తిలకించి స్వదేశసంస్థానములను కూకటివ్రేళ్లతో పెల్లగించి పారవైచినగాని భారతదేశమునకు మోక్షములేదని యభిప్రాయపడుటలో నాశ్చర్యము లేదు. కాని, సంస్థానములప్రజలుగాని, సంస్థానములనుగూర్చిన సంగతులను పరిశీలించినవారుగాని యిట్టి యభిప్రాయమును చెంతకు జేరనీయరు. సంస్థానముల పరిపాలన విషయమున ప్రజలకును కొంతబాధ్యత నొసంగవలెనని వారు కోరుదురేకాని సంస్థానములను రూపుమాపి, చదును చేసి, యావద్భారతదేశమును భాషాప్రయుక్తరాష్ట్రములుగ విభజించి ఆరాష్ట్రములను కేంద్ర ప్రభుత్వముతో లంకించి 'ఫెడరల్' పద్ధతిని ప్రవేశపెట్టుటకు వారంగీకరించరు. సంస్థానములనుగూడ బ్రిటిష్-ఇండియాలో కలిపి రాజ్యాంగవిధానమును తయారుచేయుట కష్టముగదా యని, పైప్రకార మొక్కత్రుటిలో సంస్థానములనే తీసివేయు డనుట న్యాయ్యముగాని, సంభవముగాని యగు పనికాదు. సంస్థానములవలన మన కనేకములగు మేళ్లు కలిగినవని మనము గుర్తించవలెను. బ్రిటిష్-ఇండియాలో భారతీయులకు నిన్న మొన్నటివఱకును పెద్దపెద్దయుద్యోగము లీయబడలేదుగదా? భారతీయులకు తెలివితేటలుగాని, నైతికౌన్నత్యముగాని లేదు కాబట్టి చిన్న చిన్న పనులకే వారు పనికివత్తురుగాని కార్యదక్షత కావలసివచ్చినచో వారెందుకును పనికిరారనునంతి ప్రతి భారతీయుని చెవియందును పడియేయుండును. బ్రిటిష్-ఇండియా యిట్టిపరిస్థితులలో నుండియున్న సమయమున సర్ మోక్షగుండం విశ్వేశరయ్య, సర్. టి. మాధవరావు, సర్ సాలర్ జంగు, సర్ దినకరరావు మొదలగు రాజకార్యప్రవీణులు, పరిపాలనాదక్షులు, రాజనీతిధురంధరులు స్వదేశసంస్థానములలో నత్యున్నతములగు పదవుల నాక్రమించి కాదా భారతీయుల ప్రాశస్త్యమును నిర్వివాదాంశముగా ప్రపంచమునకు చాటినది? బ్రిటిష్-ఇండియాలో నేటి కీవిషయమున నొకించుక పరిస్థితులు మారినవి. కాని, నేటికిని సైన్యమున నున్నతోద్యోగములు భారతీయులకు బ్రిటిష్-ఇండియాలో లభించుట లేదు. యుద్ధకార్యమున భారతీయుల కేవిధమగు ప్రతిపత్తియు లేని సందర్భములో హైదరాబాదు, మైసూరు, బరోడా, గ్వాలియర్, ఇండోర్, పాటియాలా, కాశ్మీర్, బికనీర్, మున్నగుసంస్థానములు తమతమ సైన్యములందు భారతీయులనే యున్నతోద్యోగములందు నిలుపుచున్నారు. ఆసైన్యములు గొప్ప యుద్ధచాతుర్యము గలవై యున్నవి. పాశ్చాత్యులగు సలహాదార్ల సాహాయ్యమున మంచిశిక్షణమును పొంది యీసైన్యములు మంచిరణకౌశలముగలిగి ధైర్యశౌర్యములు బ్రిటిష్-ఇండియాయందంతరించుచున్నను భారతదేశమున నంతరించలేదని చాటుచు నేటికిని కన్నులపండువుగ దేశమునకు తిలకాయమానములై యొప్పుచున్నవి.

అనేక శతాబ్దములనుండియు నున్నతమై నిలిచిన మన హైందవనాగరకతను స్వదేశసంస్థానములందు నేటికిని మనము చూడగలము. ఏసాంఘికజీవనము భారతదేశమున సర్వతోముఖమై యుండెనో యేయజ్ఞాతశక్తిప్రభావమున భారతసంఘమునందలి సకల వర్ణములవారును మతములవారును పోరాటముగాని వైరముగాని లేక కలిసికట్టుగ జీవితములు గడపుచున్నారో ఆ సాంఘికజీవనమును, ఆయజ్ఞాతశక్తిప్రభావమును నేటికిని యీ స్వదేశసంస్థానములందు మనము కనిపెట్టగలము. పాశ్చాత్యనాగరకతా వ్యామోహమున జిక్కి బావిలోనికప్ప బావినే సర్వప్రపంచముగ నెట్లు భావించునో పాశ్చాత్యనాగరకతయే నాగరకతగ మనము భావించుచున్నాము. మన హైందవసాంఘిక జీవనమున విప్లవము నెట్లు తెచ్చిపెట్టుకొనుచున్నామో మనము గుర్తెరుగుచుండుట లేదు. మన నాగరకత, మన వర్ణాశ్రమాదిధర్మములు, మనసాంఘికజీవనము—వీని నన్నిటిని మనము కూలద్రోసికొంటిమి. క్షణక్షణమును మనయూహలు పాశ్చాత్యవ్యామోహావృతములై పరివర్తనము చెందుచున్నవి. కాని స్వదేశ

సంస్థానములందు చిరకాలానుగతములగు మనవిజ్ఞానము, మన సంప్రదాయపరంపర, మనయనంతకళావిన్యాసము అన్నియు నేటికిని నిలిచియే యున్నవి. కాని, ఎటు పారుటకును వీలులేని జల మెట్లు మురికియగునో ఇవియు నట్లే మురికియై పోవుచున్నవి. ఈసందర్భములో మన బాధ్యతను మనము తెలిసికొని స్వదేశసంస్థానములను నిలుపుటయేగాక వానియందలి ప్రజలకును అధీశులకును నూతనోజ్జీవమును ప్రతిపాదించవలసి యున్నది. సంస్థానము లంతరించినను, అందలి ప్రజలకును అధీశులకును నూతనోజ్జీవము గలుగకున్నను ప్రపంచమునకు తిలకాయమానమై యుండిన భారతీయవిజ్ఞానమును భారతీయనాగరకతయు సంపూర్ణముగ నాశనమును జెందుననుట కెట్టిసందేహము నుండజాలదు.

## సంస్థానములు మూడురకములు

ఈసంస్థానములకు భారతరాజ్యాంగ (ఫెడరల్) విధానమున నేస్థానమును నిర్ణయించవలెను? అనుప్రశ్నకు సమాధానము చెప్పుటకుముందు ఈ యేడువందల పైచిలుకుసంస్థానముల ప్రస్తుత ప్రతిపత్తినిగూర్చి యాలోచించుట ముఖ్యావశ్యకము.

మాంటాగ్యూ-ఛెమ్స్ఫర్డు నివేదిక ననుసరించి స్వదేశసంస్థానములన్ని రెండురకములుగ మనము విభజించవచ్చును. ౧. పెద్దవి, ౨. చిన్నవి. మొదటిరకములో హైదరాబాదు, మైసూరు, తిరువాన్కూరు, గ్వాలియర్, బరోడా మొదలైన సంస్థానములు చేరును. రెండవరకములో సిమ్లాప్రాంతపు సంస్థానములు, కథియవాడ్ సంస్థానములు, మహీకాంతా ఏజన్సీలోని సంస్థానములు మొదలగునవి చేరును. ఈపద్ధతి నవలంబించుచో మనకు సరియగుఫలము రాజాలదు. ఏలయనసంస్థానములు చిన్నవైనంత మాత్రమునగాని, పెద్దవైనంతమాత్రమునగాని ఇండియా ప్రభుత్వము వారికిని ఆయాసంస్థానములకును గల యేర్పాట్లు సంధిపత్రములు మొదలగునవి మార్పుచెందజాలవు. కాబట్టి ఆయాసంధిపత్రముల ననుసరించియు, దరిమిలాను జరిగిన యేర్పాట్లనుబట్టియు, రాజకీయాచారములను బట్టియు మనము సంస్థానములను విభజించవలసి యున్నది. 'ఫెడరల్' రాజ్యాంగవిధానమున నేప్రకారముగ నీసంస్థానములను చేర్చవచ్చునో, అప్పుడీసంస్థానములకేయేహక్కు లుండునో యేయేబాధ్యత లుండునో నిర్ణయించుట ప్రస్తుతావశ్యకము గావున విస్తీర్ణమును బట్టిగాక స్వత్వములు, బాధ్యతలు మున్నగువానినిబట్టి సంస్థానములస్థానమును స్పష్టీకరించుట సమంజసము.

ఈపద్ధతి ననుసరించి స్వదేశసంస్థానములను మనము మూడురకములుగ విభజించవచ్చును: (౧) సంస్థానము స్వపరిపాలనమునందు అవసరములని తోచు శాసనములను చట్టములను చేసికొను నధికారమును, అట్టిచట్టముల నమలునబెట్టి ప్రజాపరిపాలన మొనర్చు నధికారమును గల సంస్థానములు. ఈహక్కులు సంధిపత్రములవలన నాయా సంస్థానములకు నిలిచియున్నవి. సంస్థాన పరిపాలనమునకు సంబంధించిన యావద్విషయములును సంస్థానమువారికే విడిచివేయబడిన వగుటచే వీనిని మొదటిరకపుసంస్థానములుగ మనము పరిగణించుట సబబు. (౨) పైమొదటిరకపు సంస్థానములకు గలహక్కులే చాలవఱకు కలిగి ఇండియా ప్రభుత్వమువారియొక్క సునిశితమగు అజ్మాయిషీక్రిందనే అట్టిహక్కులను చలాయించు నధికారముగల సంస్థానములు రెండవరకములోనివి. కొల్హాపూర్, నవానగర్, గొండాల్, మోర్వి, జూనగడ్ మొదలగు సంస్థానములీ రెండవతరగతి లోనివి. (3) స్వపరిపాలనము మొదలగు పైహక్కులు చలాయించుటలో స్వాతంత్ర్యము లేని సంస్థానములు మూడవరకములోనివి. స్వదేశసంస్థానములనబడు నేడువందల పైచిలుకు సంస్థానములలో నత్యధికసంఖ్యాకము లీమూడవరకపు సంస్థానములే.

ఈ మూడవరకపుసంస్థానములసంఖ్య సుమారు ఆరువందలపైచిలుకుండును. ఈసంస్థానముల యధీశులతో ఇండియాప్రభుత్వమువారు సంధి చేసికొనలేదు. సన్నదులనుమాత్ర మిచ్చిరి. ఈసంస్థానములయధీశులు ఇండియా ప్రభుత్వమునకు లోబడినప్పుడు స్వతంత్రదేశాధీశులుగాక యేపీష్వాకో, యేనేపాళరాజునకో లోబడియుండిరి. అప్పటిసామంతత్వమునుండి ఇండియాప్రభుత్వమునకు వారు తమసామంతత్వమును మార్చిరి. ఇందు చాల

సంస్థానములవిస్తీర్ణము ఒకమైలు, రెండుమైళ్లు మాత్రమే యుండును. హిందూముసల్మాను న్యాయశాస్త్రముల ప్రకారము సంస్థానాధీశుడు చనిపోగానే, సంస్థానము పంపిణీకాబడుటచే విస్తీర్ణము తగ్గుటయు సంభవించుచున్నది. ఇట్టిసంస్థానములలో ప్రజలకుగాని, సంస్థానాధీశులకుగాని యెట్టిసంతుష్టియు గలుగుచుండుట లేదు. కావున నీసంస్థానములను భాష ననుసరించి వానిని దగ్గరి బ్రిటిష్‌రాష్ట్రములలో కలిపివేయుట న్యాయ్యమును సమంజసమును నగును. రాజకీయాచారమునకుగాని, ఒడంబడికలకుగాని, సన్నదులకుగాని యీపద్ధతి వ్యతిరేకము కాజాలదు. బ్రిటిష్‌రాష్ట్రములలో గలిపినైచినంత మాత్రమున నీతత్సంస్థానాధీశులను తక్కినమానవులరకమునకు తగ్గించక, వారికి కొన్ని గౌరవములను, బిరుదములను ఇచ్చుచుండుట సమంజసము. ఈపద్ధతి యవలంబింతుచో మనయాంధ్రదేశమునందలి కాళహస్తి, వేంకటగిరి, విజయనగరము, పిఠాపురము, బొబ్బిలి, పర్లాకిమిడి, కల్లికోట మొదలగు జమీందారులవలె నీతత్సంస్థానాధీశులును జమీందారులై వెలయుదురు. ఇప్పుడింతకంటె వారికున్న నిజమైన గొప్పయధికారములును లేవు. ఈపద్ధతి నవలంబించుచో రాజ్యాంగవిధాననిర్మాణమున మనకుగల గొప్పయాటంకమును చాలవఱకు సమర్థించుకొని ప్రథమసోపానము నధిరోహించినవార మగుదుము.

## సంస్థానములు—బ్రిటిష్-ఇండియాప్రభుత్వము

ఇక మొదటిరెండురకముల సంస్థానములవారి విషయమును మనము నిర్ణయించవలసియున్నది. ఈనిర్ణయమునకు మనకు గావలసిన ముఖ్యములగు సంగతులు కొన్ని గలవు. ఇండియాప్రభుత్వమునకును, ఈ మొదటిరెండురకముల సంస్థానములకును గలసంబంధ మెట్టిదియో తెలిసికొనుట మనప్రథమకర్తవ్యము.

ఈసంబంధములు కేవలము సంధిపత్రములయొక్కయు, ఒడంబడికలయొక్కయు షరతులపైమాత్రమే యాధారపడియుండలేదు. మెల్లమెల్లగా ఇండియాప్రభుత్వమువారు స్వదేశసంస్థానముల స్వాతంత్ర్యమును హ్రస్వముగావించుచు వచ్చిరి. కొన్నిసందర్భములలో నాయాసంస్థానములవా రందుల కంగీకరించిరి. కొన్నిసందర్భములలో వారి కంగీకారము గాకున్నను ఇండియాప్రభుత్వమువారు వాని నమలునబెట్టుచు వచ్చిరి. కొన్నియెడల నక్రమముగానే సంస్థానములస్వాతంత్ర్యము హ్రస్వమాయెను. ఇటీవలనే, ౧౯౨౩-వ సంవత్సరమున హైదరాబాదునైజాంగారికిని ఇండియా ప్రభుత్వమువారికిని బీరార్‌విషయమై జరిగిన యుత్తరప్రత్యుత్తరములను మచ్చుగ తీసికొన్నచో నీవిషయము మనకు బోధపడగలదు. కర్జన్‌ప్రభువు ఇండియారాజప్రతినిధిగ నున్నప్పుడు హైదరాబాద్‌నైజాంగారిదగ్గరనుండి బీరార్‌ను తీసికొనెను. అప్పటినుండియు బీరార్ తిరిగి తనకు రావలెనని నైజాం కోరుచుండెను. కాని ఇండియాప్రభుత్వమువారు నిరాకరించిరి. ఈవిషయములో హైదరాబాదు ఇండియాప్రభుత్వమునకు 'అక్షరాలా' లోబడినదేయైనచో ఇండియాప్రభుత్వమువారేనిర్ణయము గావింతురో ఆనిర్ణయము పునరాలోచనకు రాకుండ నంగీకృతము గావలసియుండును. కాబట్టి బీరార్‌ను తిరిగి నైజాంగారికి ఈయజాలమని ఇండియాప్రభుత్వమువారన్నమాట నైజాం ఒప్పుకున్నచో ఇక నేసంస్థానమున నెప్పుడిట్టివిషయము వచ్చినను, ఇండియాప్రభుత్వమువారిదే పైచేయి యగును. వారినిర్ణయమే కడపటిమాటగ నుండును. ఇంతేగాక ఏసంస్థానము ఇండియాప్రభుత్వమువారి నిర్ణయమే కడపటిమాటగ నంగీకరించునో ఆసంస్థానము ఇండియాప్రభుత్వమునకు 'అక్షరాలా' లోబడినట్లే పరిగణింపబడును. అట్టినిర్ణయమును కడపటిమాటగ నంగీకరింపకపోవుట సంస్థానముయొక్క స్వాతంత్ర్యమును నిలువబెట్టుకొనుట యగును. ఈకారణముచే ౧౯౨౩-వ సంవత్సరము అక్టోబరునెల ౨౫-వ తారీఖున నైజాంగారు ఇండియాప్రభుత్వమున కిట్లు లేఖ నంపిరి:—'బీరార్‌ను తిరిగి మాకిప్పించుటలో ప్రభుత్వమువారు చెప్పినమాట వారియభిప్రాయమునకు సంబంధించిన యొక్కవిష

యముమాత్రమే కాగలదు. అంతేగాని యీచర్చ యింతటితో ముగిసినట్లుగాని, ఇకనెప్పుడును ఇది తల యెత్తకూడదనికాని నే నంగీకరింపజాలను.'* దీనికి రీజెంటుప్రభు వీప్రకారముగ జవాబువ్రాసెను:—'ఈ విషయమై ఇండియాస్టేటుసెక్రెటరీగారు చేసిననిర్ణయము కడపటిమాట కాజాలదని తాము వ్రాసిన వ్రాతతో నే నంగీకరించజాలనందుకు విచారించుచున్నాను. ఉన్నతప్రభుత్వమువారు ఒకసంస్థానమునకును మఱొకసంస్థానమునకును గలతగాదాలుగాని, ఒకసంస్థానమునకును తమకును గల తగాదాలుగాని పరిష్కరించుటకు హక్కుదారులై యున్నారు.' ఇందలియర్థము పాఠకుల కెల్లరకును బోధపడియుండును. ఇట్లనేకవిధములైన యొడంబడికలుగాని యేర్పాట్లుగాని లేని కొన్ని రాజకీయాచారములు కడచిన నూరుసంవత్సరములలో వ్యాప్తిలోనికి వచ్చినవి. ఇక వీనినన్నిటిని జాగ్రత్తగ పరిశీలింతము.

ప్రస్తుతపు ఇండియాప్రభుత్వమునకు ముందు ఈస్టు-ఇండియా కంపెనీవారిప్రభుత్వము సాగుచుండెనని యు, ఆ ఈస్టు-ఇండియా-కంపెనీకి నేటిఇండియాప్రభుత్వమువారు వారసులనియు పాఠకు లెఱింగినయంశమే గదా! ఈ ఈస్టు-ఇండియా కంపెనీవారు, నైజాంగారితోను, ఆళ్వార్ మహారాజుగారితోను, బరోడాగైక్వార్గారితోను, తిరువాన్కూర్ మహారాజుగారితోను, ఇంక నితరులతోను కొన్ని యొడంబడికలను చేసికొనిరి. ఒక ఉదాహరణము తీసికొందము. నైజాంగారితో చేసికొన్న కడపటియొడంబడిక ౧౮౦౦ సంవత్సరము అక్టోబరునెల ౧౨ వతారీఖున చేసికొనబడినది. ౧౮౫౯-వ సంవత్సరమువఱకును గవర్నరుజనరలులందరు నైజాంగారికి వ్రాసినయుత్తరములలో నైజాంగా రున్నతులైనట్లు సంబోధించుచుండిరి. నైజాంగారు రాజన్యసూచకముగ 'మేము' అనుమాట నుపయోగించుచుండిరి. ౧౮౦౦ సంవత్సరపు టొడంబడికలో 'మనయిరువురిదేశముల సంపూర్ణపరస్పరసంరక్షణమునకుగాను' అనుపదజాల ముపయోగింపబడెను. పరిస్థితులన్నియు నిట్లుండ క్రమక్రమముగ సంస్థానములస్వాతంత్ర్యమును కంపెనీప్రభుత్వము వారు తగ్గింపజొచ్చిరి. ౧౮౫౭ వ సంవత్సరపు తిరుగుబాటున కిదియొకకారణమని చరిత్రకారు లందురు. ఈ తిరుగుబాటు ముగిసినపిమ్మట కంపెనీప్రభుత్వముపోయి బ్రిటిష్-ఇండియా ప్రభుత్వము అమలులోనికి వచ్చెను. విక్టోరియామహారాజ్ఞిగా రప్పుడు గావించిన ప్రకటనమున నిట్లుండెను: "గౌరవనీయమగు ఈస్టు-ఇండియా కంపెనీవారిచేగాని వారిఅధికారముక్రిందగాని స్వదేశసంస్థానాధీశులతో చేసికొన్న యొడంబడికలును ఏర్పాట్లును మాచే నంగీకరించబడినవనియు, మాచే నిశ్శంకముగ నవి మన్నింపబడు ననియు ఏతత్సంస్థానాధీశులకు మే మెఱింగించుచున్నాము. వారుకూడ వాని నట్లే మన్నింతురని మే మాశించుచున్నాము...మాప్రస్తుత భూభాగముకన్న నెక్కుడు మేమాశించము. మాభూభాగముపైగాని, మాహక్కులపైగాని యితరులు విజృంభించుటకు మే మనుమతించము. ఇతరులభూభాగముపైగాని హక్కులపైగాని అన్యాయాక్రమణము గావించుటకు మే మనుజ్ఞయొసంగము. స్వదేశసంస్థానాధీశుల హక్కులను, ఔన్నత్యమును, ఘనతను మాహక్కులను మా ఔన్నత్యమును, మాఘనతను గౌరవించునట్లే గౌరవించెదము..." కాని, ఈప్రకటనజరిగినకొలదికాలమునకే ప్రభుత్వమువారు ఒడంబడికలను, ఏర్పాట్లను నొకమూలనుంచి సంస్థానాధీశులహక్కులపై నాక్రమణము గావింప జొచ్చిరి. "మేము మొగలాయిచక్రవర్తులకు వారసుల" మనిరి.

ఇట్టివానిలో మొదటిది ౧౮౭౭-వ సంవత్సరపు దర్బారు. నైజాం, తిరువాన్కూరుమహారాజా, సింధియా మున్నగుస్వతంత్రులందఱును రాబనుపబడిరి. వారందఱును బ్రిటిషుబలమునకు వెఱచి దర్బారునకు హాజరైరి. వీరేగాక నేపాళదేశపుమహారాజుగారును, ఆఫ్ఘనిస్థానపు అమీర్గారునుకూడ దర్బారునకు పిలువబడిరి. కాని వారు మర్యాదగ తమయనంగీకారమును తెలియబరిచిరి. ఇట్టివిధానమువలనను, బ్రిటిష్పోస్టు, రైల్వే, టెలిగ్రాఫ్ మున్నగువానిని తమదేశములకు చేరనీయక 'మీ రనాగ

* East India Correspondence, Hyderabad, quoted by Panikkar.

రసులు, నాగరకతాసూచకములును, ఆధునికసౌకర్యము లును అను వీనిని మీ రంగీకరించకుండుట హాస్యాస్ప దము' అను అవమానకరమాటలను నిర్లక్ష్యము చేసినందు వలనను నేపాళదేశమును, ఆఫ్ఘనిస్థానమును నేటివఱ కును స్వతంత్రరాజ్యములై యున్నవి.

స్వతంత్రములైనరాజ్యములు మనస్వదేశసంస్థాన ములపరిస్థితులలో నస్వతంత్రములగుట యనేకసారు లనేకదేశములలో జరిగినవిషయమేగాని క్రొత్తవిష యము గాదు. ఒకముఖ్యప్రభుత్వమును దానితో మిత్రు లై యున్న తక్కుంగల ప్రభుత్వములు నున్నయెడ ఆ తక్కుంగలప్రభుత్వము లనతికాలములో ముఖ్యప్రభుత్వ మునకు లోబడిపోవును. భారతదేశపుప్రాచీనచరిత్రము నుండియు, గ్రీసుచరిత్రమునుండియు, యావత్ప్రపంచ చరిత్రమునుండియు ఇట్టియుదాహరణములు తండోప తండములుగ నీయవచ్చును.

పైనచెప్పబడిన దర్బారులవలననేగాక, ఇతరవిధ ములగూడ ప్రభుత్వమువారు సంస్థానములహక్కులను తగ్గించుచువచ్చిరి. ఒకసంస్థానాధీశుడు చనిపోయిన వెనుక నతనికి వారసు డెవ్వ డనుసమస్య వచ్చినప్పుడు ప్రభుత్వమువారిదే నిర్ణయాధికారమని యెల్లరు నంగీక రించుచున్నారు. కాశ్మీరదేశమును గులాబ్సింగున కిచ్చి నప్పుడు ప్రభుత్వమువా రాతనితో చేసికొన్న యొడం బడికలో నతనికిపుట్టినమొగపిల్లలే వారసులని సూచించిరి. ఆప్రకారమే రాజా హరిసింగ్ను కాశ్మీరాధీశునిగ ప్రభు త్వమువారు నెలకొల్పియున్నారు.

సంస్థానాధీశులు యుక్తవయస్కులు కానిసంద ర్భమున 'రీజెంటు'లను నియమించునధికారము ప్రభు త్వమువారు తమకు గలదని తీర్మానించిరి. కాని పైన మనము పేర్కొన్న మొదటిరెండురకముల సంస్థానములు నిందు కొప్పుకొనుటలేదు.

సంస్థానాధీశులుపరిపాలనమును సరిగచేయకున్నను, నింక నిట్టివేయగు నితరకారణములు సంభవించినను వారి ని తొలగించునధికారము తమకు గలదని ప్రభుత్వము వా రనుచుండిరి. బరోడా, మైసూరు, భరతపూర్, ఆళ్వార్, ఇండూరులలో నిట్టివి జరిగెను. కాని, యిటీవల సంస్థానాధీశులు ప్రభుత్వమున కిట్టిహక్కు లేదని నిరసించుచున్నారు. ఈకారణముచేతనే యిటీవల నాభా మహారాజుగారిని తొలగించవలసినకారణములు గలిగినను ప్రభుత్వమువా రాతనిని తొలగించలేదు. అతడే రాజ్య త్యాగము గావించెను. కాబట్టి ప్రభుత్వమువా రీహక్కు ను అములుజరుపుటలో మునుపటివలెగాక దిగజారుచున్నా రని స్పష్టమగుచున్నది.

బ్రిటిష్ప్రభుత్వమువారు మొదటి రెండురకముల లోని ప్రతిసంస్థానాధీశునకును బిరుదములనొసంగుచున్నా రు. ప్రభుత్వమువారియనుమతి లేనిదే యితరప్రభుత్వముల వారి బిరుదావళిని సంస్థానాధీశు లంగీకరింపరాదని యొక యాచారము నములు జరుపుచున్నారు.

ఒక్కొక్కసంస్థానములో నింత సైన్యముకన్న నెక్కువ యుండగూడ దనునియమము ముఖ్యమగు నియ మములలో నొక్కటి. ౧౮౭౫ లో సింధియారాజుగారి కున్నసైన్యమును తగ్గింపుమని ప్రభుత్వమువారు కోరుట యిందుల కొకయుదాహరణము. కాని యిటీవల సంస్థా నాధీశులసైన్యములు ౧౯౧౪-౧౯౧౮ మహాసంగ్రామ ములో గొప్పపనిచేసి యశముగడించెను. ఈసైన్యములు పేరునకు సంస్థానములవేయైనను అవసరమునకు ప్రభు త్వముకొఱకే వినియోగింపబడుచున్నవి. ఇవి ఇండియా ప్రభుత్వసైన్యములకు 'రిజర్వు' సైన్యములుగ, భావిం పబడుచున్నవి. ప్రతిసంస్థానపు సైన్యపుసంఖ్యకు నొక పరిమితి యేర్పరచుట ఇండియాప్రభుత్వమునకును, ఇతర సంస్థానములకును మిక్కిలి క్షేమంకరమగు విషయము.

ఏసంస్థానాధీశు డాసంస్థానమున తననాణెము లను చెలామణిలో నుంచుట చిరకాలానుగతమగు స్వా తంత్ర్యసూత్రములలో నొక్కటి యైయున్నది. దీనిని భేదించుటకు ప్రభుత్వమువారు తలపెట్టిరి. వీలైనప్పుడం తయు బ్రిటిష్ ఇండియా నాణెములనే సంస్థానములలో గూడ చెలామణి యగునట్లు చేయుచుండిరి. ౧౯౦౩ లో బికనీర్లోను, ౧౯౦౫ లో ఆళ్వార్లోను 'రీజంటు' పరిపాలనాసందర్భమున నీ నాణెములు చెలామణిలోనికి

తేబడినవి. హైదరాబాదులో నిప్పటికిని 'సిక్కా' రూపాయలు చెలామణిలోనున్నవి. ౧౯౧౮-౧౯ యుద్ధానంతరము నైజాంగారు ప్రభుత్వమువారితో చెప్పకుండనే కరస్సీనోట్లను గూడ అచ్చుగుద్దించి చెలామణిలో పెట్టిరి. ఈచెలామణిసందర్భమున బ్యాంకులు ప్రభుత్వమునకు సహకారము చేయుచున్నవి. లెక్కలకుగాని, చెలామణికిగాని యావద్భారతదేశమునను నొకేనాణెము లున్న సులభముగదా?

స్వదేశసంస్థానములకు విదేశవ్యవహారములం దెట్టి వ్యక్తిత్వమును లేదు. సంస్థానములతరఫునను తమతరఫునను ఇండియా ప్రభుత్వమువారిదే బాధ్యత యైయున్నది. ఈకారణముచేత సంస్థానములపై ఇండియా ప్రభుత్వమువారికి కొంత యవసరాధికారము గలదని సంస్థానములవారును అంగీకరించుచున్నారు. నానాదేశసంఘమునకు ఇండియా ప్రభుత్వమువారు ప్రతినిధులను బంపునప్పుడు సాధారణముగ నొకసంస్థానాధీశునిగూడ బంపుచుందురు.

ఒకసంస్థానమునకును మరొక సంస్థానమునకును తగాదా గలిగినప్పుడు దానిని తీర్చవలసినహక్కు ప్రభుత్వమువారిదై యున్నది. అట్లే ప్రభుత్వమునకును ఒకసంస్థానమునకును తగాదా వచ్చినచో దానిని తీర్చుహక్కుగూడ ప్రభుత్వమువారిదే యైయున్నది. దీనికి సంస్థానాధీశులు సంపూర్ణముగ సమ్మతించుట లేదు.

ప్రతిసంస్థానమునందును గల విదేశజులమీదను, బ్రిటిష్-ఇండియనులమీదను, తక్కంగల బ్రిటిష్ సామ్రాజ్యమునందలివారిమీదను సంస్థానమున కెట్టియధికారమును లేదు. వారుచేసిన నేరములను శిక్షించుటయు వారిని విచారించుటయు ఇండియా ప్రభుత్వమువారి హక్కై యైయున్నది.

రెసిడెన్సీలలోను, బ్రిటిష్-ఇండియా సైన్యము లున్నచోట్లలోను సంపూర్ణాధికారము బ్రిటిష్-ఇండియా ప్రభుత్వమువారిదే యనుట నిర్వివాదాంశము.

రైల్వేలకుగాను సంస్థానాధీశు లొసంగిన భూభాగముపైగూడ ప్రభుత్వమువారు తమకే సర్వములగు హక్కులును గల వనసాగిరి. మహమ్మద్ యూసుఫ్ ఉద్దీన్ అనువొకనిని నిజాంసంస్థానములో రైల్వేకిచ్చిన భాగములో పట్టుకొనిరి. అతనిని అట్లు బ్రిటిష్ప్రభుత్వమువారు పట్టుకొనుహక్కు కలదా, లేదా యనుప్రశ్నపై ప్రివీకౌన్సిలువారు తీర్పు చెప్పవలసివచ్చెను. ఈమహ్మద్ యూసుఫ్ఉద్దీన్ × ఇండియాచక్రవర్తినిగారు అనుకేసులోని యీతీర్పుప్రకారము రైల్వేకొసగినప్రదేశము రైల్వేపరిపాలననిమిత్తము బ్రిటిష్ప్రభుత్వమువారిదే యైనను, తక్కినఅన్నిసందర్భములకును నది నైజాంవారిదే యని నిర్ధారణ చేయబడెను.

ఇంతవఱకును సంస్థానములకును, బ్రిటిష్ఇండియా ప్రభుత్వమువారికిని గలసంబంధములలో సంస్థానముల బాహ్యవ్యవహారములనుగూర్చి తెలిసికొంటిమి. ఇక సంస్థానముల అంతర్వ్యవహారములలో బ్రిటిష్-ఇండియా ప్రభుత్వమువా రెట్టిజోక్యము తీసికొనిరో గమనింతము. ఈవిషయమై యనేకసందర్భములలో ప్రభుత్వమునకును సంస్థానములకును భేదాభిప్రాయములు గలిగి చర్చలుగూడ ముదిరినవి. గ్వాలియరుమహారాజుగారితో చేసికొన్నయొడంబడికలోనేమి, ఇండూరుమహారాజుగారితో చేసికొన్నయొడంబడికలోనేమి, ఉదయపూర్ రాణాగారితో చేసికొన్నయొడంబడికలోనేమి కంపెనీవారాయాసంస్థానముల అంతర్వ్యవహారములం దెట్టిజోక్యమును కలిగించుకొనుట కాధారము గనుపించదు. అయినను ప్రభుత్వమువా రిట్టిజోక్యమే యవలంబనీయమగు సూత్రముగ దీసికొనిరి. ఏసంస్థానమైనను తిరుగుబాటువాత బడనున్నను, అరాజక మచ్చట ప్రజ్వలింపనున్నను ప్రభుత్వమువా రాసంస్థానమును తాత్కాలికముగ తమహస్తంగత మొనర్చుకొని పరిపాలించుట యుక్తమని కానింగ్ప్రభువు చెప్పియుండెను. ౧౮౭౫ వ సంవత్సరమున నార్త్బ్రూక్ప్రభువుగూడ ఇట్లే చెప్పియుండెను.

సంస్థానప్రభుత్వముల అంతర్వ్యవహారములలో నిట్లు జోక్యము గలిగించుకొనుటలో రెండుఫలితములున్నవి. మొదటిది: సంస్థానములయధికారము తగ్గుట. రెండవది: సంస్థానములు ప్రభుత్వముక్రిందికి సన్నిహితముగ లాగబడుట. ఈఫలితము లెట్లుగలిగినవో చూతము.

ప్రతిసంస్థానమునను 'రెసిడెంటు' అనునొక బ్రిటిష్ అధికారిని నియమించుట ప్రధానముగువిషయ మై యున్నది. ఈ 'రెసిడెంటు' పద్ధతి సంస్థానాధీశులకు పరమకంటకముగ నున్నది. వారియిచ్చవచ్చినట్లు సంస్థానాధీశులు ప్రవర్తించిన సరి, లేకున్న నేదోయొక పెటకము రానేవచ్చును. 'రెసిడెంటు'మాట వానినోట నుండగనే సంస్థానాధీశుని నెత్తిపై నొక పెద్దపిడుగు పడినట్లే భావించవలెను. 'రెసిడెంట్లు' సంస్థానముల అంతర్వ్యవహారములలో ననవసరముగ పెక్కుసారులు జోక్యము గలిగించుకొనుచున్నారని సంస్థానాధీశులు మిక్కిలి గర్హించుచున్నారు. ౧౮౬౫-వ సంవత్సరము నవంబరునెల ౧౮-వ తారీఖున ఎడ్వర్డుచక్రవర్తి యువరాజుగ నుండి తనతల్లి విక్టోరియారాజ్ఞికి వ్రాసిన లేఖలో నిట్లు కలదు. "నాహృదయమునకు గట్టిగాతట్టిన యంశ మేమనగా ఇంగ్లీష్-రాజకీయ-ప్రతినిధులు సంస్థానాధీశులనుగూర్చి మిక్కిలిబండగ మిక్కిలి యగౌరవముగ ప్రస్తావించుచున్నా రనునదియే. ఇది మిక్కిలి విచారకరమగు విషయము. ఈప్రతినిధులను పంపుపద్ధతి చాల పొరపాటైనపద్ధతియని నాదృఢమైననమ్మకము."*

ఏ సంస్థానాధీశుడైనను యుక్త వయస్కుడు గాకున్నచో, నాతడు యుక్తవయస్కుడగు పర్యంతము బ్రిటిష్ 'రీజంటు' (పరిపాలకు) నొకని నియమించుట ప్రభుత్వమువా రవలంబించుపద్ధతులలో నొక్కటి. ఒకొక్కప్పుడు తిరువాన్కూరులోవలె మహారాణిని పరిపాలకురాలినిగ నియమించి సిమ్లానుండి యుత్తరువులు పంపించుటయు నాచారము. ఇట్టి యుత్తరువుల ప్రకారమే తిరువాన్కూరులో మతవిషయిక వ్యవహారములు మిగిలిన రాజకీయవ్యవహారములనుండి విడదీయబడినవి. ఆళ్వార్, బికనీర్, గ్వాలియర్, జయపూర్, మైసూర్, ఇందూర్, బరోడా మున్నగుసంస్థానములిట్లే బ్రిటిష్ప్రభుత్వమువారి 'రీజంట్ల' పాలనలోనికి వచ్చియుండెను.

పైన పేర్కొనబడిన యంశము లన్నిటికంటె ప్రభుత్వమునకు ముఖ్యమగునదను మరొక్కటి కలదు. సంస్థానాధీశులకు పరిపాలనమున దివాన్ కావలసియుండునుగదా? ఫలాని దివాన్‌ను నియమించుమని బ్రిటిష్ ప్రభుత్వమువారో రెసిడెంటో యాజ్ఞాపించుచుండును. తిరువాన్కూరునందు సర్ టి. మాధవరావు దివాన్ గాకపూర్వము చాలకాలము 'రెసిడెంటు' పేర్కొన్నవారే దివానులగుచువచ్చిరి. కొన్నిసందర్భములలో రెసిడెంట్లుసమాస్తాలు సంస్థానాధీశులకు దివాన్లైరి. బ్రిటిష్-సివిలియన్ ఉద్యోగులను దివాన్‌గ నియమించుటయు కలదు. ఇట్టిపద్ధతివలన గలుగునష్ట మేమనగా, ఈఉద్యోగులదృష్టి యంతయు బ్రిటిష్ప్రభుత్వముమీదనే కేంద్రీకృతమై యుండును. దివాన్‌పని ముగియగనే సివిలియన్ ఉద్యోగి బ్రిటిష్-ఇండియాలో తిరిగి పని చేయునుగదా? అతనిదృష్టి, బ్రిటిష్ప్రభుత్వముక్రింద 'ప్రమోషను' పొందుటపై ప్రసరించుట స్వాభావికము.

సంస్థానములయందలి న్యాయస్థానములిచ్చు చెప్పు తీర్పులపైగూడ కొంతయధికారము ప్రభుత్వమువా రవలంబించిరి. కొన్నిసంస్థానములలో 'ఉరిశిక్ష' విధింపబడునో బ్రిటిష్ 'రెసిడెంటు' అంగీకరించనిదే శిక్ష అమలుజరుగరాదు. 'క్రిమినల్' తీర్పులలో నిట్లు ప్రభుత్వమునకు జోక్యము గలిగినను సాధారణములగు (సివిల్) తీర్పులలో ప్రభుత్వ మంతగ జోక్యమును గలిగించుకొనుట లేదు. హైదరాబాదు నుదాహరణముగ దీసికొన్నచో అందుండి ప్రివీకౌన్సిలున కిట్టి'అప్పీలు'ను తీసికొనిపోవుటకును హక్కు లేదు.

పైసంగతిసందర్భములను మనము పర్యాలోచించినచో స్వదేశసంస్థానముల స్వాతంత్ర్యము లన్నివిషయములందును బ్రిటిష్ఇండియాప్రభుత్వమువారిచే నాక్రమింపబడిన దనుమాట విశదమగుచున్నది. ఇంకను కొలది కాల మిట్లేయున్నచో, సంస్థానాధీశులసభ యున్నప్పటికిని, సంస్థానాధీశుల స్వాతంత్ర్యము మఱింత తగ్గకమానదు. స్వాతంత్ర్యము తగ్గినదికదా యని, క్రొత్త హక్కులు వారికి రాజాలవు. కాబట్టి 'దీపముండగనే యిల్లు చక్కబెట్టుకొనవలె' ననుసామెత ననుసరించి

* Sidney Lee's 'Life of King Edward 'p. 399.

సంస్థానములవారిప్పుడే బ్రిటిష్-ఇండియాతో చేరి యొక విధమగు 'ఫెడరల్' రాజ్యాంగవిధానమున భాగములుగ నుండుట యావశ్యకమని యంగీకరించుట వారికిని మనకును గూడ శ్రేయస్కరమై యున్నది.

## నూతనరాజ్యాంగ(మిశ్ర)విధానము

'ఫెడరల్' రాజ్యాంగవిధానము: అనుపదము పయోగించగనే కొంతకష్టము కలుగుచున్నది. ఏలయన 'ఫెడరల్' రాజ్యాంగవిధానమున కేంద్రప్రభుత్వమున కధికతయు, రాష్ట్రప్రభుత్వముల కధికతయు గలుగును. ప్రస్తుత మమలునయున్న రాజ్యాంగవిధానమున రాష్ట్రప్రభుత్వములది క్రిందిచేయియు, కేంద్రప్రభుత్వముది పైచేయియుగా నున్నది. ఇట్టి ప్రస్తుతపద్ధతిని 'యూనిటరీ' పద్ధతి యందురు. ఇదియే మనకు కావలసినపద్ధతి[౧] యనుట భారతీయులలో ననేకుల కంగీకారమగు విషయము. రాష్ట్రస్వాతంత్ర్యవిధానమే మన భారతదేశపుటిక్కట్లకు వేయిసంవత్సరములనుండియు మూలకారణమై యున్నది. కాని, సంస్థానములు తమకిప్పుడున్న స్వత్వములను వదులుకొని 'యూనిటరీ' విధానము నామోదించుట యసంభవము, సందర్భరహితము. కావున 'ఫెడరల్' విధానమునుగాక, యూనిటరీవిధానమునుగాక యొక మిశ్రవిధానమును మన మాలోచించవలసియున్నది. ఈమిశ్రవిధానమున బ్రిటిష్-ఇండియాకును, చిన్ని (మూడవరకపు) సంస్థానములకును గలిసి 'యూనిటరీ' విధానమును సంస్థానములకు సంబంధించినంతవఱకు 'ఫెడరల్' విధానమును అమరియుండవలెను. ఇది యెట్లు సాధ్యమగునో విచారింతము.

### ౧. శాసనసభ

కేంద్రశాసననిర్మాణాదుల కిప్పటియట్లు రెండుసభ లుండవలెను. అం దొకటి శాసనసభ; రెండవది స్టేట్ కౌన్సిల్. శాసనసభయందు బ్రిటిష్-ఇండియా ప్రతినిధులుమాత్రమే యుందురు. స్టేట్ కౌన్సిల్ నందు ౧/3 వంతు బ్రిటిష్ ఇండియా ప్రతినిధులును, ౨/3 వంతు సంస్థానాధీశుల ప్రతినిధులు నుందురు. యావద్భారతదేశమునకును సంబంధించిన అన్నివిషయములను ఈసభలు చర్చించును. బ్రిటిష్-ఇండియాకుమాత్రమే సంబంధించిన విషయములను శాసనసభయొక్కటియే చర్చించును. స్టేట్ కౌన్సిల్ కూడ చర్చించువిషయములందు విదేశవ్యవహారములు, సుంకములు, పోస్టు, రైల్వే, టెలిగ్రాఫ్ విషయములు, వర్తకవ్యాపారములు మొదలగునవి యుండును.

ఇట్టి సౌకర్యమును సంస్థానాధీశులకు గలిగించినందులకుగాను వారు తమహక్కులను కొన్నింటిని కేంద్రప్రభుత్వమున కర్పించవలెను. నాణెములు, చలామణి విషయ మిందు మొట్టమొదటిది. సంస్థానములకును బ్రిటిష్-ఇండియాకును మధ్యగల సుంకములబాధను తీసివేయుట రెండవది. వీనివిషయమై యొకయొడంబడికకు వచ్చుట అంత గొప్పసంగతికాదు.

### ౨. న్యాయస్థానము

సంస్థానములకును కేంద్రప్రభుత్వమునకును గల సంబంధము కొంతవరకు 'ఫెడరల్' అనిచెప్పితి గదా. ఇట్టిసందర్భమున ఒకరిహక్కులపై నొకరాక్రమణ మొనర్చకుండ తగవులు పరిష్కరించగల న్యాయస్థానమొక్కటి యుండవలెను. ఇప్పుడు బ్రిటిష్-ఇండియా ప్రభుత్వము వారే సంస్థానమునకును సంస్థానమునకును గల తగాదాలను పరిష్కరించుచున్నారు. ఒకసంస్థానమునకును తమకును గలతగాదాలను పరిష్కరించు నధికారము తమదే యని నిర్వచించినారు.

ఈ తగాదాలకేగాక కొన్ని సంస్థానములందలి న్యాయస్థానములపై తీర్పులకు గూడ బ్రిటిష్-ఇండియా ప్రభుత్వమున కిప్పుడున్న యధికారమును చలాయించుటకుగూడ నొక న్యాయస్థానము కావలసియున్నది.

భారతదేశమునుండి ప్రివీకౌన్సిలున కిప్పుడు అపీల్లు కొనిపోబడుచున్నవి. అదిమాని, ఇండియాయందే యొక సుప్రీమ్‌కోర్టును నెలకొలుపుటకు గౌరు మొదలుగాగలవారు యత్నించుచున్నారు. రాష్ట్రములందలి హైకోర్టులనుండియేగాక సంస్థానములందలి పెద్దకోర్టుల

౧. ఈవిషయమై గ్రంథవిస్తరభీతిచే వ్రాయదలపెట్టలేదు.

నుండిగూడ అపీళ్లను సుప్రీమ్‌కోర్టున కంపుటకు సంస్థానములవా రభ్యంతరపెట్ట నవసరము లేదు.

ఇట్లు వారంగీకరించుచో పన్నెండుగురు జడ్జీలు గల యొక సుప్రీమ్‌కోర్టును స్థాపించి, ఆకోర్టునందు నలుగురుజడ్జీలు సంస్థానాధీశులసభవారిచే నియమితులగునట్లును మిగిలినవారు బ్రిటిష్-ఇండియాప్రభుత్వమువారిచే నియమితు లగునట్లును నేర్పరుపవచ్చును.

## 3. కార్యనిర్వాహణము

ఇక కేంద్రకార్యనిర్వాహకవర్గమునుగూర్చి మన మాలోచింపవలసియున్నది. భారతశాసనసభయం దధిక సంఖ్యాకు లేకక్షువారై యుందురో ఆకక్షు నాయకుఁడు ప్రధానమంత్రిత్వమును వహించును మంత్రివర్గము సమష్టిబాధ్యత కలదై యుండును. సంస్థానములకుగూడ సంబంధించినవిషయములకు మంత్రులుగ నియమింపబడినవారికి తోడుగ సంస్థానాధీశుల ప్రతినిధియగు స్టేట్ కౌన్సిల్ సభ్యుడొకడు 'పార్లమెంటరీ సెక్రెటరీ'గా నియమింపబడవలెను.

## ౪. ధనవిషయము

ముఖ్యమైనసమస్య ధనముదగ్గర కలుగగలదు. కాని దీనికిని మనకు సులభమగుమార్గ మున్నది. బ్రిటిష్-ఇండియారాష్ట్రములకును, సంస్థానములకును నడుమగల సుంకములను తొలగించుచో కొంతయాదాయము తరుగునని పైన చెప్పియుంటిని. కావున కేంద్రసంస్థలకు అనగా సుప్రీమ్‌కోర్టు, పార్లమెంటరీసెక్రెటరీలు మొదలగువారి కగు వ్యయములు కేంద్రప్రభుత్వమువారే భరించవలెను. సంస్థానముల రాబడిపన్నుతో కేంద్రప్రభుత్వ మెట్టిజోక్యమును కలిగించుకొనరాదు.

## ముగింపు

సంస్థానముల యధీశులు సంస్థానముల ప్రజలకు సంస్థానవ్యవహారములందు బాధ్యత నొసంగువఱకును ఈపైవిధాన మములున నుండును. ఆపిమ్మట భారతశాసనసభయందు సంస్థానప్రజలకు ౧/3 వంతుసభ్యత నీయనగును. ఈపైవిధానము నంగీకరించుటకు సంస్థానాధీశులకుగాని, భారతీయులకుగాని యెట్టియభిప్రాయభేదము నుండవలసినయవసరము లేదు. నాచే నిర్వ్యక్తమైన యీవిధానము పరిపూర్ణమును, లోపరహితము నని నేను వాదించుట లేదు. నేనుచేసినసూచనల నాధారముగాగొని ఇంతకన్నను మంచివిధానము నితరులు తయారుగావించవచ్చును. ఆంధ్రులయందు ప్రస్తుతరాజ్యాంగనిర్మాణమునెడ ఆలోచనలు సాగించు నుత్సాహమును పురికొల్పుటకును, స్వదేశసంస్థానములవిషయమై అతికష్టముమీదగాని ఆంగ్లభాషయందుకూడ దొరకని విషయములను నాయాంధ్రసోదరుల కర్పించుటకును, వారిదృష్టి నీవిపులమగు సమస్యపై కేంద్రీకృతముగావించుటకును నేనుప్రయత్నించితినని ఈవ్యాసపాఠకు లిందలి గుణమును గ్రహింతురని నేనాశించుచున్నాను.

# మహామంత్రులు

ది. వేం. అవధానిగారు

## ౧. చాణక్యుఁడు.

ఘ్రుంధర్మైతధరాధినాయకనయమ్ము న్వేదవేదాంగస
ద్గ్రంథాధ్యాపనదక్షు సర్వకకుబంతప్రోల్లసత్కీర్తి ధౌ
రంధర్యప్రతిభావిభాసితుఁ డనున్ రాజ్యాధికారాతిగ
ర్వాంధుల్ బంధులు చూడ నాసనపదభ్రష్టుం బొనర్పింతురే?

పాఱుం డీతఁడు వార్ధివేష్టితధరావాల్లభ్యసంపాదితా
పారౌన్నత్యుల మేము; ఎటుల్ ప్రతికృతిప్రారంభసంప్రాపితా
ధారుం డౌనని చేసి రింత; కుపితేదంవిప్రకృష్ణాహిముం
దీరాజుల్ నిలువంగ నేర్తురె కదర్థీభూతదోస్సారులై.

పూర్వాసాదిత మేలఘుస్థితికహా పున్నెమ్మొ దుర్మార్గతా
సర్వస్వప్రతిమూర్తు లీశతులకున్ సర్వంసహానేతృతా
నైర్వాహక్య మొసంగిరన్ ద్విజకృతానల్పాపరాధక్రియన్
ఖర్వీభూతమహాప్రతాపగురుదుఃఖస్వాంతులన్ జేయవే.

అంగద సంగలార్చుచు గుహాగ్రతలమ్మున విశ్రమించునా
సింగపుఁబిల్లజూళమును జేతఁ బెకల్చుట గాదె కొల్వులో
నం గలవారు విస్మితమనస్కులునై చనఁ గండక్రొవ్వునన్
గాంగపయఃపునీతకచక్రమము నాతల వట్టి యీడ్చుటల్.

పోఁగాల మ్మది దాపరించినది కాఁబోలున్ నిరస్తావివే
కాగఃపంకిలుఁడైన రాక్షసుఁడుఁ చేయంబోకుఁ డత్యంతదు
ర్యోగాపాదిధరాసురాపకృతి, నం చుద్ఘోషముం జేయఁ ద
ద్వాగాళిం జెవిఁ బెట్ట కింత యొనరింపం జాలి రీవంచకుల్.

ఘృతసంధానసముజ్జ్వలద్ధుతవహోద్రేకమ్ము మత్క్రోధమా
వితతాటోపభరాపనీతసదసద్విజ్ఞానచేతస్కులన్

మతిమన్నందితనందరాజసుతుల౯ భ్రష్టాధికారప్రభా
నతశీర్షప్రణతాళిగాఁ జలుప కేనా శాంతిఁ బ్రాపించుటల్ ?
ఆగర్వాంధులనిష్ఠురాంగుళులచే నాకృష్టము క్తమ్ములై
పోఁగా నిల్చిన మచ్ఛిరోజములు నాభాగ్యాగ్రహోషర్బుధ
ద్రాగుత్తుంగశిఖాకలాపము నుదగ్రత్వమ్ము పోనిచ్చునే ?
రాగద్వేషనిధాననందతనయప్రాణమ్ములు న్నిల్పునే ?

నందకుమారుల స్మదవినాకృతసారుల రాజ్యవైభవా
నందవిహీనతా ర్తిపరిణద్ధమనస్కులఁ జేసికాక యీ
చిందఱవందలై కడు విశీర్ణత నందిన నాశిరోజముల్
పొందికమీఱ నే ముడువఁబూనుదునే సరివారు నవ్వఁగన్.

పంతముఁబట్టి విద్ధపదభాగమ్ములైన కుశాంకురమ్ము లే
నంత మొనర్చునాఁ డతిమదాంధులు సోదరు లెల్ల జాలి యొ
క్కింతయు లేక త న్పరిభవించిన సైఁపఁగలేక మౌర్యుఁ డ
త్యంతవిషాదపూరితహృదంతరుఁడై ననుఁ జేరి వెంటనే.

'శరణం దేహి ధరాసురేంద్ర!' యను చస్మత్పాదపంకేరుహో
పరి వ్రాల౯ వినయానతాంగుఁ డయి ఆబాహాబలోదగ్రు, నీ
ధరకుం బట్టము గట్టి నిచ్చలు యథాధర్మమ్ముగా రాజ్యముం
బరిపాలింపఁగఁ జేతు సజ్జనకదంబంబుల్ ముదం బందఁగన్.

ఆవినయాంబురాశివదనాంబురుహమ్మున సార్వభౌమతా
శ్రీ విలసిల్లుఁ దచ్చికురశేఖర(?)వక్రతలో నిగూఢమై
కావున వాని నీకుతలకాంతునిగా నొనరించి మంత్రినై
చేవ దలిర్పఁ జూపెద నశేషము మత్ప్రబలద్విజత్వమున్.

క్షిప్రప్రాపితరాజ్యభారుఁ డయి సచ్ఛీలుండు మౌర్యుండు రా
జ్యప్రారంభము చేయుచుండఁగ మదీయామందభూక్షిన్నయా(?)
ర్థప్రజ్ఞానత సర్వభూరమణసంతానుండనై యెన్నఁడు౯
విప్రద్వేషము చేయరా దనుచు నావేదింతు రాజాళికిన్.

చెన్నరాజధానియందు ౧౯౩౦-వ సంవత్సరము జనవరి ప్రారంభము మొదలు మార్చి తుదివరకు గల మూడునెలల కాలమున ముద్రితములయి ప్రకటితములయిన

# ఆంధ్ర గ్రంథముల పట్టిక*

## ఆరోగ్యశాస్త్రము

ఆరోగ్యదర్పణము — యస్. పేరిశాస్త్రి.

ఆరోగ్యమును, మంచినడతయును — (ప్ర) లాంగ్ మెన్స్ గ్రీన్ అండ్ కో., మదరాసు.

## ఇతిహాసము

కృష్ణభారతము, భా. ౨ — (అను) యస్. కృష్ణమూర్తి శాస్త్రి.

## కథలు, ఐతిహాసిక పౌరాణికములు

దాస్యవిమోచనము — యస్. లక్ష్మీపతిశాస్త్రి.

పురాణనీతికథలు, భా. ౧ — యం. రాధాకృష్ణమూర్తి.

మార్కండేయపురాణకథలు — కె. చెంచురామయ్య.

రఘువంశకథనము — బి. తమ్మయ్య.

శ్రీమహాభారతవచనము, భా. ౨ — (ప్ర.) ఆర్. వెంకటేశ్వర్ అండ్ కో, మదరాసు.

## — కల్పితములు

కథాకుసుమమంజరి — టి. పాపయ్యశాస్త్రి.

కథాగుచ్ఛము — వి. రాజగోపాల అయ్యంగారు.

కథాగుచ్ఛము, భా ౧, ౨ — (ప్ర.) విశ్వభారతి గ్రంథమాల, మదరాసు.

పొట్టికథ — కె. వెంకటరావు.

సీమంతిని — యస్. వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రి.

## కల్పము

అష్టోత్తర శతదానకల్పము — (ప్ర.) సి. లక్ష్మీనరసింహశాస్త్రి, మచిలీపట్టణము.

సహస్రఫలదాన కల్పము — (ప్ర) సి. లక్ష్మీనరసింహశాస్త్రి, మచిలీపట్టణము.

## కావ్యములు

ఆంధ్రాధ్యాత్మ రామాయణము — (అను.) పి. నారాయణశాస్త్రి.

శ్రీ తులసీరామాయణము — (అను.) భా. నరసింహశర్మ.

## గణితశాస్త్రము

గణితము, తరగతులు, ౨, ౩, ౪ — యం. శ్రీపతి.

నానాగణితసాధకము — యం. రామయ్య.

బాలబోధగణితశాస్త్రము, భా. ౩ — పి. జె. ఎడ్వర్డు స్వామికన్.

సులభగణితము, భా. ౧ — యస్. కృష్ణరావు.

## గేయములు

అధ్యాత్మరామాయణకీర్తనలు — సుబ్రహ్మణ్యకవి.

అమావాస్య భజనకీర్తనలు — యం. నరసింహదాసు.

ఆత్మానందకీర్తనలు — పోతరాజు.

ఆనందరామాయణ నాటక భజనకీర్తనలు — ఏ. గురుమూర్తి ఆచారి.

ఆరోగ్యగీతములు — కె. భ. భైరవస్వామి.

త్రాగుడుపాటలు — పి. వెంకన్న.

నలచరిత్రసంకీర్తన — యం. సన్యాసయ్యపట్నాయక్.

పెండ్లిపాటలు — జె. వెంకటరామయ్యమ్మ.

భగవన్నామకీర్తనలు — భ. రామాచారి.

భజనకీర్తనలు — సి. వెంకటరామయ్య.

భద్రాదిరామభజనకీర్తనలు — (ప్ర.) సన్ లైట్ బుక్ డిపో, రాజమహేంద్రవరము.

మైరావణచరిత్ర — ఖ. వెంకటరత్నం.

శ్రీ పండరిపురభక్తనామదేవ్ — యం. కృష్ణమూర్తి.

శ్రీపాండురంగభజనకీర్తనలు — టి. యజ్ఞమహాలక్ష్మమ్మ.

శ్రీమద్రాజరాజేశ్వరీ పరదేవతాషోడశోపచార పూజాకృతులు — పి. వెంకటశివయ్యశాస్త్రి.

శ్రీమద్రామాయణకీర్తనలు — కె. చలమయ్యదాసు.

శ్రీశైల శివశంకరగీతామృతము — బి. చిన్నశేషన్న.

సద్బోధానందలహరి — కె. అప్పలదాసు.

## చరిత్ర

ఆంగ్లదేశచరిత్ర సంగ్రహము — బి. సుబ్బయ్య.

---

* ఈ పట్టికయందుగల సంకేతపదముల వివరణము: అ. — అధ్యాయము; అను. — అనువాదము; అనువాదకులు. ప. — పద్యము. ప్ర. — ప్రకాశకులు. భా. — భాగము. వ. — వచనము. సం. — సంపాదకులు. సటీ. — సటీకము

### జీవితములు

వెంకటాద్రీంద్రచరిత్రము—వి. శ్రీరామశాస్త్రి.

### జ్యోతిషశాస్త్రము

జాతకఫలచింతామణి; భా. ౨—వి. సీతారామయ్య.

స్ఫుటతంత్రము—ఆర్. వి. గోపాలరావు.

### దండకము

శ్రీ లక్ష్మీనృసింహస్వామిదండకము—(ప్ర.) బృందావన కృష్ణ ఔషధాలయము, మంగళగిరి.

### నవలలు

అరక్షణీయ—(అను.) యస్. సూర్యప్రకాశరావు.

ఛిన్నహస్తము, భా. ౨—(అను.) జె. సత్యనారాయణ మూర్తి.

నాయకురాలిదర్పము భా. ౧.—సి. వీరభద్రరావు.

పద్మావతి—జి. శకుంతలాబాయి.

భానుమతి—యం. కె. నాగప్ప.

మనోరమ—యం. సుబ్బరాయలనాయుడు.

మానసంరక్షణము—కె. రంగయ్య.

మాయామందిరము—పి. వెంకటశాస్త్రి, యం. సత్యానందరావు.

రహస్యశోధనము—జి. సుబ్రహ్మణ్యశర్మ.

శిశుహత్య, భా. 3—యస్. రామానుజరావు.

హైమవతి—కె. లక్ష్మీనరసింహరావు.

### నాటకములు

అభినవ ఉత్తర గోధనాపహరణము—అర్. అచ్చయ్య నాయుడు.

ఆనందాబాయి—పి. సూర్యనారాయణ.

జ్యోతి—కె. వరలక్ష్మమ్మ.

తప్పెవరిది?—పి. వి. రాజమన్నార్.

పాదుకాపట్టాభిషేకము—వెంకటరాయకవి.

సంగీతవిష్ణులీలలు—యం. శ్రీరామమూర్తి.

సతీశృంగారవటి—యన్. వెంకటరామశర్మ.

సరసానందము—డి. బ్రహ్మానందశాస్త్రి.

### నీతి

వివేకతరంగిణి—కె. కృష్ణమాచారి.

హితోపదేశకథలు, భా. ౧, ౨—డి. యస్. రావు.

### పరిశిష్టము

అహింసాప్రబోధము—బి. సీతారత్నం.

ఆంధ్రనవీనవాచక టిప్పణములు, ౨, 3, ౪, ౫—(ప్ర) కె. మునిస్వామినాయుడు అండు కో., మదరాసు.

ఆంధ్ర వాఙ్మయసూచిక—(ప్ర.) కె. నాగేశ్వరరావు, మదరాసు.

ఆంధ్రవీరారాధన, భా. ౨—డి. సీతారామరావు.

ఆగడపలు—కే. వెంకటరావు.

ఆరోగ్యకామేశ్వరి—సి. వెంకటశాస్త్రి.

ఆలమూరుగ్రామ పునర్నిర్మాణ కార్యనివేదిక—(ప్ర.) యన్. సత్యనారాయణ, ఆలమూరు.

ఆవేదన— శివశంకరశాస్త్రి.

ఆహారము—(అను) కె. లక్ష్మమ్మ.

కావ్యకథావళి; భా. ౨—(ప్ర.) ఆర్యన్ బుక్ డిపో, రాజమహేంద్రవరము.

క్రీడాదిసంవిధానము—పి. యస్. రామశర్మ.

క్రొత్త తెలుగువాచకపుస్తకములు, తరగతులు, ౧, ౨, ౪—యస్. భూషణం.

గద్యపద్యావళి—యం. రామకృష్ణకవి.

గణపతివివాహము—సి. శ్రీనివాసరావు, ఆదోని.

చోరేశ్వరము—యం. మల్లికార్జునారాధ్యులు.

చౌడేశ్వరీవిలాసము—యస్. లక్ష్మీ నృసింహశాస్త్రి.

జీవితాశోభమా—వై. మంగయ్య.

తారాచంద్రవిలాసము—జి. కోటయ్య.

తెలుగుపాఠములు—జి వెంకటాచలం.

దయ—శ్రీ మలయాలస్వామి.

దాంపత్యసుఖాసక్తి మర్మశాస్త్రము—వి. యల్. నరసింహం, టి. యన్. శాస్త్రి.

నిషా—కె. వెంకటరమణాచారి.

నృసింహవిలాసము—కె. ప్రభులింగాచారి.

పదార్థగణదర్పణము—పి. అన్నప్పశాస్త్రి.

పల్లెటూరి పాఠశాల—హెచ్. వెంకటేశ్వర్లు.

పారిశుద్ధ్యము—ఘు. లక్ష్మీనరసింహం.

ప్రార్థన పద్యావళి—(ప్ర) వెంకటరాం అండ్ కో., ఏలూరు.

హొస్కారు పురాష్టావధానము—పి. శ్రీనివాసరావు.
బాలకృష్ణ వాచకపుస్తకములు బుక్. ౧—డి. బాలకృష్ణమూర్తి.
బాలశిక్ష—యం. యస్. హరిహరయ్యర్.
మహానంది క్షేత్రచరిత్ర—యం. వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రి.
మారుతి మొదటివాచకము—ఆర్. సూర్యనారాయణ.
మృత్యుంజయము—(ప్ర.) సనాతనగ్రంథమాల, కొల్లూరు
రత్నపేటిక భా. ౧—(ప్ర.) యస్. లక్ష్మీపతిశాస్త్రి, పిఠాపురము.
వాదిరాజ తీర్థ గురుచరిత్ర—పి. నరసింహం.
విజయదాసులచరిత్ర—పి. నరసింగరావు.
వీపింగునోట్సు—పి. వెంకటశాస్త్రి.
శారదాబిల్లు—వై. వెంకటకృష్ణరావు.
శ్రీ ప్రమోదూతనామసంవత్సర ద్వాదశమాసఫల రత్నము—యం. అప్పలస్వామి.
శ్రీ రామోపనయన మహోత్సవ సంగ్రహము—డి. రామశాస్త్రి.
శ్రీ వేణుగోపాల లీలాపంచవింశతి—జె. భీమయ్య.
శ్రీ శివరామభూపతి నక్షత్రమాల—డి. సూరయ్య.
శ్రీ సూర్యమహారాయదర్శనము—జి. గోకర్ణ కవి.
షోడశరత్నమాలిక—యం. భుజంగరావు.
సతీపురుషరహస్యములు,—యం. శ్రీరామమూర్తి.
సరసకాంత—యం. పాపయ్యదాసు.
సహకారవాచకము—యం. వి. అప్పరావు.
స్వప్నయాత్ర—జె. శేషాద్రిశర్మ.
హేమసుందరోపాఖ్యానము— (ప్ర.) భా. నృసింహశర్మ, బరంపురము.

## పురాణములు

పద్మపురాణాంతర్గత కార్తిక పురాణము—(ప్ర.) సి. లక్ష్మీనరసింహశాస్త్రి, మచిలీపట్టణము.
శివపురాణము, భా. ౨—(ప్ర) యస్. వీరరాజు పంతులు, పిఠాపురము.
శ్రీమదాంధ్రలింగపురాణము—యం. చంద్రమౌళిశాస్త్రి

## ప్రకృతిశాస్త్రము

ఎలిమెంటరీ సైన్సు—డి. సత్యనారాయణ.
ప్రథమశాస్త్రగ్రంథములు—కె. సూర్యనారాయణ, కె. రంగాచారి, ఆర్. గోపాలయ్యర్.
సరస్వతీశాస్త్రపాఠము, తరగతులు ౧, ౪, ౫; ఫారములు ౧, ౨—యస్. సత్యనారాయణమూర్తి.
సృష్టిపరిశీలనావాచకము, తరగతులు, ౪, ౫—భ. యస్. ప్రకాశరావు, కె. హెచ్. వి. యస్. నారాయణ.

## ప్రబంధములు

పారిజాతాపహరణము—నంది తిమ్మకవి.
సంగభూపాలీయము—కె. భావయ్య
హైమవతీవిలాసము—పి. చిదంబరశాస్త్రి.

## భూగోళశాస్త్రము

కడపజిల్లా భూగోళము—యస్. సింహాద్రిరావు.
చెన్నపురిరాజధాని భూగోళము—డి. వి. జగన్నాథం.
చెన్నరాజధాని భూగోళశాస్త్రము—యం. వెంకటేశ్వరరావు.
భూగోళశాస్త్ర పాఠపుస్తకము—యం. వెంకటశాస్త్రి.
భూగోళసంగ్రహము—పి. రామచంద్రరావు, పి. వి. రామకృష్ణరాయర్.

## మతము—హిందు

ఆర్ష మతవిచారిణి—భ. అప్పలాచారి.
గృహస్థాశ్రమ తత్త్వము—(ప్ర) సనాతన గ్రంథమాల, కొల్లూరు.
పంచగవ్యవిధానము—కె. కృష్ణాచారి.
భక్తిపథము—కె. నరసింహశర్మ.
శ్రీ వైఖానస సంధ్యావందనం—(ప్ర.) డి. రంగాచారి, ఈగావారిపాళెం.
సంధ్యా వందనము—(ప్ర.) వెంకటరాం అండ్ కో., ఏలూరు.
సంధ్యావందన ఆరాధన క్రమము—(ప్ర.) గండిగోట శ్రీనివాసమహాసభ, తాడ్పత్రి.
సుప్రబోధరత్నాకరము—శ్రీ మలయాళస్వామి.

## —ఇతరములు

అంబష్ఠ సూత్రము—కె. రంగాచారి.
ఆత్మసంగీతములు—యం. బ్రౌన్.
ఐక్యవిధానబోధిని—(ప్ర). క్రిస్టియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు.

దుర్వ్యయపుత్రుని చరిత్ర—పట్టాభిప్రసంగి.

ధర్మరాజు యేసుక్రీస్తుయొక్క జీవచరిత్ర—(ప్ర.) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు.

భయంకరమైన కవలనొంగలు—(ప్ర.) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు.

మహమ్మదీయమతము—ఏ. యం. రెవరెండ్ బోగ్స్.

సాధుసుందరసింగు—(ప్ర.) క్రిశ్చియన్ లిటరేచర్ సొసైటి, మదరాసు.

హిందూదేశ సబ్బాతుబడుల ఐక్యసమాజము—ఇ. ఏ. అనెట్.

## మాహాత్మ్యము

గౌతమాశ్రమ నగరిదేశాంబామహిమ—జి. కృష్ణయ్య.

శ్రీరంగమాహాత్మ్యము, వచనకావ్యము—(ప్ర.) సి. వి. యన్. అండ్ బ్రదర్సు, మదరాసు.

శ్రీ శివమాహాత్మ్యము—ఏ. సూర్యనారాయణరావు.

శ్రీ సత్యనారాయణ మాహాత్మ్యము—య. వెంకట సుబ్రహ్మణ్యశాస్త్రి.

## యక్షగానము

ధర్మాంగదచరిత్ర—వి. వరదరాజు.

## రాజకీయము

సత్యాగ్రహచరిత్ర—డి. వెంకటశివరావు.

## వేదాంతము

అచలతత్వరత్నమాల—జి. నాగప్ప.

ఆత్మదర్పణము—(ప్ర.) కె. నరసింహం, క్రప.

ఆత్మరాజ్యావశ్యకత—సంగయ్యశాస్త్రి.

ఆత్మానాత్మవివేకము—(ప్ర.) పి. త్యాగరాయశెట్టి, మదరాసు.

అధ్యాత్మికద్వాదశోత్తర ప్రశ్నశతి—సంగయ్యశాస్త్రి.

జ్ఞానప్రియ—తత్త్వానందస్వామి.

జ్ఞానాగ్రగ్రంథిజ్ఞేయవస్తుయాత్ర—(ప్ర) యస్. నరసింహయ్య, వేలూరు.

తత్వజ్ఞాన కందపద్యములు—సి. కామయ్య.

తరణముక్తి—పి. యజ్ఞేశ్వరశర్మ.

భగవద్గీతాసంగ్రహము—(ప్ర.) హిందూసమాజము, రాజమహేంద్రవరము.

మహాలయము—స్మశానవాసి.

శ్రీదేవీ కాలోత్తరము—(ప్ర.) యస్. నరసింహయ్య, వేలూరు.

శ్రీమదాంధ్రభగవద్గీత—ఎ. సోమనాథరావు.

సంగ్రహి—ఆర్. శేషసోమిదేవమ్మ.

స్వప్నలబ్ధాద్వైతబోధ—యన్. వెంకయ్య.

## వైద్యశాస్త్రము

ఆయుర్వేదపరిభాష—డి. గోపాలాచార్యులు.

ఘృత తరంగము—(ప్ర.) వి. రామస్వామి శాస్త్రులు, అండ్ సన్స్, మదరాసు.

పశువైద్యవస్తుగుణదీపిక—వై. శ్రీరాములు చౌదరి.

## వ్యాకరణశాస్త్రము

వ్యాకరణము, వాక్యరచన భా. ౨—కె. రంగయ్య.

వ్యాకరణసంగ్రహము—శేషాద్రిరమణకవులు.

## శతకములు

ఆనందరామశతకము—యం. సత్యనారాయణ.

దాశరథీశతకము—(ప్ర.) ఆర్యన్ బుక్ డిపో, రాజమహేంద్రవరము.

నీతిశతకసంపుటము, ౨—(ప్ర.) వి. రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, మదరాసు.

పరిపూర్ణ చన్నయాచార్యశతకము—పి. మహాదేవకవి.

ప్రాణలింగ శతకము—బ్రహ్మానంద సుధాలహరి—జె. వెంకట సద్గురుస్వామి, జి. రామస్వామి

భుజగభూపాలశతకము—కె. సుందరరామకవి.

శ్రీ జానకీపతిశతకము—కె. వెంకటరాజేశ్వరరావు.

శ్రీరామశతకము—పి. నరసింహం.

## సంగీతశాస్త్రము

గాంధర్వకల్పవల్లి—పి. యస్. రాములుశెట్టి.

## స్తోత్రములు

ఆదిత్యహృదయ స్తోత్రం—(ప్ర.) సి. లక్ష్మీనరసింహశాస్త్రి, మచిలీపట్టణము.

ముకుందమాల—(ప్ర.) సి. వి. యన్. అండ్ బ్రదర్సు, మదరాసు.

రాఘవేంద్రస్తోత్రము—అప్పణాచారి.

శివగురుస్తవము—పి. నాగయ్యయోగి.

శ్రీపద వేంకటేశ్వరస్తవము—(ప్ర.) కె. వెంకటరమణయ్య, పెద్దకోట.



౬. కాళహస్తి



౭. పానగల్లు వంతెన, కాళహస్తి



౫. శ్రీకాళహస్తిదేవాలయ గోపురము

ఈమూడు చిత్రములును సి. జి. జగన్నాథ దాసుగారు తీసినవి.

# ఆకస్మికచ్ఛాయాచిత్రములు



౧. మెయిలుబండి

(ఉదయము ఏడుగంటలసమయమున తీసినది)

ఛాయాచిత్రకారుడు: సి. జి. జగన్నాథదాసుగారు.



౨. కళ్లము

ఛాయాచిత్రకారుడు: మండ వెంకటరావుగారు.




## ఫ్రెడరికు రాజు

గొప్పవాడని పేరుపొందిన ఫ్రెడరికురాజు ప్రష్యాదేశమును పరిపాలించుచుండెను. అతని భవనమునకు ప్రక్కగా కొంచెముదూరములో నొక పిండిమర యుండెను. రాజకుటుంబమువా రెవరైనను కిటికీలలో నుండి చూచినచో చాలదూరమువరకు వ్యాపించియున్న చక్కని మైదానము నేత్రోత్సవముగ గనిపించుటకు మారుగా పిండిమర కన్నుల కడ్డుతగిలి యా సుందరదృశ్యమును మరుగుపఱచుచుండెను. సామాన్యమానవులకుగూడ తమ యిండ్లచుట్టును చూచుట కింపుగా నుండవలెననెడు కోర్కె యుండును. కనుకనే, ప్రక్కస్థలములు కాని, ప్రక్కయిండ్లు కాని అమ్మకమునకు వచ్చినపుడు వాని నెంతటి ఎక్కువధరకైనను తామే కొనుటకు సిద్ధపడుదురు. అట్టితఱి, రాజేంద్రుడగు ఫ్రెడరిక్కున కీ తలంపు కలుగుటలో నేమి యాశ్చర్యమున్నది.

రాజు మరయజమానిని పిలిపించి, మరను ఎంత ఖరీదున కమ్మెదవని యడిగెను. అతడు నిర్లక్ష్యమును, గర్వమును గనబఱచుచు, ఎంతటిసొమ్ము ఇచ్చినను తా నామరను అమ్మదలచుకొనలేదని గట్టిగా చెప్పెను. రాజునకు కోపము వచ్చి ఆతొందరలో మరను పడగొట్టి రమ్మని తన నౌకరుల కాజ్ఞాపించెను. మరయజమాని మాత్రము శాంతముగా నిట్లనెను:—"రాజా, నీవు ప్రభుడవు కనుక నేది చేసినను చెల్లుననుకొనుచుంటివి కాబోలు! కాని ప్రష్యాదేశము న్యాయ-చట్టములకు గొడ్డుపోలేదు. ఈదేశమున న్యాయమనునది కలదని నీవే తెలిసికొనగలవు లెమ్ము."

వెంటనే, మరయజమాని రాజుగారిమీద కోర్టులో దావా తెచ్చెను. కేసును చక్కగా విచారించి, జడ్జీలు రాజుగారు మరను తిరిగి కట్టించి స్వంతదారున కివ్వవలయుననియు, దీనికి తోడుగా నష్టపరిహారముక్రింద కొంతసొమ్మునుకూడ నాతనికి ముట్టజెప్పవలెననియు తీర్పు జెప్పిరి.

తన పాలితులలో నొకనిచే నింతపరాభవమును బొందినందుకు రాజెంతో చిన్నవోయెను. కాని, యతడు చాల ఘనమైన మనస్సు కలవాడు కనుక దురహంకారమునకు లోనుగాక, లేనిపోని ప్రతిష్ఠకై పెనగులాడక, గంభీరవాక్కుతో నిండుసభలో నిట్లనెను:—

"నాదేశమున నింతటి న్యాయపూరితములైన చట్టములును, రాజునైన నన్నుగూడ నవసరమగుచో తీవ్రముగ విమర్శించగల నీతిమంతులును ధైర్యవంతులునగు న్యాయాధిపతులును గలరని తెలిసికొనుట కెంతయేని సంతోషించుచున్నాను."

ఇది జరిగిన యెన్నో సంవత్సరములకు ఆ మరయజమాని వంశీయు డొకడు డబ్బు ఇబ్బందులలో జిక్కుకొని, వాటినుండి విముక్తుడు కాజాలకపోయెను. అందుచే నతడు అప్పుడు రాజ్యముచేయుచున్న రాజునకు, పూర్వము మరయజమానికిని ఫ్రెడరికురాజునకును మధ్య జరిగిన విషయమునుగుఱించి వ్రాయుచు తానిప్పుడు ప్రస్తుత స్థితిగతుల ననుసరించి మరను రాజున కమ్ముటకు సంసిద్ధుడనై యున్నానని తెలియజేసెను.

కాని, యాలేఖకు రాజిట్లు తన స్వదస్తూరితో ప్రత్యుత్తరమును వ్రాసెను: "నీవు నీమర నమ్ముటను నే నెంతమాత్రమును ప్రోత్సహింపను. ఆ మర యట్లెంత

కాల ముండకలదో అంతకాలము నది మీవంశ పారంపర్య ముగ వచ్చువారల యనుభవమున నుండవలసినదే గాని యన్యాక్రాంతము గాగూడదు. మన న్యాయాధికారుల నిష్పక్షపాతబుద్ధికిని, మన చట్టముల యౌచిత్యమునకును, ఆ మరయే శాశ్వత స్మరణచిహ్నము అది యొకరిసొత్తు కాదు. ప్రష్యాదేశచరిత్ర కది చెందియున్నది. నీవు చాల బీదతనములో నున్నావని వినుటకు చింతిల్లుచున్నాను. ఇందుతో నీకు కొంత డబ్బును పంపుచున్నాను. అది నీకు సాయపడునని తలంతును. నన్ను నీ వెల్లప్పుడును నీ యందు ప్రేమగల పొరుగింటివానినిగా భావింపుము. —ఇట్లు, విలియము ఫ్రెడరిక్ ."

ఆ మిల్లు నేటికిని ప్రష్యాదేశమున గలదు.

కర్లపాలెం కుటుంబశాస్త్రి, బి. ఎ.

---

## 'ఆతన్వంగి'

వావిలవలస జమీందారుగారగు శ్రీమదినగంటి సీతారామస్వామిగారు గొప్ప విద్వత్ప్రభువులు. వారి యాస్థానమున మహాకవు లుండిరి. క్రోధన సంవత్సరమున శ్రీ మండపాక పార్వతీశ్వరకవిగారు పైవిద్వత్ప్రభువులను సందర్శించిరి. వసుచరిత్రలోని "ఆతన్వంగి" యను పద్యమును సంస్కృతీకరించుట తమ యాస్థానకవుల కసాధ్యమయ్యెననియు, నది లోకమున నున్న కవుల కందఱకు నసాధ్యమనియుఁ బ్రసంగించిరఁట.

వెంటనే పార్వతీశ్వరకవిగా రాశువుగానే యా పద్యమునకు శ్లోకము రచించి చదివిరఁట. ప్రభువును, విద్వాంసులునుగూడ నాశ్చర్యపడిరఁట.

ఇతరుల కసాధ్యమని యిచ్చిన పద్యము

(వసుచరిత్రలోనిది) :

'ఆతన్వంగి యనంగ ఝాంకరణవ
జ్జ్యాముక్త చూతాస్త్రని
ర్ఘాతం బోర్వక, తమ్ములంచుఁ దటినీ
గర్భైకసంజాతకం
జాతవ్రాతము మాటు చెంద నవి యే
చన్ సాగె మున్ముందుగా,
జ్ఞాతిశ్చే దనలేన కిమ్మనెడు వా
చాయాధి సత్యమ్మగన్.'

సులభతరముగా దీనికిఁ జెప్పిన యర్థము:

శ్లో. 'సాఽసహ్యస్మరఝుం క్రియాశ్రయగుణో
న్ముక్తామ్రబాణక్షతిం
తన్వీ, సారసజాతి రిత్యవధృతా
పద్మాటవీ మాశ్రితా
సా సింధోదర సంభవాపి పురత
స్తద్బాధనే చోద్యతా
జ్ఞాతి శ్చే దనలేన కిం త్వితి వచ స్సత్యం
యథా స్యా త్తథా.'

పద్యమునందలి "తమ్మ"లను శుద్ధాంధ్రశ్లిష్టపదమును సంస్కృతీకరించుట యసాధ్యము. "సారసజాతి" యని సమానార్థక సాంస్కృతిక శ్లిష్టపదముగా మార్పఁగలుగుట కవినైపుణి. పద్యమునకన్న శ్లోకమునఁగల రస విశేషము పండితజన సంభావ్యము.

---

## హిందీ ప్రాముఖ్యము

'International Society of Philology, Sciences and Arts' వారి 'The Philomath' అనుపత్రికయందు శ్రీ యమ్.డి. ఠాకూర్ గారు 'భారతదేశము—భాషాసమస్యలు' అను విషయమున కావించిన ఉపన్యాసము ప్రకటితమైనది: అందు వారు భారతదేశమునకు ఒక సామాన్యభాషయు, సామాన్యలిపియు ఆవశ్యకములని తెలుపుచు, హిందీభాషయు, నాగరీలిపియు స్వీకరింపదగినవని కడు ప్రశస్తముగ సమర్థించిరి.

హిందీ అనగా ఉత్తరభారత, మధ్యభారత ప్రాంతములందలి అధిక సంఖ్యాకులు వాడుకొనుచు, సంస్కృత, మహారాష్ట్రి, పాలీభాషలవలె నాగరీ లిపితో వ్రాసికొనుభాషయని నేను గ్రహించుచున్నాను.

హిందీభాషయు, దాని వ్యావహారిక వికృతులును మాటాడిన అర్థము చేసికొనువారు భారతీయులలో ఇరువదికోట్లకు పైగా కలరు.

హిందీ కాక ప్రాంతీయ వికృతియగు పశ్చిమ హిందీ దాదాపు పదికోట్లమందికి మాతృభాషగా పరిగణింపబడుచున్నది.

ఉత్తర హిందూస్థానమున దాదాపు ౨౩,౨౦,౦౦,౦౦౦ మంది హిందీ కాని, ఇండో – ఆర్యనుకూటమునకు చెందిన ఇతర సోదరభాషలు గాని మాటాడువారే.

దక్షిణభారతమునందలి ౬,౪౦,౦౦,౦౦౦ మందికిని నాలుగు ద్రావిడభాషలు మాతృత్వము నధిష్ఠించి కూర్చున్నవి: ౧. కన్నడము, ౨. తెలుగు, ౩. మళయాళము, ౪. తమిళము.

ఇచ్చట, వీరు వేఱొకసందర్భమున యఫ్. ఇ. కీ గారి 'హిందీచరిత్రము' అను గ్రంథమునుండి ఉద్ధరించిన యీక్రిందిపట్టిక సమయోచితము కాకపోదు.

| భాష | మాటాడువారు |
|---|---|
| నేటి కాశ్మీరి | సుమారు ౧౦,౦౦,౦౦౦ |
| లహ్ందీ(అనగా, పశ్చిమ పంజాబీ) | దాదాపు ౬౦,౦౦,౦౦౦ |
| వ్రాచీ(=సింధీ) | ౩౩,౫౦,౦౦౦ |
| గౌర్జరి (=గుజరాతీ) | ౯౫,౦౦,౦౦౦ పైగా |
| శౌరసేని (=పంజాబీ) | ౧,౬౦,౦౦,౦౦౦ పైగా |
| పశ్చిమ హిందీ | ౯,౬౦,౦౦,౦౦౦ పైగా |
| అవంతి(=రాజస్థాన, పహాడీ ప్రాంతములు) | ౧,౪౦,౦౦,౦౦౦ |
| అర్ధమాగధి(=ప్రాచ్యహిందీ) మాగధి (=బీహారీ) | ౩,౪౦,౦౦,౦౦౦ |
| బెంగాలీ | దాదాపు ౫,౦౦,౦౦,౦౦౦ |
| ఒరియా | దాదాపు ౧,౦౦,౦౦,౦౦౦ |
| మహారాష్ట్రి (=మరాఠీ) | దాదాపు ౧,౯౦,౦౦,౦౦౦ |
| కన్నడము | ౧,౦౦,౦౦,౦౦౦ పైగా |
| మళయాళము | దాదాపు ౭౫,౦౦,౦౦౦ |
| తమిళము | ౧,౮౦,౦౦,౦౦౦ పైగా |
| తెలుగు | ౨,౫౦,౦౦,౦౦౦ పైగా. |

[పై అంకెలన్నియు ౧౯౨౧ జనాభా లెక్కల ననుసరించినవి.]

ఇందఱికి అర్థమగు భాష యగుటయే కాక హిందీభాషకు వాఙ్మయసంపన్నతయు, ఎంతెంతటి నిగూఢభావములనైనను ఆంగ్లమునవలె తగురీతి వ్యక్తీకరింప నవువును కలవని తెలుపుటకు గ్రీర్సనుగారి 'The Linguistic Survey of India' అను గ్రంథమునుండి మంచివాక్యమాల నుదాహరించిరి.

హిందీభాష పారసీలిపియందును, నాగరీలిపియందునుకూడ వ్రాయవచ్చును. హిందీ సారస్వతరచనమున పారసీపదములు కాని, సంస్కృతపదములు కాని మిక్కుటముగా ప్రయోగింప నక్కఱలేదు. వలయునన్న ప్రయోగించుటకు అవకాశమును కలదు. హిందీ భారతదేశమున సిద్ధమగు సామాన్యభాషయని చెప్పవచ్చును.

మఱి లిపినిర్ణయ మొకటి మిగిలినది. ఈ సందర్భమున రచయిత భారతలిపులన్నియు నెట్లెట్లు పరిణమించినవో తడవి నాగరీలిపి ప్రాచుర్యమును ఉగ్గడించినారు.

ద్రావిడభాషలు సహా ద్రావిడబ్రాహ్మీ లిపివలన సాధించిన వికారములనే వాడు ననియు, తాటాకుపై గంటముతో వ్రాయు నెడ గీతలుగా వ్రాసినచో ఆకు చినిగిపోవు భయముననే ఈలిపులు గుండ్రన తాల్చిన వనియు వీరు వివరించిరి.

రోమక పారసీక లిపులు తప్ప, భారతదేశమున నేడు వాడుకయందున్న లిపులన్నియు నాగరి కాని, తద్వికృతులు కాని యగుటచే, నాగరి నేర్వవలసినవారికి శ్రమ తక్కువ. కాబట్టి ఈలిపి సామాన్యలిపిగా నవలంబించినచో, సూక్ష్మములో మోక్షము చేకూరును.

ఇట్లు, ప్రత్యేకము లిపులవిషయ మాలోచించినను నాగరిలిపియే స్వీకరింపదగిన దని నిర్ధరించి, నాగరియె తగిన లిపియని ఒప్పుకొన్నచో సామాన్యభాష హిందీయే కావలెనని వేఱుగ చెప్పనే అక్కఱలేదనియు, ఇందులకు హిందువులేకాక, పెక్కురు మహమ్మదీయులును సమ్మతింపక మానరనియు తెలిపి, ఈ రెండును వ్యాప్తికి తెచ్చు మార్గములను కొన్నిటిని సూచించిరి.

౧. ప్రాథమికవిద్యయు, ఆర్థికముగ వీలుపడినచో మాధ్యమికవిద్యయు, ఉచితముగా నుండవలెను.

౨. ఏప్రాంతమునందు ఆప్రాంతపు మాతృభాష యందే బోధన జరుగవలెను.

౩. అంతటను లిపి నాగరియే కావలెను.

ఒకవేళ పంజాబు, సింధులవంటి రాష్ట్రములందు పారసీకలిపియం దభిమానము గలవారికి తమదేశమువారింతమంది కోరెడి నాగరీలిపియెడ నాక్షేప ముండుచో, ఆరెండు లిపులయందు వారియిష్టమువచ్చినది నేర్చుటకు వారి కధికార మీయదగును. కాని భావిభారతసంగ్రథనమును భంగపఱుచురీతి నేతెగవారియెడను మోజులు చూపరాదు.

౪. పాశ్చాత్యభాషలందలి శాస్త్రగ్రంథములకు సరియగు తర్జుమాలు జనబాహుళ్యమునకు సబబైనధరలకు లభింపగలిగినతోడనే శాస్త్ర, సంకేతశిక్షణము సర్వమును హిందీద్వారముననే జరుగవలెను. ఇది ప్రభుత్వము వారు పూనుకోవలసిన పని.

ఆధునిక శాస్త్రపరిజ్ఞానమును సాధించుకొనుటకు అసలే ఆలస్యముగ బయలుదేఱుటవలని అనర్థములను లొంగదీసికొని కట్టుదిట్టముచేసికోవలెనన్న ఈపని తప్పని విధి.

౫. కేంద్రప్రభుత్వమువారికి ఎట్టిరాజ్యాంగవ్యవహారమునకేనియు అధికృతభాష హిందీ కావలెను; రాష్ట్రములకు ఆయారాష్ట్రపుమాతృభాషయే యుండవలెను,—వానిలిపిమాత్రము నాగరియై.

౬. నానాజాతిసమితివంటి అంతర్జాతీయసమావేశములందు భారతీయప్రతినిధి వెళ్లి, ఆంగ్లేయుడు కాని, పరాసు కాని తనభాషయందు వినిపింప నెట్లు హక్కు చూపునో, అట్లే హిందీతో నుపన్యసింప హక్కు కోరవలెను.

౭. అఖిలభారతపరములగు ఉద్యమములును, మహాసభలును తమవ్యవహారము లన్నిటిని సామాన్యలిపిభాషాద్వారముననే జరుపవలెను.

౮. స్వదేశసంస్థానాధిపతుల ఆదరాభిమానములు సంపాదించు యత్నము జరుగవలెను.

బ్రిటిషునాయకులును, భారతనాయకులును కలిసి పాటుపడుచో, మనరాష్ట్రీయవాఙ్మయములును, హిందీవాఙ్మయమును పడయబోవని ఔన్నత్య మేమియున్నది?

---

## నౌకావేగపరినిష్ఠ (-Speed record)
## (శీఘ్రజలగామి 'మిస్ ఇంగ్లండ్ III.')

ఈ జూలై ౧౮-వ తేది సోమవారమునాడు కాయే డాన్ అను ఆయన వేక్ ఫీల్డు ప్రభువు నిర్మించిన

'మిస్ ఇంగ్లండ్ iii.' అను మోటారుపడవపై రెండు సార్లు ప్రాతపరినిష్ఠను అతిక్రమించి క్రొత్తవేగపరినిష్ఠను స్థాపించిరి. ఇంతకు ముందు గార్‌ఫీల్డ్ ఎ. వూడ్ అను అమెరికాదేశీయుడు గంటకు సగటున ౧౧౧.౭౧ మైళ్లు నడపినాడు. కాయే డాను మొదటిసారి గంటకు ౧౧౭.౪౩ మైళ్లు సగటువేగము చూపెను. అంతకు తృప్తిపడక మఱియొకసారి పయనించి ౧౧౯.౮౧ సగటువేగము చూపెను. ఉత్తరమువైపు ప్రయాణమున ౧౨౦.౫౦ మైళ్లు నడపుటచే, నీటిపై నిమిషమునకు ౨ మైళ్లకు పైగా పయనించుటకు ఈతడే ప్రథముడు; దక్షిణమువైపు తిరుగు పయనమున ౧౧౯.౧౨ మైళ్లు నడపెను.

ఈకార్యమువలన, బ్రిటిషు దేశము వాయువునను, స్థలమునను, జలమునను కూడ వేగపరినిష్ఠ నిలిపినదాయెను.

సర్ హెన్రీ సిగ్రేవుగారు ౧౯౩౦ జూను నెల స్థాపించిన ౯౮.౭౬ మైళ్ల పరినిష్ఠను ఈ కాయే డాన్ గారే ౧౯౩౧ ఏప్రిలు ౨ తేది అతిక్రమించి, సిగ్రేవు గారే ఉపయోగించిన 'మిస్ ఇంగ్లండ్ ii.' అను పడవపై ౧౦౩.౪౯ మైళ్లపరినిష్ఠను స్థాపించిరి. పిదప ౧౯౩౧ జూలై ౧౦ తేది ఆపడవపయినే పరినిష్ఠను ౧౧౦ మైళ్లవరకు తెచ్చిరి. పిదప గార్ ఫీల్డ్ ఏ. వూడ్‌గారు హెచ్చిరి. మరల ఇంగ్లండునకు ఆధిక్యమును కొట్టుకొని వచ్చుటకుగాను వేక్‌ఫీల్డు ప్రభువు 'మిస్ ఇంగ్లండ్ iii.'ను కనిరి.

ఈ సెప్టెంబరుమాసమున, అమెరికాయందు జరుగు అంతర్జాతీయ శిక్షాప్రదర్శనమున వూడ్‌గారి 'మిస్ అమెరికా x.' అను క్రొత్తపడవతో పోటీ చేయుటకై ఈమిస్సమ్మగారు— 'మిస్ ఇంగ్లండు iii.' — పయనమైరి.

---

## ప్రాచీన చిత్రములు

### ౧. గణపతి

జయదేవుని గీతగోవిందమునందలి చిత్రములలో మొదటిది. వాహనమయిన మూషికము నున్నది. కాగితపు చిత్రము.

ఏడవ శతాబ్దము నారంభమునాటిది. రాజపుత్ర, పహాడి, కాంగ్ర విధానమున చిత్రింపబడినది.

### ౨. ఉమామహేశ్వరమూర్తి

ఈచిత్రమున జటామకుటధారియైన శివుడు, ఉమాదేవి, ఆమెప్రక్కన నొక పరిచారికయు గలరు. పైవానికి క్రింద కుడినుండి వరుసగ గణపతి, భృంగి, నంది, నెమిలిపైనున్న కార్తికేయుడు నున్నారు. చిత్రమున పైభాగమున నాలుగులింగము లొక్కవరుస నున్నవి.

బూడిదరంగుగల సానరాయిపై చెక్కబడినది. మధ్యహిందూస్థానమునందలిది. ౮, ౯ శతాబ్దముల ప్రాంతముది.

[ఆనంద కే. కుమారస్వామిగారి చిత్రసంచయమునుండి.]

---







మిస్ బీకాజీ వింజీబాయి పాలంకోటుగారు

ట్రినిటీ గాన కళాశాల (ఆక్స్‌ఫర్డు) లో శాశ్వతసభ్యురాలుగ చేర్చుకోబడిన భారత స్త్రీ. ఈ గౌరవము బడయుటకు భారతీయులలో నీమెయే ప్రథమురాలు. ఈమె ౨౫ ఏండ్లనుండి పాశ్చాత్యగాన శిక్షణము బడయుచున్నది.







మిస్ మేరీ జాన్

తిరువనంతపురము (త్రివాండ్రమ్) మహారాజా వారి కళాశాలయందు భౌతికశాస్త్ర నిరూపకురాలు (ఫిజిక్సు డిమాన్‌స్ట్రేటరు)గా నుండిన ఈమె మద్రాసు ప్రభుత్వమువారి విద్యార్థి వేతనముతో ఆంగ్ల దేశ మేగి అచట బి. యస్ సి. (స్పెషల్), ఎ. ఆర్. సి. యస్. పట్టములు పడసి తిరిగివచ్చినది. లండను విశ్వ కళాపరిషత్తున టీచర్సు డిప్లొమా (అధ్యాపక ప్రామాణ్యము) ను కూడ పొందినది. మద్రాసు విశ్వకళాపరిషత్తున భౌతికశాస్త్రవిషయమున మొదటితరగతిలో వచ్చిన మొదటిభారతీయవనిత ఈమెయే; మఱియు బి. యస్ సి. (స్పెషలు), ఎ. ఆర్. సి. యస్. పట్టములను పడసిన మొదటి భారతీయవనితయు ఈమెయే.

కుమారి సుబూర్ మూగాసేటు గారు, బి. ఏ., (ఆనర్సు)

కాలికటు నివాసినియగు ఈమె మదరాసు మేరీ కళాశాలయందు చదివి ఆనర్సు తరగతిలో ప్రప్రథమముగ ఉత్తీర్ణురాలయ్యెను. ఉన్నత విద్యకై ఇంగ్లాండు పోవును.




## 'వైశాఖి'

పు. ౧౬౫; క్రౌను ¼; వెల రు. ౧. కాగితము అచ్చు అట్టకట్టు ముచ్చటగా నున్నవి. విశాఖపట్టణమున 'కవితాసమితి' దీనిని ప్రచురించినది.

శ్రీ మారేపల్లి రామచంద్ర శాస్త్రిగారు, పురి పండా అప్పలస్వామిగారు సంపాదకులు.

'వైశాఖి' కవితాసమితి ద్వితీయవార్షికసంచికకు నామాంతరము. విశాఖపట్టణ మండలమువారి ప్రచురణ మగుట దీనికి 'వైశాఖి' యను నామము కలిగినది. కాని తన్మండలము వారల రచనలతోడనే నిండియుండిన నా నామము సుగృహీత మయియుండెడిది.

ఈమండలమువారు రెండు వార్షిక సంచికలను ప్రచురించి తమ సారస్వతాభిమానమును ప్రకటించినారు. తక్కినమండలములవారికి మార్గదర్శకు లయినారు.

ఒక్కొక్క మండలమువారును తమ మండలము పండితుల రచనములను సంపాదించి ఇట్టి వార్షిక సంచికలను ప్రచురించిన ప్రత్యేకము తత్తన్మండల వాఙ్మయ విజ్ఞానవికాసము తెల్లముగాగలదు. అప్పుడు తమ తమ మండలముల వాఙ్మయవిజ్ఞానసంపదను నితర మండలముల వానితో పోల్చి పరిశీలింపవచ్చును. అంత నొండొరులను మీరి తత్సంపదను పెంపొందజేయ నుత్సాహము ప్రబలగలదు.

'వైశాఖి' యందు పద్యగద్యాత్మకము లగు వ్యాసములు నలువది గలవు. వానిలో నిరువదిటికి మించి విశాఖపట్టణమండలమువారివి. కొంత ప్రయత్నించి యుండిన ప్రకాశకులు తక్కినవానిని సైతము విజయనగరమునగల పండితులకడనుంచి సంపాదించగలిగి యుందురు.

ఇందలి వ్యాసములను రచియించిన వారిలో ముప్పదిమందికి మిక్కిలిగ పత్రికాపాఠకలోకమునకు చిరపరిచితులు. ఇట్లు వ్యాసములు రచియించువారలు కొలదిమందియే యగుటయే ఆంధ్రవాఙ్మయ విజ్ఞాన సంస్కారవికాసముల మందగతికి నిదర్శన మగుచున్నది. ఇక పత్రికలవిలువ పెరుగుట ఎట్లు? ఇట్లు లగుటకు దేశమునందలి విద్యాధికులు పత్రికాప్రకాశకులు కారణభూతు లగుచున్నారు. విద్యాధికులు తాము గడించిన విజ్ఞానము స్వయముగ దేశీయులకు పంచిపెట్టనొల్లరు. ప్రకాశకులేని విద్యాధికులను ప్రార్థించి వారి విజ్ఞానమును సంపాదింతురా యన్న నదియు నంతగా కానరాదు. ఈస్థితి మారి యీయుభయులును ఏకముఖముగ వాఙ్మయసేవకు నడుముకట్టనంతవరకు పత్రికలవలన వాఙ్మయమునకును, దేశమునకును ప్రయోజనము కలుగజాలదు. మీదుమిక్కిలి వాని కయ్యెడు వ్యయమును నిష్ప్రయోజనము.

ఈ సంచికయందలి 'తెనుఁగు తోఁబుట్టువులు' అనునది భాషాచరిత్రమునకు సంబంధించినది. కర్త: మారేపల్లి రామచంద్రశాస్త్రి గారు. గుణరూపముల రెంటను దీనిది అగ్రస్థానము. దీనిగుణపరామర్శ వేరొకచో గాననగును. 'నక్షత్రములు' ఖగోళవిషయకము. రచయిత: గొబ్బూరి వెంకటానంద రాఘవరావుగారు. వైదికవాఙ్మయమును పాశ్చాత్యసిద్ధాంతములును మున్నిడుకొని జ్యోతిశ్శాస్త్రమును పరిశోధించి అశ్విన్యాదులగు ఇరువదిఏడునక్షత్రముల తత్త్వమును, ఖగోళమున వానియునికికి, దేవతలకును, పురాణగాథలకును గల

సంబంధమును సంగ్రహముగ దెలిపిరి. దీనికి పూర్వరంగముగ మేషాదిరాసులయు, ధ్రువునియు సప్తర్షులయు తత్త్వమునుగూర్చి కొంచెము కలదు. ఇందలిసిద్ధాంతములు స్వతంత్రములు, సోపపత్తికములు నయి మెచ్చదగియున్నవి. 'ఈయంశములనుగూర్చి... ప్రతిమలతో విపులముగా గ్రంథము వ్రాసి సమర్పించుకోఁదలఁచినారు వ్యాసకర్త. వీరితలపు సఫలమయి ఖగోళవిజ్ఞానము సకలాంధ్రలోకమునకును కరతలామలకమయి వెలయును గాక!

"కృష్ణశాస్త్రిగారి 'ప్రవాసము – ఊర్వశి' కర్త: కొంపెల్ల జనార్దనరావుగారు. 'జీవితరహస్యమార్గమ్ములు' తెలిచి కవిహృదయము బిగ్గగొంతుకతో 'పాట పాడించి' నట్టి వగు (దేవులపల్లి) కృష్ణశాస్త్రిగారి 'ప్రవాసము – ఉర్వశి' అను ఖండకావ్యమాలల తత్త్వపరామర్శ 'ఇది. విమృష్టకావ్యగుణదోషములతోపాటు భావకవిత్వమును నిరసించువారి కీపరామర్శ దానితత్త్వమును దెలిపి దానియం దభిరుచిని గలిగింపగలదు. ఆంగ్లవాఙ్మయాభిజ్ఞతయాంధ్రవాఙ్మయమునకు కైసేసిన యొకానొక నూతనాలంకారము భావకవిత. దానికి భావకజనులు సృష్టికర్తలు. తత్స్వరూపసద్వివేకము సువిమర్శమూలకము. ఏశాఖవాఙ్మయమయినను సుప్రతిష్ఠమగుటకు గుణదోషవిమర్శ యావశ్యకము. ప్రకృతవ్యాసము చేసినపని అదియే. వ్యాసకర్త సువిమర్శకదృష్టి యిందు పొడకట్టుచున్నది. భావకవులనబడువారెల్లరు నెఱిగి పాటింపవలసిన యంశము లిందు కొన్ని కలవు. రచన మింతకంటె సరళముగ నుండునేని అర్థావబోధ సుగమముగ నయ్యెడిది.

'నవ్యమతము – ధ్వనిమతస్థాపనము' కర్త: శే. వేం. రాఘవఅయ్యంగారు. ఇది కావ్యప్రకాశమున మమ్మటాచార్యులు ప్రతిపాదించి సంస్థాపించిన ధ్వనిమతముప్రశస్తిని ప్రచురించునది. సహృదయజనసమాదరపాత్రము.

'స్మృతివాఙ్మయసంక్షేపము' రచయిత: పరవస్తు లక్ష్మీనరసింహస్వామి అయ్యవారలుగారు. పేరునుబట్టి యిందలి వస్తువు గోచరింపగలదు. జిజ్ఞాసువుల కిది స్మృతివాఙ్మయస్వరూపపరిచయమును గలిగించును.

'వాఙ్మయతత్త్వము' రచయిత: ఉమర్ అలీషాగారు. ఇందలి తత్త్వము చాల వింతను గొలుపునది.

ఇంకను కొన్నికథలు, హరీంద్రఛటోపాధ్యాయుని 'Parrot' అనునాటికకు 'పంజర' మనుపేరగల యనువాదము, రసవత్ఖండకావ్యములు నిందు కలవు.

త్రివర్ణచిత్ర మొకటి సంచికాముఖమున కలదు."

ఇట్లు వ్యయప్రయాసల కోర్చి యథాశక్తి వాఙ్మయసేవ చేయుచున్న కవితాసమితి యభినందింపదగినది.

---

## మధుమురళి

క్రౌనుసైజు ౧౩౦ పుటలు. కర్త: అచ్యుతుని వెంకటాచలపతిరావుగారు.

ఓమరుఖయ్యాము అనునతడు పర్షియను భాషలో రచించిన 'రుబాయతు' అనుకావ్యమున కనువాదము. అతని కవిత్వమును మెచ్చనివా రిప్పటి ప్రాచ్యపాశ్చాత్యవిమర్శకులలో నెవ్వరును లేరు. అతని సిద్ధాంతములు కేవల విలాసచోదితము లనియు నీతిదూషితము లనియు భావించువారు దురభిప్రాయపడుచున్నారనవలెను. అతని గీతములలో సుందరమగు శైలి, మంజులమగు తత్వమును, చక్కని యన్యాపదేశములును, వ్యంగ్యములును నున్నవి. వీనిని మనభాషలో కొంద రచ్చటచ్చట పద్యకావ్యములుగా రచించినారు. కాని సుమారు ౧౭౮ గీతములను గేయములుగ ననువదించి గ్రంథకర్త ఆంధ్రలోకమునకు ఓమరుఖయ్యాముయొక్క కవితామృతమును కల్పనాపాకమును కొంత చూపినారు. కవితారతులును, గేయములం దభిమానము గలవారును దీనిని పఠింపవలెనని మా కోరిక. ఇది వివేకవర్ధనీగ్రంథమాలయొక్క ప్రథమ కుసుమముగా ప్రకటింపబడినది.

గ. న.

---

## జ్ఞానోదయము

క్రౌను సైజు ౫౬ పుటలు. కర్త: వైద్యవిద్వాన్ తెలికిచెర్ల సుబ్బారావుగారు.

హిందుమతతత్వమును వేదాంత శాస్త్రసారము గురుశిష్యుల ప్రశ్నోత్తరపూర్వక సంభాషణరూపముగ ఇందు వివరింపబడినది. దీనిని పఠియించినవారికి మంచి విషయపరిజ్ఞానమును, మోక్షచింతయు పొడమును. వలయువారు రాజమహేంద్రవరం గ్రంథకర్తగారి పేర వ్రాసి తెప్పించుకొనవచ్చును.

గ. స.

---

## నాయీ బ్రాహ్మణప్రదీపము

క్రౌను సైజు ౫౫ పుటలు. వెల ౮ అ.

క్షురకర్మ వేదకర్మయనియు, వేదయుగములో బ్రాహ్మణులే క్షౌరముచేయుచుండిరనియు, క్షౌరము చేయువారందరు బ్రాహ్మణులేయనియు, వారికి యజ్ఞోపవీతధారణార్హత యున్నదనియు మొదలగు విశేషముల నశేషపరిశోధనచేసి పండిత రేవతీప్రసాదశర్మగారు హిందీభాషయందు వ్రాసిరి. బ్రహ్మశ్రీ ఆరిగపూడి వెంకట్రామచౌదరిగారును వ్రాలపుగు శేషాచలాచార్యగారును దీనిని అనువాదించిరి. దీనికి సంపాదకులు నడుకుదురు లక్ష్మీనరసుశర్మగారు, కాటూరుపోస్టు, కృష్ణా.

గ. స.

---

## నీతికథా నిధానము

క్రౌను సైజు ౧౩౪ పుటలు. కర్త: గుడిపాటి సత్యనారాయణశర్మగారు. వెల ౧౦ అ. ప్రకాశకులు: కమలాకర అండు కో., నందిగామ, కృష్ణాజిల్లా.

అతిథి సత్కారము, పాతివ్రత్యమహాత్మ్యము, అన్నదానము, సూనృతభాషణము మొదలగు విధులను గూర్చియు, మిత్రద్రోహము, విశ్వాసఘాత్యము మొదలగు నిషేధములనుగూర్చియు తొమ్మిది పురాణప్రసిద్ధములగు కథలు సుందరమును ధారాళమును నిర్దుష్టగ్రాంథికమును అగు శైలిలో ఇందు వ్రాయబడినవి. నిర్దుష్టమును సుందరమును నగు శైలి నభ్యసింపగోరువారు దీనిని పఠింపవచ్చును. పాఠశాలలలోని నాలుగైదుఫారముల విద్యార్థుల కిది పఠనగ్రంథముగ నిర్ణయింప తగ్గది.

గ. స.

---

## కవిజనరంజనము

క్రౌను సైజు ౭౧ పుటలు, వెల రు. ౧-౦-౦.

ప్రకాశకులు: జయరామ్ కంపెనీ, ౧౩ తంబుచెట్టివీధి, మదరాసు.

ఈగ్రంథము పదునెనిమిదవ శతాబ్దములో విజయనగరసంస్థానములో నాస్థాన కవిగ నుండిన అడిదము సూరకవిచే రచింపబడినది. ఇందలి యితివృత్తము చంద్రమతీ హరిశ్చంద్రుల వివాహము. హరిశ్చంద్రుని సత్యవాక్యనిరతి, అందుకొరకు రాజ్యచ్యుతి, కాంతావియోగము, ఏకపుత్రమరణము, కాటి కాపరితనము, కళత్రహత్యాప్రయత్నము మొదలగు విషాదాంశములు గాని, వాటినుండి దైవప్రసాదమున మోచన మందు అద్భుత సందర్భములు గాని యిందు లేక, హరిశ్చంద్ర చంద్రమతుల సౌందర్యములు, శీలములు, పరస్పరానురాగములు, విరహములు, వివాహకాంక్షలు, పెండ్లి మాటలు, కల్యాణము, శృంగార సౌఖ్యములు, విలాసములతో ముద్దులు మూటకట్టు శైలితో నలరారుచున్న మూడాశ్వాసముల ప్రబంధ రాజము. ఈగ్రంథము తరువాత నింతచక్కని ప్రబంధ మాంధ్రమున వెలువడకుండుటచే ప్రబంధ యుగమున కిదియే కడపటి యెల్లయని చెప్పవచ్చును. ఇది కడపటిదే యయ్యు కల్పనలలో కాని, శైలిలో కాని, వర్ణనలలో కాని, వైఖరులలోగాని అత్యుత్తమ ప్రబంధములతో తుల్యమై వానిని మరపించుచుండును. ఇంత చక్కని పురాతనగ్రంథమును ఆంధ్రులపఠనముకొరకు చక్కగ ముద్రించి ప్రకటించిన శ్రీ గంటి సూర్యనారాయణ

శాస్త్రిగారెంతయు కృతజ్ఞతాపాత్రులు. దీనికి భోగరాజు నారాయణమూర్తిగారు పీఠికను వ్రాసిరి.

గ. స.

---

## బ్రహ్మదేశచరిత్రము

మొదటిభాగము. గ్రంథకర్త: కొండ్ర శ్రీరాములుగారు. చెన్నపురి ఆంధ్రపత్రికా కార్యాలయమున ముద్రితము. వెల రు. ౧.

ఈగ్రంథమున బర్మాదేశపు నైసర్గికస్వరూపము, భారతీయులు, తెలుగువారు, మంగోలియనులు మొదలగువా రచ్చటికి వచ్చి పూర్వకాలములో నివాసము లేర్పరచుకొనుట, బౌద్ధమతవ్యాపనము, దేవాలయములనిర్మాణము, బర్మాదేశము నేలిన రాజవంశముల చరిత్రములు, బర్మా ఆంగ్లేయులకు స్వాధీనమగుట, ప్రస్తుత బర్మీయుల ఆచారవ్యవహారములు మొదలగువిషయము లెల్ల సమగ్రముగ చర్చింపబడినవి.

బర్మా ఆంగ్లేయులవశమైనప్పటినుండియు హిందూదేశమునకును అచ్చటికిని సముద్రముపై రాకపోకలసౌకర్యము లేర్పడి, కూలీ నాలీ వ్యవహారలాభము మొదలగునాశలు పొడమి అనేకు లాసీమకు వలసపోవుచున్నారు. ఇట్లు వలసపోయి స్థిరపడినవారిలో ఆంధ్రు లధికసంఖ్యాకులు, అనగా వా రొకలక్షయేబదివేల కధికముగా స్త్రీపురుషులు కలిసియున్నారు. వీరిలో వ్యవహారమువలన ధన మార్జించినవారు కొంచెముమంది మాత్రమే. వారిచరిత్రలు చిత్రములుకూడ ఈగ్రంథమున ముద్రించబడినవి.

గ్రంథకర్త మిగుల శ్రమపడి అచ్చటి స్థితిగతు లెల్ల చర్చించినారు. ఆంధ్రులు పెక్కురు పఠించినచో అతనిశ్రమ కొంత సార్థకమగును గనుక ఎల్లరును చదువవలెనని హెచ్చరించుచున్నాము.

గ. స.

---

## ఠాకూర్ దుర్గాదాస్

గ్రంథకర్త: యస్. ఆర్. రావుగారు. ఈగ్రంథము, కాకరపర్రు (పశ్చిమగోదావరిజిల్లా), సరస్వతీ గ్రంథమాలవారిచే ప్రచురింపబడిన యొక చరిత్రాత్మక నవల. వెల రు. ౧-౮-౦.

ఇందలి ఇతివృత్త మాంధ్రదేశమున నెల్లరు నెరిగినదే. విమలాదేవి, రసపుత్రవిజయము, ద్విజేంద్రలాలు రాయిగారి యనువాదిత నాటకములు, చిలకమర్తి లక్ష్మీనరసింహముగారి రాజస్థానకథావళి, ఇవి కాక రైలు స్టేషనులదగ్గర నమ్ముచుండు చవుకగ్రంథములు మొదలగు వాని ద్వారా యీ కథ ఆంధ్రదేశపాఠకులకెల్ల రోకళ్ల పాటయైనదే. పలువు రెరిగినట్టియు, పలువురిచే వ్రాయబడినట్టియు కథనే తిరిగి వ్రాయబోవునెడల నందులో నేదేని యొక విశిష్టవిశేషణమును గ్రంథకర్త చూపనోపునని పాఠకు లాసింతురు. అట్టి దేదియు నిందు లేనట్టే తోచెడిని.

ఈనవల యే హిందీ మరాఠీ లేక బంగాళీ మాతృకకో, భాషాంతరీకరణమై యుండవచ్చునని ప్లాటుయొక్క బిగువువలన, వర్ణనల సంభాషణముల ధాటివలనను తోచెడిని. అయినను మాతృకయొక్క ప్రశంస పీఠికలో నెచ్చటను గానరాదు. ఇదివరకే మన ఆంధ్రవాఙ్మయము అనువాదితగ్రంథములతో, అందును విశేషముగ అనువాదిత నవలలతో మితిమీరి పోవుచున్నది. ఈగ్రంథలేఖకులగు యస్. ఆర్. రావుగారి వంటివారు అన్యరాష్ట్రముల సంబంధములగు చారిత్రక గ్రంథములమీదిదృష్టిని తమ మాతృరాష్ట్రము, సోదర జాతి, స్వీయభాష, పరిచితప్రదేశవర్ణనము మొదలగు విషయములపై త్రిప్పి స్వతంత్రరచనలకు గడంగి ఆంధ్రకల్పనలయొక్క యనుంగుపోకడలను పాఠకలోకమున కెల్ల చవిగొల్పుదురు గాక యని కోరుచున్నాము.

లేఖక ముద్రాపక ప్రమాదములు లేకపోలేదు. కొంచెము శ్రద్ధ బూనినచో నవి తొలగియుండెడివి. సుందరమగుశైలి, చక్కనిప్లాటు, అసమానరసపుత్ర శౌర్యసౌశీల్యప్రకటనము, హైందవసంఘద్వేషుల పరా

భవము చదువరులకు శౌర్యౌదార్యములను బురికొల్పక మానవు.

గ. స.

---

## 'బ్రహ్మచర్యము'

ఆదర్శగ్రంథమాలా పుష్పము ౧; గ్రంథకర్తలు: శ్రీయుతులు పాలదుగు శేషాచలార్య, ఆరికపూడి వేంకటరామ చౌదరిగార్లు. వెల రు. ౧-౮-౦.

కృష్ణాజిల్లా, ఎలమర్రుగ్రామములో స్థాపింపబడిన శ్రీ ఆదర్శగ్రంథమండలి వారి ప్రథమపుష్పమగు నీ 'బ్రహ్మచర్య' మను పుస్తకము గ్రంథమండలి పేరున కొంతయు నొప్పియున్నది. బ్రహ్మచర్య మన నేమి? తద్వ్రితనియమము లేవి? బ్రహ్మచర్య మెప్పుడు పుట్టెను? మున్నగు విషయములను గూర్చియు, బ్రహ్మచర్యము వలనిలాభము, దానిపాలన లేకపోవుటవలని నష్టము మొదలగు ననేక విషయములను గూర్చియు నీ గ్రంథమందు విపులముగ చర్చయున్నది.

అత్యంతకఠినమగు బ్రహ్మచర్యదీక్షను జయప్రదముగ సాధించుటకు వలయు విధులన్నియు పేర్కొనబడినవి. బ్రహ్మచర్యముయొక్క మహిమను నిరూపించెడి మహాపురుషులయొక్కయు, వేదాది మహాగ్రంథములయొక్కయు సుభాషితము లీగ్రంథమందు గానగును. మరియు, శీర్షాసనము మున్నగు కొన్ని యాసనముల చిత్రపటములు చేర్పబడియున్నవి.

గ్రంథమునం దచటచట పునరుక్తి గలదు. బ్రహ్మచర్యపాలనవలన హైందవులు వీర్యవంతులయి, స్వరాజ్యమును బడయగలరని ప్రతిప్రకరణమునందును చెప్పుట యనావశ్యకము.

ఈ గ్రంథమును ఆంధ్రదేశమందలి కళాశాలల గ్రంథాలయములందు చేర్చుట యువకుల కెంతయు శ్రేయోదాయకముగ నుండగలదు.

'చంద్రశేఖరం'

---

## తత్త్వత్రయము

దివాన్ బహదూర్ రామానుజాచార్యులవారు తత్త్వత్రయ మను శ్రీభాష్యకారులగ్రంథమును హూణభాషా పరివర్తనము కావించి యాంగ్లేయభాషాపరిచయుల కత్యంతోపకారము కావించిరి. అందు వారీ విషయముల చక్కగా క్రోడీకరించి సరళమగు శైలియందు రామానుజ సిద్ధాంతము తెలుపబడిరి. ఇది తత్త్వజిజ్ఞాసువుల కత్యంతసహాయకారియై యున్నది. ఈగ్రంథప్రచురణమున శ్రీభాష్యపు ఆంగ్లభాషాపరివర్తనము పూర్తియగుచున్నది.

మానవునిహృదయము వస్తువిషయనిర్ధారణము కావించువఱకును తృప్తిచెందకున్నది. అమితవేగమున పరిభ్రమించుచుండు ఈస్థూలప్రపంచ మే మూలవస్తువు నుండి యుద్భవించినది? సత్యమన నేది? ప్రకృతియన నేది? జన్మమునకుఁ బూర్వము మానవుఁ డెచ్చోట నుండెను? మరణానంతర మేప్రదేశమునకు నేగుచున్నాఁడు? అను నీప్రశ్న లనాదినుండియు మనుష్యుల కలవఱపఱచుచున్నవి. ధీశక్తిచే మానవుఁడు పశుపక్ష్యాదులకు భిన్నుఁడై యా యమోఘశక్తిప్రభావమున నిట్టి విషయముల నిర్ధారింపఁ బ్రయత్నించుచున్నాఁడు. ప్రాచ్యఖండములందు బుద్ధ, మహావీర, గౌతమ, కపిల, మహమ్మద్, శంకర, రామానుజులును, పాశ్చాత్యఖండమునందలి అరిస్టాటిల్, ప్లేటో, లుసిప్పస్, డెమొక్రిటిస్, కేంట్, హీగెల్ మొదలగువా రందరును పైప్రశ్నములకు సమాధానములు చాల కృషికావించి యొసంగిరి. వారు వారు తమకుఁ దోఁచినరీతిని నుడువుటచే తృప్తికరమగు విషయము కానరాకున్నది. రామానుజు లనేకసిద్ధాంతములఁ బరిశీలించి యందలి లోపాలోపముల గ్రహించి యట్టి లోపములు లేకుండునట్లు సర్వజనసమ్మతమగు సిద్ధాంతమొండు స్థాపించిరి.

తత్త్వత్రయమే వారిసిద్ధాంతము. ప్రకృతి కతీతుఁడును సర్వాంతర్యామియగు పరమాత్మ ప్రథమ తత్త్వము. అతనినుండియే శరీరఇంద్రియనిర్మాణకమగు ప్రకృతి వెడలుచున్నది. అనంతకోటిజీవాత్మలు తమ

ప్రత్యేకతచే భిన్నములై యున్నవి. సత్యజ్ఞానసాధకము లగు ప్రత్యక్ష అనుమాన శాబ్ద జ్ఞానవిషయముల నిర్ధారించి యందుమూలమున పైతత్వముల రామానుజులు స్థాపించిరి.

ఇ. జ.

## కోళ్లపరిశ్రమ

కర్త, వెటర్నరీ ఆయుర్వేద వైద్యభూషణ డాక్టరు యేలేళ్ల శ్రీరాములు చౌదరిగారు. పశువైద్య గ్రంథనిలయము ౬-వ పుష్పము. మొదటికూర్పు ౧౯౩౭. సైజు డెమ్మీ ౧/౧౬, పుటలు ౧౧౭. వెల ౮ అణాలు. మనదేశమున కోళ్లపరిశ్రమ క్రమేపి క్షీణదశలోనికి వచ్చినందునను, కోళ్లపరిశ్రమకూడ రైతులకు సంబంధించిన ముఖ్యమైన ఉపవృత్తులలో నొకటి యగుటవలనను, మన తెలుగుభాషలో నీసంపత్తిని గూర్చిన పుస్తక మింతవరకు లేకుండుటలోటును దీర్చుటకును ఈగ్రంథము ప్రచురింపబడినదట. అన్ని జాతుల కోళ్లు బాతులు గూర్చిన యన్ని వివరములును, వానిని పెంచి వృద్ధి చేయురీతులన్నియు, వాని రోగనివారణ మార్గములును ఇందు తెలుపబడినవి. గ్రంథము ఆరుభాగములుగ నున్నది. సుమారు ౧౭ బొమ్మలుకూడ ముద్రింపబడినవి. ఈ విషయమున శ్రద్ధగలవారందరికి ఈపుస్తక ముపయోగపడును. గ్రంథకర్తకు, అంగలూరు, కృష్ణాజిల్లా, వ్రాసినచో పుస్తకములు లభింపగలవు.

జ. బ్ర.

## ఆంధ్ర రఘువంశము

పద్యకావ్యము. బొబ్బిలి సంస్థానాస్థాన విద్వత్కవులును కీర్తిశేషులును అగు మండలేముల సీతారామశాస్త్రులవారు రచించినది. తత్పౌత్రుడు మం. వేంకటశాస్త్రిగారు, బి. ఎ., ఎల్. టి. ప్రకటించినది. ౧౯౩౭. వెల ౧ రూపాయి. డెమ్మీ ౧/౮ సైజున ౨౧౨ పుటలు. ఇందు శ్రీ శాస్త్రులవారి శిష్యుడు మండపాక పార్వతీశ్వరశాస్త్రిగారు (సోంపేటలో ఉపాధ్యాయులు) వ్రాసిన కీ. శే. శాస్త్రులవారి జీవిత సంగ్రహముకూడ మొదట చేర్పబడియున్నది. వలయువారు మం. వెం. దక్షిణామూర్తిగారు, C/o డిప్యూటీ ఇన్‌స్పెక్టర్ ఆఫ్ స్కూల్సు, ఇచ్ఛాపురం, గంజాంజిల్లా అని వ్రాయవలెను.

## శ్రీ వివేకానంద సందేశము

స్వామివారి జన్మదినోత్సవ సందర్భమున ౧౯౨౯ లో మార్కాపురపు సమాజమువారికొఱకు వ్రాయబడిన వ్యాసము. త్రిలిఙ్గ పత్రికనుండి పునర్ముద్రితము. కర్త: కూచి నరసింహముగారు. ప్రకటన ౧౯౩౦. ౨౪ పుటల ఈ పుస్తకము "తెలుగుతోట" మలిపంటగా ప్రచురింపబడినది. ఈ దిగువవిలాసమునకు వ్రాయుచు పోస్టులో ౧ అణాబిళ్ల అంపినవారి కొక్కొక్కరికి ౧ ప్రతిమాత్రము ఉచితముగ పంపబడునట. వ్యాసకుటీరము, మేలుపాక, విశాఖపట్టణముజిల్లా.

## శ్రీ పురుషోత్తమసంహితా (సంస్కృతము)

(శ్రీమత్ పాంచరాత్రాగమాంతర్గతా): సంపాదకః, పా. సీతారామానుజాచార్యః, భద్రాచలమ్, క్రీ. శ. ౧౯౩౭ వర్షమ్, శ్రీ పాంచరాత్రాగమశాస్త్ర సర్వస్వమ్, భద్రాచలమ్, గ్రంథమాలికాశాఖా—ప్రచురణమ్ ౨. సంహితాగుచ్ఛమ్—పుష్పమ్ ౨. ఈ కృతి శ్రీ కా. నాగేశ్వరరావు పంతులుగారికి సమర్పింపబడినది. డెమ్మీ ౧౯౮ పుటలు. వెల, పలురకముల ప్రతులు ౧-౮-౦ నుండి ౪-౦-౦ వరకు.

## గోరక్షణ

౧. గోప్రభావము: తెనాలివాస్తవ్యులు బ్రహ్మశ్రీ మహోపాధ్యాయ ముదిగొండ నాగలింగశాస్త్రిగారిచే రచింపబడినది. ౩౪ పుటలు.

౨. గోవు: ఏలూరు వాస్తవ్యులు శ్రీ బొడ్డు బాపిరాజుశ్రేష్ఠిగారిచే రచింపబడినది. ౪౩ పుటలు.

౩. కామధేనువు : లక్కవరం సంస్థాన విద్వాంసుడు శ్రీ కొత్తపల్లి సుందరరామయ్యగారిచే రచింపబడినది. ౩౫ పుటలు.

పైమూడు పుస్తకములును ఏలూరు గోసంరక్షణ సమితి కావ్య ప్రచురణములు. సమితివారి త్రివార్షిక కావ్యబహుమానములలో వరుసగ ప్రథమగణ్యము (రు. ౧౧౬ బహుమతి), ద్వితీయగణ్యము, తృతీయగణ్యములుగ ఎంచబడి క్రౌనుసైజున గ్రంథములుగ ప్రచురింపబడినవి.

---

# గ్రంథ స్వీకారము

## దేవరబాగిలు

కన్నడభాష. కర్త బెంగ్సె గోవిందరాయరు, బి. ఏ., ఎల్. ఎల్. బి. జయకర్నాటక గ్రంథమాల, ధారవాడ. ౯ వ పుష్పము. ౧౯౩౭. సామాజికనాటకము. క్రౌను ౧|౧౬ సైజున ౯౬ పుటలు. వెల, ౮ అణాలు.

---

## అఘవినాశ శతకము

కర్త, దాసరి అంజదాసు, ఆదిపూడి, పర్చూరు పోస్టు, బాపట్లతాలూకా. ౧౯౩౭. వెల ౭ అణాలు. క్రౌను ౧౬ పుటలు. ఈ శతకము వేమనశతకము ననుసరించినది. నీతి, భక్తి సంయుతమై యున్నది. వలయువారు, కొప్పోలు చలపతిరావుగారు, చీరాల అని వ్రాయవలెను.

---

## మల్లెపువ్వులు

'(లిరికల్ పొయెట్రీ)'; కర్త, కే. అన్నమరాజశర్మ. ౧౯౩౬. క్రౌను ౪౭ పుటలు. వెల ౪ అ. శ్రీ బాలభారతీ గ్రంథనిలయము, అనుబంధ గ్రంథమాల-౩ ప్రచురము. ప్రకటనకర్త, యం. రామసుబ్బయ్యశ్రేష్ఠి, చాగలమర్రి (కర్నూల్ జిల్లా).

---

## శ్రీ భగవద్గీతాదర్శనము

కర్త, నిడమర్తి జలదుర్గాప్రసాదరాయడు, రాజమండ్రి. ఈగ్రంథమున, మూలమును, మూలమునకు ప్రతిపదార్థమును, శ్లోకములకు గల సంబంధమును ప్రకటింపబడినవి. అధ్యాయార్థ సంగ్రహము, నధ్యాయ సంబంధమును వివరింపబడినవి. ముఖ్యపదములకు సూచిక గూడ జేర్పబడినది. కొన్ని మార్పు కూర్పులును, నర్థతాత్పర్యముల గొన్ని విశేషములు నిందు గలవు. డెమ్మీ ౧|౧౬ సైజున ౧౯౦ పుటలు. ౧౯౩౭ ప్రచురము. వెల తెలుపబడలేదు.

---

## శోభావతి

తెలుగు సాంఘికనవల. గ్రంథకర్త్రి, ఎ. పెరియ పిరాట్టమ్మ, మదరాసు. ౧౯౭౪ ప్రచురము. డెమ్మీ ౧|౧౬ న ౧౯౮ పుటలు. వలయువారిట్లు వ్రాయవలెను :— ఎ. ఎల్. మూర్తి, ౪. టంకసాల సుబ్బారాయలునాయని వీథి, పాతచాకలపేట, మద్రాసు.

---

## శ్రీమదరుణాచలక్షేత్ర మాహాత్మ్యము

ఇది శ్రీమదీశ్వర యతీంద్రులచే అనుగ్రహింపబడిన ద్రావిడభాషాగ్రంథమును వి. గోపాలునిచే ఆంధ్రీకరింపించి శ్రీ రమణీయవాణి పుస్తకాలయమువారిచే ప్రకటింపబడియె. ౧౯౩౦. క్రౌను ౧|౧౬ సైజున ౯౬ పుటలు. వెల ౮ అణాలు. N. A. తిరువణ్ణామలైకి వ్రాసినచో పుస్తకములు లభించును.

---

## మహాత్మా గాంధి జీవితము, గాంధి యిర్విన్ ఒడంబడిక

హరికథ. గ్రంథకర్త, రావిపాటి కామేశ్వరరావు, సత్తెనపల్లి, గుంటూరుజిల్లా. క్రౌను ౧|౧౬ సైజు, ౬౭ పుటలు. వెల ౬ అణాలు.

---

అభినవ గాంధర్వకళ

(హార్మోనియం నేర్చుటకుగాను). మొదటి భాగము. గ్రంథకర్త, నవరత్నం వెంకోబాచార్లు, ఆత్మకూరు, కర్నూలుజిల్లా. ౧౯౩౨. డెమ్మీ ౘ సైజు, ౭౫ పుటలు. వెల ౧-౮-౦. హెచ్చుకాదా? వలయువారు టి. బాలనాగయ్యశెట్టి, బాలసరస్వతి బుక్కుడిపో, చౌక్ బజారు, కర్నూలు అనిగాని యెన్. హనుమంత రావుబ్రదర్స్, నందికొట్కూరు (కర్నూలుజిల్లా) అనిగాని వ్రాసిన బడయగలరు.

---

My Experience as a Legislator
(నా శాసనసభానుభవము)

(గ్రంథకర్త్రి): శ్రీమతి డాక్టరు యస్. ముత్తు లక్ష్మిరెడ్డిగారు, ఎమ్. బి. సి. యమ్., మదరాసు శాసన సభకు పూర్వము ఉపాధ్యక్షురాలు. గ్రంథప్రచురము ౧౯౩౦. డెమ్మీసైజున ౨౮౬ పుటలు. వెల ౨ రూపాయిలు.

---

శ్రీ గాయత్రీరామాయణమ్

ఇయ్యది, శ్రీమద్వాల్మీకిమహర్షి ప్రోక్తమై, శ్రీమాన్ బహుజనపల్లి రాఘవాచార్యులవారిచే బరిష్కృతమై గోటేటి కృష్ణమూర్తిశర్మచే బ్రకటింపబడినది. ౧౯౨౧ ప్రచురము. చందాదారులకు రు. ౧-౨-౦, ఇతరులకు రు. ౧-౮-౦. క్రౌను ౭౨ పుటలు. చక్కని బైండు. జి. కృష్ణమూర్తిగారు, మామిడూరు, కృష్ణాజిల్లా అని వ్రాసినచో పుస్తకములు దొరకును.

---

## ధన్యోఽస్మి!

సోమంచి సూర్యనారాయణ శర్మగారు

చేదుమందుల రోసి భుజింపలేని
గదికి నబ్బెను ప్రాక్తనకర్మవశత
అతిమధురతావకీన నామామృతమ్ము
ఇంక నామయభయము నా కేల స్వామి!

మొఱకుదొరల దలంచుటే నరకమన్న
కృతికి దొరకెను తొంటిసుకృతము కతన
సరసభవదీయ లీలాప్రసంగకలన
హేయనుతికలుషంబు నా కేల స్వామి!

కుటిల పరసేవ యన్న లోగ్రుంగుజీవి
కేమి పుణ్యముననో భజియింప నబ్బె
పరమసుభగమహా నీద్య శ్రీపాదయుగము
ఇతర సేవాభయంబు నా కేల స్వామి!

బహుళతమభీకరవ్యథా భగ్నహృదయ
మేమిసుదినమొ కాని చిగిర్చె నేడు,
కురిసె త్వత్కరుణాసుధా కుంభవృష్టి!
హీనవైక్లబ్యమతి నా కికేల స్వామి!

---

## గాయత్రి

శ్రీముక్తేవి లక్ష్మీనరసింహదాసుగారు, బి. ఏ.

[స్థితిలేని నామనస్సున మా కొండాలి సుబ్బారాయని హఠాన్మరణవార్త యూగినది. కరుణము పొంగిపోగా, నది కట్టుకొన్న దీభాగమే.—]

ఓం భూర్భువస్సువః,
ఓం తత్సవితు ర్వరేణ్యం
భర్గో దేవస్య ధీమహి,
ధియో యో నః ప్రచోదయాత్.

౧

భూలోకము

వాణి:—

నాపురాకృతపూర్వ పుణ్యములవెల్ల
ప్రాణుగట్టిన మానవమాత్రు డేను.

జన్మజన్మంబు లెన్నెన్నొ చాదుకొనిన
మహితవిజ్ఞానమునను చిన్మయుడ నేను.

ప్రాజ్ఞవాషాఢ జలద పర్యంకమందు
తళుకులీనెడు సొబగు జ్యోత్స్నసముండ
అవిరళంబైన జీవితాంతరములందు
మధువు పుడిసిల్ల ద్రావు దీపథమునందు.

స్నేహవాణి:—

అమితపుణ్యసమార్జనంబైనయట్టి
జన్మ పొందినదానికి సార్థకమ్ము.

పూత మీజన్మ నవనవనీతమైన
మార్దవమ్మున సరిరాని మానసమ్ము.

ప్రథితజీవితరుచిరార్ద్రపథములందు
సూక్తిమధురమ్ము హా సార్ద్రశుభ్రవదన
మరవిరియు పూవుదమ్మి నిత్యమ్ము మాకు.

వైరాగ్యవాణి:—

అన లహంకార మనగ కాయమున నున్న
యెముకనిర్మాణమునగూడ నెగసిపడును
అసలుతావల మిద్ది దేహము దురంత
దుష్టవాంఛానిబద్ధ బుద్బుదమె యగును.

అంతర్వాణి:—

ఇది మహోజ్వార మింతింత నెదిగి యెదిగి
గాఢతమసంపు పరివృత్తి క్రమ్ముకొనును
అస్థిరంబున స్థిరమైన యట్టియూహ
స్థిరమునం దస్థిరత్వమ్ము సిద్ధపఱచు.
ఇద్దియొకమానసప్లుతి ఈవిషమ్ము
అమృతవిశ్లేషమై తోచు నహరహంబు.

౨

భువర్లోకము

కావ్యవాణి:—

ఓయిమిత్రమ! నీయూహ లూరుచుండు
తరతమమ్ములతో స్వర్గధామములను
ఊహ కూహకు ముడివెట్టి యుత్ప్రబుద్ధ
మీమహాప్రజ్ఞకును నిర్నిద్ర మింద్రి(?)
యమ్ములందున ముల్లోక మాడుకొనును.

జిజ్ఞాసావాణి:—

ఎన్ని పరివృత్తులంబడి యీాది యీాది
పొందితివో దుర్లభంబైన పుణ్యరూప
మంత్రదవ్వుల తరియించి యమృతమూర్తి
విశ్వమయతేజ మిది యిట్లు వెలుగుగాత!
ఇంతగా జుట్టుకొను నహంకృతి ఫలించి
పరిఢవిల్లుచు నీ దవ్వె ప్రజ్వలించు!

ఆంధ్రవాణి:—

అగునగును నీవు చరితార్థుడగుదు నిజము
విస్మృతంబైన జాతీయ విశ్వమందు.
జాతి కుత్తరగతులకొ, చదువుతలల
ఒక్కకలమున చిత్రించి యుద్ధరించి
నావు మాలోన నొకడ వైనావు నీవు!

3

సువర్లోకము.

స్వర్గవాణి:—

పర్వ మీానాడు ప్రాప్తిల్లె ప్రాచినుండి
వాయుపథమందు వీతెంచు వాణి యొకడు
అమిత తేజోమయంబైన యంతరిక్ష
మార్గమందున తేజమ్ము మాసరముగ.
ఓ మహాకవి నీ పుర్వి నుద్భవిల్లి
విస్మృతములైన మాకీర్తి వెల్లువలను
ప్రతి గస్పృష్టించినా వనుపలుకు మ్రోసె
రాజరాజులతో కృష్ణరాయుగొంతు!
అచటచట నున్న జ్యోతిర్మయంబులైన
ఈ పురావళు లివి యేమి యిందు నందు
నాకు నాత్మీయు లింద రున్నారి దేమి?

*  *  *  *

కొన్ని బంధము లిచ్చట పన్ను కొన్న
నెంతయో ప్రాణసంకట మెరిగినాను
చిరము వసియించుటను గాక చిత్రమైన
వ్యూహముల బన్నుకొని తృప్తినుందు రేల?
తిక్కనాదులు నిచ్చట తెలియరారు
కొందరు ప్రసిద్ధులైన ముక్తులునుమాత్ర
మిచట నున్నారునుంగూడ నిందు తమకు
కీర్తు లపకీర్తులనుచు లంఘింతు రేల?

రూపవాణి:—

వ్యాహృతులయందు సప్తధా భ్రాంతమైన
అర్చిరనుమేయమూర్తి గాయత్రిదేవి!
విస్ఫురచ్ఛందముల నన్ను విహృతిగొల్పి
కదపుచున్నది యూర్ధ్వలోకముల పొంత.

అరూపవాణి:—

శబ్దమున నర్థమట్లుగ ఛందమందు
గానమట్లుగ నోంకార గర్భశక్తి
బ్రహ్మమట్లుగ చిద్రూపభాగధేయ
రూపరహితుని నన్ను విద్రుతు నొనర్చు.

ఉపసంహృతి

అంతవాక్కులపడి కొంత నణచికొంచు
చక్ర మాకృతి గాంచిన సత్వతేజ
మంత కంతకు పెద్దదై యంత యింత
చిన్నదియు నౌచు నొకట నదృశ్యమయ్యె!

---

# మనవి మాటలు

## ‘తెనుఁగు - తోఁబుట్టువులు’

‘వైశాఖి’ యందు నాలవభాగము నాక్రమించినది ‘తెనుఁగు-తోఁబుట్టువులు’ అనువ్యాసము శ్రీ మారేపల్లి రామచంద్రశాస్త్రులుగారు బహుగ్రంథములు ‘చూచి’ దీనిని రచియించినారు. వీరు ‘తాము తెలుపఁదలఁచువిషయము చదువువారిమదిని కుదురుగా నాటునటుల చేయఁజాలు శైలి’ నలవరుచుకొనిన నిపుణులు. విషయము భాషాచరిత్రమునకు జెందినది. కావున నీవ్యాసము ‘వైశాఖి’కి మకుటము; పాఠకుల కగ్రగణ్యము; భాషాచరిత్రజిజ్ఞాసువులకెల్ల పరమాదరణీయము. దీనిని ‘వ్యాస’ మనుటకన్న భాషాచరిత్రాత్మకమగు నొక చిన్నిగ్రంథమనుట యొప్పును.

ఇందు రచయిత తొలుత భాష, భాషాచరిత్రము, భాషాభేదములు, ఉపభాషలు, ప్రమాణభాషలు, భాషల మార్పుమున్నగువాని తత్త్వమును క్రమముగ వివరించుచు, భాషాకుటుంబముల చర్చ నందుకొని ‘తమకున్న పోలికలనుబట్టి ఏర్పడిన భాషాకుటుంబములలో మన భరతఖండమున ఎన్నికకు వచ్చునవి మూఁడు: ఉత్తరమున ఆర్యభాషాకుటుంబము; దక్షిణమున ద్రావిడభాషాకుటుంబము; ఈరెంటికిని నడుమ నున్నది ముండాభాషాకుటుంబము. ఇందు మొదటిది వడవంగడము, రెండవది తెన్వంగడము, మూఁడవది నడివంగడము—అనఁదగు........ సంస్కృతము, హిందీ మొదలగుభాషలు వడవంగడములోనివి. మన తెనుఁగును, దాని తోఁబుట్టువులు తెన్వంగడములోనివి’ అనిచెప్పి ‘తల్లిసంస్కృతంబె యెల్లభాషలకును’ అనుమాట ‘అభిమానమునుబట్టి చెప్పినదేకాని నిజము కాదు’ అని ద్రావిడభాషల స్వతంత్రస్థితి నంగీకరించిరి. ఈ ‘భాషాకుటుంబములలో ద్రావిడభాషాకుటుంబము తక్కినభాషాకుటుంబములకంటె తొల్లింటి’ దని సకారణముగ చర్చించి తత్ప్రాచీనతను స్థాపించిరి. ఈ ‘తెన్వంగడము’ భాషలలోనివగు ‘గోండి, కోఁదు, కురుఖు, మల్తో, కోలామీ’ అను ౫ భాషలు అవి వాడుకయందున్నప్రదేశములనుబట్టి ‘ఉత్తరదేశభాషలుగా లెక్కకువచ్చును.’ ఇది యిప్పటిస్థితినిబట్టి. నాటికాలమున ‘దస్యులతో పోరి తుదకు వారి నోడించి వారిదేశ మార్యులాక్రమించినపిదపఁగదా ఉత్తరదేశ మార్యావర్త మయినది. అయిన దస్యు లేమయిరి? ఎక్కడకు పోయిరి? ఇపుడు వారిసంతతివా రెవరు?’ అని ప్రశ్నించి ‘దస్యులే ద్రావిడులై’ రని తలంచుటచే ‘భారతఖండమంతయు తొలుత ద్రావిడదేశమే’ అనియు, ‘ద్రావిడభాషయే అపుడు భరతఖండభాష’ యనియు శాస్త్రిగారికి తోఁచుట న్యాయ్యమే. ఇది కాదనువా రెవరేని ఆర్యభాషలగు ప్రాకృతములలోని దేశ్యములు ద్రావిడభాషలలోనివిగాక మరియేభాషలలోనివో చెప్పవలసియున్నారు. వీరి యీసిద్ధాంతమునకు ‘ఇపుడుకూడ బలూచిస్థానమున దానికి రాజధానియగు క్వెట్టాపట్టణమున వాడుకగనున్న “బ్రాహూఈ” అను భాషయే ప్రబలమగు తార్కాణ’ అయినది.

అంత తెన్వంగడమునందలి పదునాలుగుభాషలను పేర్కొని, వానియుత్పత్తి, అవి మాటలాడు దేశభాగములు, ఆయాభాషల యుపభాషలు, వానివాని వాఙ్మయములస్థితి మొదలగువిషయములను సంగ్రహముగ వివరించి వానిస్వరూపము దెలియుటకు మచ్చువాక్యముల నిచ్చిరి. ‘తెన్వంగడములో కొలుచువారి మొత్తమునుబట్టి తెనుఁగుపలుకువెలందియే తొలిగద్దెను వెలయుచున్నది.’ తరువాతివి తమిళము, కన్నడము, మలయాళము. వానికి దరువాతివి తక్కిన తొమ్మిదిభాషలు.

మనభాషకు గల “‘తెనుఁగు; తెలుఁగు, ఆంధ్రము’ అను పేరులలో ‘తెలుఁగు’నకు ‘తెల + ఉన్ + ంగ్’ కలసి ‘తెలుంగ్’ అయి ఇప్పటి పలుకుబడినిబట్టి ‘ఉ’ చేరఁగా ‘తెలుంగు’ అనునుడి ఏర్పడియుండును...దానికి ‘తెల్లగా ఉండువారు, అట్టివారిభాష, తేటగా ఉండునుడులభాష, అని అర్థములు వచ్చును” అని వ్యుత్పత్తి చెప్పిరి. కాని ‘దీని వ్యుత్పత్తినిబట్టి భాషాగుణము తెలియవచ్చుచున్నది.

గాని, యిది తెనుఁగునాటిభాషకు తొలిపేరు కాదనియు 'తరువాత వచ్చిన పేరనియు తలంచిరి. 'నన్నయ తిక్కనలు వాడిన తెనుఁగునుడి, రూపాంతరమును, అముఖ్యమునుగాక, స్వతంత్రమును, ముఖ్యమును అనియు మన భాషకు మొదటిపేరనియు' నమ్మిరి. 'తెనుఁగు' పదమును 'తెన్ + ఉన్ + ంగ్ + ఉ' అని విడదీసి 'తెన్నున (దారిలో) ఉండువారు; వారిభాష. తెన్నున ఉండువారి దేశము తెనుఁగునాడయ్యె. ఈ తెనుఁగునాడే ఆర్యుల దక్షిణాపథము. దక్షిణాపథము, దక్షిణదేశము నొకదానిని తెలుపు'నని, యందుకు నిదర్శనముగా

> "ఇది దక్షిణాపథంబున
> కిదియు విదర్భాపురమున కిది కోసల కి
> య్యది యుజ్జయినికిఁ దెరువులు
> మది నిన్నిటిలోని నరుగ మన కెద్దియగున్."

అను భారతారణ్యపర్వాంతర్గత నలోపాఖ్యానమునందలి పద్యము నొసగిరి. తరువాత 'ఆంధ్రశబ్దము భాషనేకాక, జాతిని-దేశమునుకూడ తెలుపుచున్నది. ఇది సహజముగా మొదట జాతికిని, పిమ్మట భాషకును, అటుపిమ్మట దక్షిణమున ఒకదేశమునకు పేరై ఉండవలె. ఆంధ్రులు తరువాత తెలుఁగువారితోఁ గలసిపోయినను మొదట ఆర్యజాతివారయినటుల ఐతరేయబ్రాహ్మణమువలన తెలియవచ్చుచున్నది. వారిభాష ఆంధ్రమును ఆర్యభాషలలో ఒకటి అని వేఱే చెప్పనక్కఱలేదు. ఆంధ్రులు తొలుత అనాగరకులును, బలహీనులునైనను కొంతకాలమునకు బలవంతులయి రాజులయి, తెనుఁగునాటి నాక్రమించుకొని పాలించుటచే అదియు ఆంధ్రదేశమయ్యె. ఆంధ్రులు కొలఁదిమంది అగుటచే వారి భాష తెనుఁగువారిభాషతో కలసిపోయినది. ఇట్లు తెన్వంగడములోని తెనుఁగుభాషయును, ఆర్యభాషా కుటుంబములోని అంధ్రమును కలసి యేర్పడిన మొత్తము భాషకు తెనుఁగు, తెలుఁగు నుడులే కాక ఆంధ్రపదము కూడ పేరయ్యె' నని చెప్పి 'ఇందువలన తెనుఁగునాటి తొలిభాష తెనుఁగే కాని ఆంధ్రము కాదనుట తేటతెల్లము' అని తేల్చిరి.

'కొలుచువారి మొత్తమునుబట్టి' 'తొలిగద్దెను వెలయుచున్న' మన తెనుఁగుయొక్క 'వాఙ్మయము ప్రాచీనతనుబట్టి మూఁడవదిగా లెక్కకువచ్చుచున్నది.' కాని వెనుకటిది, యిప్పటిది కలిపిన కొంత విరివిగనే కాన్పించుచున్నను 'మహాభాషలని పేరొందిన సంస్కృతము ఇంగ్లీషు మొదలగు భాషలలోని వాఙ్మయములవలె సంపూర్ణమయినదని తెనుఁగువారు చెప్పుకొని సంతోషింపఁజాలని స్థితిలో నుండుట నిక్కము. ఈలోటును దీర్చుటకయి సరియయిన ప్రయత్నములు కొనసాగుట లేదనియు, ఇతరభాషలలోని ఉత్తమగ్రంథములను తెనిఁగించుటయు 'స్వతంత్రములగు' సాహిత్యగ్రంథములు, లక్షణ గ్రంథములు, చరిత్రగ్రంథములు మొదలగువానిని 'పసగలశైలిని' 'పసిగా వ్రాయ'వలయుననియు హెచ్చరించుచున్నారు.

'పసగలశైలి యలవడుటకు తెనుఁగు పసిగా నేర్చుకొనవలె......అనఁగా తెనుఁగునుడుల నిక్కపురూపులను అర్థములును, సొమెతలును, సొగసులును తెలిసికొనవలె; నుడులు కూర్చు నేర్పు సమకూర్చుకొనవలె' నన్నారు. 'లేనిచో మదిలోని తలంపులను సూటిగా వెల్లడించు పసగల మేలిశైలి పట్టువడదు. అది లేనిచో మనవాఙ్మయము వన్నెకెక్కదు; లోకమునకు పనికిరాదు. అట్టిచో మనకు వాఙ్మయము ఉన్నను లేకున్నను ఒక్కటియే' అని గట్టిగా చెప్పినారు. 'తమ వాఙ్మయము లోకమునకు పనికివచ్చునట్లు పెంపొందింపఁదలఁచు తెనుఁగువారు తెనుఁగున మంచిపాండిత్యము గడించుకొనవలె' నన్నారు. అట్లు తెనుఁగున మంచిపాండిత్యమును సంపాదించుటకు 'తెనుఁగును, సంస్కృతమును మాత్రము కాక తెనుఁగు తోఁబుట్టువులగు తెన్వంగడములోని భాషలును, తెనుఁగునకు తోడ్పడిన ప్రాకృతము మొదలగు భాషలును, భూమండలమందంతటను వ్యాపించి సంపూర్ణమగు వాఙ్మయముతో వెలయుచున్న యింగ్లీషు భాషయును చదువవలె'నని రచయిత కావించిన యమూల్యోపదేశము భాషాజిజ్ఞాసువులకు, వాఙ్మయ సేవాపరాయణులకు నెంతయుసమాదరణపాత్రము. చివరకు 'తెనుఁగు వాఙ్మయమున కున్నలోపము తీర్చుతలంపుతోడనే అంగబలముతోడను, అర్థబలముతోడను' ఏర్పడిన

ఆంధ్రసాహిత్యపరిషత్తు 'చేయఁబూనుకొనిన మొదటి పెద్ద పని-సూర్యరాయాంధ్రనిఘంటు ప్రచురణము' 'నేటికిని వెలివేయఁబడినది కా' దని వగపును దెలుపుచు తత్ప్రచురణము త్వరలో కావింప పరిషత్తువారిని కోరిరి.

మఱియు తెనుఁగునకు సంప్రాప్తమయిన 'దురవస్థను తప్పింపవలసినబాధ్యత నిజమునకు ఇపుడు ఆంధ్రవిశ్వవిద్యాపరిషత్తు వహింపవలె' నని కోరుచు నీవ్యాసమును పరిసమాప్తినొందించిరి. ఈ యమూల్యవ్యాసమునే రచయిత విపులీకరించి గ్రంథముగ ముద్రించి ప్రచురించినయెడల తెనుగు చదువువారికి గొప్ప ఉపకారము చేసినవా రగుదురు.

అందును ప్రాచ్యవిద్యాపరీక్షలకు చదువు విద్యార్థులకు ప్రకృతము భాషాతత్త్వ చరిత్రాధ్యయనము అందని మ్రానిపండయి క్షోభను గలిగించుచున్నది. ఉన్న గ్రంథము లాంగ్లమున నుండుట, తెలుఁగున చెప్పఁదగిన దొక్కటియైన లేకపోవుట, ఆంగ్లముననున్న వానిలో పెక్కులు విపరీతసిద్ధాంతములతో విప్రతిపత్తి కాకరములయియుండుట, బోధకులకే యవి దురవగాహములగుట విద్యార్థుల క్షోభకు గారణములు. కావున శాస్త్రిగారు వ్యాసమును పెంచి గ్రంథరూపమున వెలువడఁజేసి విద్యార్థిబృందముకృతజ్ఞతకు బాత్రు లగుదురుగాక! 'తెనుఁగుతల్లి' 'మేలివాఙ్మయములున్న పలుకులవెలందు లెక్కిన గద్దియలతో సాటివచ్చు గద్దె' నెక్కుట కొకమెట్టును కట్టి 'వాసికెక్కుదురుగాక!'

---

## సూర్యరాయాంధ్రనిఘంటువు

'తెలుఁగుభాషలోని పదములకు వ్యుత్పత్తి మొదలగువానిని నిరూపించుచు లక్ష్యసహితముగ నర్థమును వివరించు సర్వంకషమగు నిఘంటువు నొకదానిని రచించి ప్రకటించుట' ఆంధ్రసాహిత్యపరిషత్తు ఉద్దేశములలో ప్రధానమయినది. 'ఆంధ్రసాహిత్యపరిషత్తు తెలుఁగుభాషను వాఙ్మయమును అభివృద్ధి నొందించుమార్గములలో నిది మొట్టమొదటిది.' ఈయుద్దేశము పరిషత్తు పుట్టిననాడు (౧౨-౫-౧౯౧౧) పుట్టినది. ఇది తెలుగుభాషకు తెలుగునాటికి మహోపకారకమయిన కార్యమని తలపని, యుప్పొంగని యాంధ్రు డుండడు. అప్పుడే ఈనిఘంటువును ఆంధ్రసాహిత్య పరిషత్తునాధిపత్యముక్రిందనే, తత్కార్యముగనే తయారుచేసి ముద్రించుటకగు ధనమునంతయు తా మొసంగెదమని శ్రీ పిఠాపురము మహారాజావారు వాగ్దానము చేసిరి. కావుననే నిఘంటువు తన్నామాంకితమయినది. శ్రీ జయంతి రామయ్యపంతులుగా రిందుకు కారకు లనవలసియున్నది.

తరువాత నిఘంటు నిర్మాణపద్ధతులను గూర్చి శ్రీ జయంతి రామయ్యపంతులుగారొకవ్యాసమును వ్రాసి ౧౯౧౨ లో ప్రకటించి విద్వాంసులకు కొందఱికి పంపి వారి అభిప్రాయములను సంపాదించిరి. వానినొక 'పండితసంఘము' చర్చించినది. 'ఆలస్యా దమృతం విష' మను నార్యోక్తి ననుసరించి ఒకరో యిద్దరో తమ యిష్టముచొప్పున చేసేకార్యము కావనియు, పదిమంది విద్యాధికులు చేరి చేయవలసిన'దనియు నిశ్చయించినది. 'ద్రావిడభాష కొకనిఘంటువు రచించునటుల దొరతనమువా రీనడుమ నుత్తరవుచేసి యాకార్యము నిర్వహింప నొకసంఘము నేరుపాటు చేసియున్నారు. వా రింకను నిర్మాణపద్ధతులను నిరూపించుకొన్నట్లు తోపదు. ద్రావిడాంధ్రభాష లన్యోన్యసంబంధము కలవి కావున నీరెండుసంఘములు నొకదానితో నొకటి సంప్రతించుకొనుచుండుట మేలు' అనికూడ సంభావించినది. 'మేలు' అన్న 'సంప్రతింపులు' ఎన్నిమారులు జరిగెనో, ఏవిధమయిన 'మేలు' సమకూరెనో తెలియరాదు. చివరకు శ్రీరామయ్యపంతులుగారు సూచించినపద్ధతుల ననుసరించియే నిఘంటురచనము ప్రారంభమయినది.

ప్రమాదీచ(౧౯౧౩-౧౪)సంవత్సరమున నిఘంటు నిర్మాణమునకు పూర్వాంగముగా భారతప్రయోగానుక్రమణిక * వ్రాయబడినది. నిఘంటురచనమున కిది

---

* భారతమునందలి పదముల నన్నింటిని విడదీసి యొక్కొక్కదాని నొక్కొక్క కాగితపుముక్కమీద వ్రాయుట.

సహకారి అంతగా కాకున్నను వ్యయముమాత్రము అధిక మయియుండును. తెలుగుజిల్లాలయం దంతట వాడుకలో నున్న వృత్తిపరిభాషాపదములు కొన్ని సేకరింపబడినవి.

౧౯౧౫-వ సంవత్సరమున శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు సంపాదకులుగా నియమింపబడిరి. వారికి సాహాయ్య మొనర్చుటకును, తత్సమాదిశబ్దములను ఏరుటకును మరికొందరు నియమింపబడిరి. ఈకార్యము చెన్నపురమున నాంధ్రసాహిత్యపరిషత్కార్యాలయమునందే జరుగుచుండెను. శ్రీ శాస్త్రులుగారివంటి యుద్దండ పండితులు సంపాదకు లగుటచే నిఘంటు వచిరకాలముననే సంపూర్ణమయి యాంధ్రలోకమునకు లభింపగల దనునాశ కలిగెను. పనియంతయు నందుకయి ఏరుపడిన యొకసంఘమునాదేశము ననుసరించియే జరుగుచుండినది. సంపాదకు లాసంఘమున నొకసభ్యుడయ్యును ప్రత్యేకము తమ యభిప్రాయముల ననుసరించి నిఘంటు రచనమును జరుప ననుకూలపడమిచేత కాబోలు రెండేండ్లకు తరువాత పరిషత్తువారు చెన్నపట్టణమున జరిగిన పని యంత తృప్తికరముగా లేదని చిన్నపుచ్చుకొనవలసి వచ్చినది. ఇందుకు నిఘంటు నిర్మాణమును కొనసాగించుచున్నవారి లోపమో, వారి ననుపదమును 'ఇటు అటు' అని తన యిష్టానుసారము త్రిప్పుచుండినసంఘములోపమో కాని, నిఘంటువునకు ధనము నొసంగ ప్రతిశ్రుతము చేసిన మహారాజావారు తమ అనుక్షణ పర్యవేక్షణమున నిర్మాణకార్యమును జరిపెద మనిరన్న కారణమున నిఘంటుకార్యస్థానము కాళయుక్తి (౧౯౧౭) సంవత్సరాది నాటికి పిఠాపురమునకు మార్చబడినది.

శాస్త్రులుగారి సంపాదకత్వము చెల్లిపోయినది. 'నిఘంటునిర్మాణసంఘము' మాట మరి వినరాదయ్యెను. చెన్నపురమున పనిచేయుచుండినవారిలో శ్రీ తెంజనగరం తేవప్పెరుమాళ్లయ్య (దేవరాజసుధి) గారు—ఇంచుమించు శ్రీ శాస్త్రిగారిని పోలినపండితులు—ఒక్కరే-కార్యస్థానముతోపాటు పిఠాపురమునకు దీసికొనిపోబడిరి. సంపాదకులుగా కాదు, నిఘంటుకార్యాలయమున తత్సమపదముల పనిచేయుటకు. నాడుమొదలు శ్రీ జయంతి రామయ్యపంతులుగారు సంపాదకత్వమును వహించిరి- శ్రీ రాజావారు వారిని కోరినందున. అప్పటినుండియు 'వస్తుసంగ్రహము, తద్విమర్శనము' జరుగుచు వచ్చినది. ౧౯౨౦-వ సం. మార్చి ప్రాంతమునకు, మూడింట రెండుపాళ్లు అనగా 'ప'లో సగమువరకు తత్సమపదములు కూర్చబడినవి. 'వచ్చినవే పెక్కుసారులు వచ్చినమాట లనేకములున్న' ఆచ్ఛికపదములు ౪౪౫౯౫ సేకరింపబడినవి. 'ప్రాకృతపదములు ౮౩౧', 'ద్రావిడపదములు ౫౩౧౪' సిద్ధమయినవి. మొత్తము సమకూర్చినపదములు ౧౩౫౮౮౧. ఇది నిఘంటు కార్యస్థానము పిఠాపురముచేరిన రెండేండ్లలో జరిగినపని. ఈవిషయము, పైపదములకు పండితులు నిర్ణయించిన అర్థాదులను 'పరిశీలించి సిద్ధాంతీకరించుభారము' తమయందు గల, 'భారతము మొదలయిన పెద్దగ్రంథములు కొన్ని' తాము 'ముందుగాజదివి యందలి ముఖ్యపదముల గుర్తించుచున్న' సంపాదకులు ౧౯౨౦-వ సం. మార్చి నెలలో ప్రచురించిన నివేదికవలన స్పష్టమగుచున్నది. ఇట్లు రెండేండ్లలో పని చురుకుగ జరిగినది. ఇపుడీసంపాదకుల కున్న స్వాతంత్ర్యము, సిద్ధాంతీకరణభారము వెనుకటి సంపాదకులకు లేకపోవుటచేతనే కాబోలు ననవలెను ఆరెండుమూడేండ్లలో కార్యఫల మేమియు కనబడక పోవుటకు కారణము! అది యిపు డప్రస్తుతము.

ఎట్లయిననేమి, ౧౯౧౧-వ సంవత్సరమున ఆంధ్ర సాహిత్యపరిషత్తున నుద్దేశరూపమున మొలకెత్తిన నిఘంటునిర్మాణకార్యము మహారాజపోషణము గలిగి యుండియు ౧౯౨౦-వ సం. నాటికి (అనగా ౯ ఏండ్లకు) ఇట్లు రెండవఆకు వేసినది. పదపడి కొలదికాలమునకు, ఏపండితుని ప్రకృష్టపాండిత్యము నిఘంటు నిర్మాణమున కూతగ్గుగా నుండదగినదో ఆ పండితుడు, తేవప్పెరుమాళ్లయ్యగారు కాలగతినిచెందిరి. వారిస్థానమున శ్రీ శ్రీపాద లక్ష్మీపతిశాస్త్రిగారు నియమింపబడి వారు చేయుచుండినపనినే సాగించుచుండిరి.

నిఘంటునిర్మాణవిధానమునుగూర్చి తొలుత శ్రీ రామయ్యపంతులుగారి వ్యాసము, చెన్నపురమున కార్యస్థానముండగా నొకమచ్చుపదములపట్టిక, పిఠాపురమునకు మారినతరువాత సం. ౧౯౨౨ లో నింకొకమచ్చు

పదములపట్టిక, ఆ పయి సం. ౧౯౨౫ లో మఱొక్క పట్టిక ప్రకటితములయి పండితులకు విమర్శనార్థము పంపబడినవి. కాని వాటి విమర్శన మెట్టిదో లోకమునకు తెలియకపోయెను. చివరపట్టికపయినమాత్రము సూచనలు విమర్శనలు కొన్ని 'భారతి'యందు ప్రకటితములయినవి.* మహారాజపోషణము, ఎక్కువ భారమును వహించిన సంపాదకులు గల ఈనిఘంటురచన మీతీరుననుండ, దీనికంటె రెండేండ్లతరువాత ప్రారంభమయిన ద్రావిడ నిఘంటువున, దేశభాషలపయి నభిమాన మంతగా చూపరనుకొను విశ్వవిద్యాలయమువారు తయారుచేయించుచున్న దానియందు ౬౩౨ పుటలుగల మొదటిసంపుటము, భాగత్రయాత్మకము, ముద్రితమయి ప్రకటితమయినది. అందు మొదటిభాగము ౨౬౬ పుటలు గలది ౧౯౨౪-వ సంవత్సరముననే ప్రకటితమయినది. అది మొదలు ఏటా రెండేసిభాగములవంతున ప్రకటితములగుచునే యున్నవి. ఈసంవత్సరము అయిదవ సంపుటమున మొదటిభాగము వెలువడినది. అందు చివరపదము 'పీషాణ్మష్టమి' (భీష్మాష్టమి). మొత్తము నిఘంటువున్న నేటికి వెలువడిన పుటలు ౨,౭౩౨.

సూర్యరాయాంధ్రనిఘంటు ప్రకటనము అనువత్సరము 'అది జరుగుతూ ఉన్నది, ఇది జరుగుతూ ఉన్నది, ఇదిగో ప్రకటించుచుంటిమి, ఏవో యిబ్బందులు కలిగినవి' అని యీతీరున దూరదూరమునకు పోవుచున్నది. ఇటీవల ప్రమోదూత సంవత్సర కార్యనివేదకయందు 'అకారాదిపదముల చివరపరిశోధనము నిఘంటుసంపాదకులచే గావింపబడుచున్నది. అజాదిపదములన్నియు నిట్లు పరిశోధింపబడినపిమ్మట నవి నిఘంటు ప్రథమసంపుటముగా ముద్రింపఁబడును.' అని సంపాదకులు తెలిపిరి. ఇప్పటికి ఒకటిన్నర ఏడాది అయినను సంపుటము ఇంకను వెలువడినది కాదు.

పదియేండ్లకుపైగా నిఘంటుశరీరమునకు ప్రధానాంగములను సమకూర్చుచు, నిఘంటునిర్మాణకార్యములయందు మంచి యనుభవమును గడించుకొనిన శ్రీ శ్రీపాదలక్ష్మీపతిశాస్త్రిగా రిటీవల కార్యాలయమును వదలిపోయిరని తెలియవచ్చుచున్నది. సమర్థులు, అనుభవము, విషయసంగ్రహము గలవారు నగు శ్రీ శాస్త్రిగారు నిఘంటునిర్మాణకార్యాలయము నిట్లు వదలిపోవలసివచ్చుట నిఘంటువు దురదృష్ట మనవలసియున్నది.

నిఘంటునిర్మాణము ప్రారంభమయి యిరువదేండ్లు దాటినది. దాదాపు లక్షరూపాయలు వ్యయమయినవి. కాని, నిఘంటువున నల్పభాగమేనియు నింకను ముద్రితము కాకున్నయది. ద్రావిడ నిఘంటువ్వివన్నో మూడింట రెండువంతులు ముద్రితమయి వెలువడినది.

---

* భారతియందు ప్రకటితములయిన వ్యాసములు:—

౧. శ్రీ సూర్యరాయాంధ్రనిఘంటువు. శ్రీమాన్ యీయుణ్ణి వెంకటవీరరాఘవాచార్యులుగారు. ప్రభవ, శ్రావణమాససంచిక, పు. ౧౯-౨౫. ఇందు సూచనలు గలవు.

౨. సూర్యరాయాంధ్ర నిఘంటువు - మచ్చుపదములు. శ్రీ చిలుకూరి నారాయణరావుగారు. ప్రభవ, ఆశ్వయుజసంచిక, పు. ౫-౧౯. ఇందు విమర్శనపూర్వకము లగు సూచనలు కలవు. 'పదిహేనుఏండ్లనుంచీ జరుగుతూఉన్న ఈ బృహన్నిఘంటునిర్మాణము ఏఅవస్థలోఉన్నదీ' తెలుపునుకూడ.

౩. సూర్యరాయాంధ్రనిఘంటు విమర్శనఖండనము. శ్రీ జయంతి రామయ్యపంతులుగారు. ఇది పై శ్రీ చి. నా. రా. గారి వ్యాసమునకు ఖండనము. ప్రభవ, ఫాల్గునమాససంచిక, పు. ౩౬౫-౩౭౪.

౪. సూర్యరాయాంధ్ర నిఘంటువు - మచ్చుపదములు. శ్రీ చి. నా. గారు విభవ, వైశాఖ సంచిక, పు. ౪౯౭-౫౦౩. ఇది పై శ్రీ జ. రా. గారి ఖండనమును ఖండించునది.

ఈ విమర్శనలు ఖండనలు చురుకుపాలు ప్రాగించుటలు ప్రాగుటలు—వీనితోనే సరిపోయినవి.

§ ద్రావిడ నిఘంటువున వెలువడిన పుటలు ౨,౭౩౨. సరాసరి నూటరువదిపుటలుగల యొక్కొక్క భాగమునకు వెల రెండురూపాయలు. ఇప్పటికి వెలువడినభాగములు పదునేడు.

ఇట్లే జరుగుచుండిన నింక నెంతధనము (లక్ష సంఖ్యకు మిగులవచ్చును.) కావలసియుండునో! ఇంత సొమ్ము వ్యయమయినందుకు నిఘంటువుతోపాటు తన్నిర్మాణమునకయి పరిశోధించిన వాఙ్మయమును నెన్నియో విధముల నిర్దుష్టముగ ముద్రించి యాంధ్రలోకమున కర్పించియుండవచ్చును.

నిఘంటు వింకను వెలువడకుండుటకు కారణము అందు సమకూర్పనున్న విషయబాహుళ్య మనవచ్చును. ప్రచురించిన మచ్చుపదములనుబట్టి చూడ ద్రావిడ నిఘంటువు* కన్న నిం దెక్కువ విషయ సంగ్రహణము కావించినట్లు తోపదు. పరిమాణమునను దానిని మించ బోవదేమో!

ఇక సూర్యారాయాంధ్ర నిఘంటువునకు సూర్యదర్శన మిప్పటికి కామికి కారణ మూహాతీతముకాదు. ఒకతత్త్వదర్శి అన్నాడు: 'ఆంధ్రునకు మంత్రశక్తియు హెచ్చేకాని అరవకుగల ప్రయోగకౌశలము లేదు.' * * 'ఆంధ్రునకు తెలివియున్నది; గాని అరవకుగల శ్రద్ధ లేదు. ఆంధ్రునకు ప్రతిభ యున్నది, గాని అరవకు గల దీక్ష లేదు. ఆంధ్రునకు ఆసక్తి యున్నది; గాని అరవకుగల ఏకాగ్రత లేదు.' * * * 'ఆంధ్రున కలసభావ మధికము; నేటిపని రేపటికి నిలువ సేయును. అరవకు చురుకుపా లధికము; రేపటిపనిగూడ నేడే ప్రారంభించును' అని.

మహోదారులు, వాఙ్మయాభిమానులు నగు శ్రీ మహారాజావారు రొక్కమును లెక్కసేయక శ్రమము రించుచున్నారు కదా యని యిట్లు కాలయాపనమున కవకాశ మిచ్చుచుండు టుచితముకాజాలదు. కాలయాపన మయినను నిఘంటువు సర్వలక్షణసంపన్నముగా నవతరింపగలుగుటయు నసంభావ్యము. వాఙ్మయ మనంతము; తత్పరిశోధన మపరిచ్ఛిన్నము; తత్సంపూర్ణజ్ఞాన మెట్టి దొడ్డలకయిన నసాధ్యము. ఇక 'ఆలస్యా దమృతం విషమ్' అను సూక్తిని పాటించి తలపెట్టిన కార్యము యొక్క ఫలమును బొందుటకయి త్వరించుటయే వివేకము.

కావున నీతీరున మందగమనము గలిగియున్న నిఘంటు వికనయిన నిఖిలవ్యయభారమును వహించి యున్న శ్రీ పిఠాపురపు మహారాజావారియొక్కయు, సంపాదన కార్యభారమును వహించియున్న శ్రీజయంతి రామయ్య పంతులుగారియొక్కయు నామములు ఆంధ్ర వాఙ్మయ ముండునంతకాలము సువర్ణాంకితములయి వెలయునట్లు అచిరకాలమున వెలువడి, తమకును, తమ వాఙ్మయమునకును మహోపకారమును గావింపవలయు నని యాంధ్ర మహాజను లాశింపక యూరకుండజాలరు.

---

## కీ. శే. ప్రొఫెసరు పి. సుబ్రహ్మణ్యముగారు

(మరణము : ౨౭-౮-౧౯౩౨)




శ్రీ సుబ్రహ్మణ్యముగారు చెన్నపురము నాంధ్రులలో పేరున కెక్కినవారు. చిరకాలమునుండి వీరు

---

* ఇందు తత్సమ తద్భవాదిపదములు, దాని కర్థములు, ప్రమాణప్రయోగములు, ఆంగ్లాక్షరముల అజాది పదముల ఉచ్చారణము, ప్రతిపదమునకును గల వివిధార్థములకు ఆంగ్లమున నర్థము మున్నగునవి కలవు. కావున నది ద్రావిడభాషానభిజ్ఞులకును ఉపకరింపగలదు.

పచ్చయప్ప కళాశాలయం దాంగ్లాచార్యపదము నధిష్ఠించి మెప్పును గన్నవారు. అరటిపం డొలిచిపెట్టినటులు బోధింపగలవారు. విద్యార్థులను కన్న సంతానమువలె ప్రేమించి వారికి సౌకర్యములను సమకూర్చి కంటిని రెప్పవలె కాచి వారిలో నొకరుగ నుండు స్వభావము వీరిది. ఆంధ్రభాష, ఆంధ్రులు అన్న చెవికోసికొనువారు. చెన్నపురమునందలి యాంధ్రుల యౌన్నత్యమున కుపకరించు నెల్లకార్యములయందు వీరిచేయి కలిసియేయుండును. ఇట్టి విద్యావంతుడు, బోధనచతురుడు, వినయశీలుడు, దయాళువు, విద్యార్థికల్పవృక్షము నగు నీసత్పురుషుడు యశశ్శరీరమును మిగిల్చి పోయినాడు. వీరికయి వగచు పచ్చయప్పకళాశాలవారు, విద్యార్థులు, చెన్నపురపు నాంధ్రులు, సుబ్రహ్మణ్యముగారి కుటుంబముతోపాటు ఆశ్వాసమును చెందగుదురు.

---

## అల్పాయువు కొడాలి వెంకటసుబ్బారావు

జననము ౧౨-౧౨-౧౯౦౮. మరణము ౧౧-౮-౧౯౩౨.



అతర్కితోపనతము, అతిదారుణము వెంకటసుబ్బారావు మరణము. ఇరువదెనిమిదేడుల ప్రాయమున, పొంగారు యౌవనమున, సకలైహికభోగానుభవసమారంభవేళయందు హృదయమువలె స్నిగ్ధము, భావమువలె సున్నతము, బుద్ధివలె విగతజాడ్యము, ధైర్యమువలె సుదృఢము, ప్రకృతివలె మనోహరము నగు వెంకటసుబ్బారావుశరీరము, కటకటా, కట్టిడి మృత్యువువాత పడిపోయినది! సురభిళకుసుమ మొకటి సుడిగాలిలో నురిగిపోయినది!! సతికి పతివియోగము, తండ్రికి పుత్రవియోగము సంఘటిల్లినది. ఈవియోగము దుస్సహము, నిరవధికము. దైవ మెంతనిర్దయము! అథవా, జీవకోటికి స్వకర్మానురూపఫలానుభూతి యనతిక్రమణీయము.

వెంకటసుబ్బారావు భావకుడు, కవి, రసజ్ఞుడు. అతని కావ్యనిర్మాణ మాతని జీవితమువలె అల్పమాత్రము, ప్రశస్తము. అతనికావ్యములు మిక్కిలిగ వస్త్వాశ్రయములు. అతని నిశితమతి వస్తుతత్త్వగ్రహణనిపుణము. వస్తుతత్త్వజ్ఞానమున నుత్పన్నములయిన యతని భావము లుద్వేలములుగ పొంగి రమణీయకల్పనాబద్ధములయి కావ్యరూపమున పరిణతిని గాంచునవి. భావానురూపపదరచన గలిగి ధారావాహినియయి యొప్పు నతని కవితకు వర్ణితవస్తువు నెదుటబెట్టి పాఠకుని హృదయమును రసింపజేయు శక్తి కలదు. అది కేవలము శబ్దానుశాసనమునకు లొంగునదికాదు; లక్షణనియమములకు బానిస యగునదికాదు. భావవీథి నుద్దండముగ పరువిడుచు పాఠకుని వెనువెంట పరువులువారఁ జేయునది. ఈ యల్పాయువురచనములలో 'హంపీక్షేత్రము' ప్రశస్తము: అది గ్రంథరూపమును గాంచదగినది.

ప్రపంచము నెల్లవిషయముల నవ్యత నాశించుకాల మిది. భావకులగు నవకవులు కొందఱు కవితను నూతనమార్గముల నడిపించుచు నభినవరూపరమణీయను గావించుచున్నారు. ఆ కొందరిలోనివాడు సుబ్బారావు. అతనికావ్యములను 'భారతి' కైసేసికొనినది. ఇంకను కైసేయ మురియుచుండినది. ఇంతలో నిటు విపరీతముగ పరిణమించినది.

సుబ్బారావుభౌతికశరీరము నేడు ప్రణష్టమయినది; కావ్యశరీరము మిగిలినది. అది భావనాచైతన్య విలసితము, చిరంజీవము. ఆ రూపమున సుబ్బారావును సహృదయులు నిరంతరము దర్శించుచుండగలరు. పూవు నశించినను తావి నశింపదు.

---

# ఘన ప్రశంస

తిరుమల రంగాచార్యులు గారు

కలరు ఘను ల్నిజాశ్రితుల కాంక్షలమాత్రమె తీర్చువార లి
య్యిల నెప్పుడైనఁ జూడ నగునే? యితరు ల్తము వేఁడకున్న ని
శ్చలతను జీవనం బొసఁగు సాహసవంతులు? చెప్పవేను ని
ర్మల మతితోడ నోయిఘనమా! విను సార్థకనామముఁ డీవెపో!

ఇల నొకచోఁ దగం గురిసి యింకొకచో నటు చేయవంచు నాఁ
గల దొక నింద నీకు సరి గా దిది యోచన సేయఁగా మహా
బలునికిఁ జిక్కు సత్పథవిభాసురు లేమి యొనర్పనౌను సం
చలితులు గాక యుందురె? విచారము మాను వలాహకోత్తమా!

ఉపకృతి యందు రొక్కమొగి నుండినయర్థము లిచ్చినంతనే
తపమునఁ బొందఁజాలు నమృతమ్ము మహోన్నతమైనయట్టి వి
ష్ణుపదమునందు నిల్చి సహజోద్ధతి మాని యొసంగి తాప మె
ల్లపు డొకరీతిఁ బాపెడి వలాహకుఁడా, సరిలేరు నీ కిలన్!

కురిసెద వీవు వర్షమును గొండలపై జలరాశిపైన సు
స్థిరగతి న జ్ఞనోక్తిగల దేక్రియ నానుడి రిత్తయౌను? భూ
ధర వరరత్నధుల్ సుజనతాశ్రయయోగ్యులు గాన వారి భా
స్వరగుణసంయుతు ల్ఘనరసప్రదు లాశ్రయ మొందు టొప్పదే.

ధన మది యెంత యుండిన ననారతవైభవ మెంత యుండినన్
ఘనుఁడ! భవత్ప్రసన్నత యొకానొక యేఁటను మృగ్యమాయె సం
జను లధికార్తిఁ బొందుచును సారెకు సారెకుఁ గోరుదు ర్గదా
యనుపమమైన నీకరుణ నందగఁజేయఁ జరాచరేశ్వరున్.

---




పదుగురాడుమాట పాటియై ధర జెల్లు, నొక్క డాడుమాట యెక్క దెందు
ఊరకుండువాని నూరెల్ల నోపదు, విశ్వదాభిరామ వినుర వేమ.

వేదాంతవేది వేమన చెప్పిన హితోపదేశము దురభిమానపరాయణులకు మననయోగ్యముగ నున్నది. హిందూస్థానమునకు సర్వాధికారమంత్రియైన సర్ సామ్యుయలు హోరు గారిబుద్ధియందు హితోపదేశములకు స్థలము లేదని తెలిసినవిషయమే. కాని సర్ సామ్యుయలు హోరుగారి ప్రగల్భవాక్యములు మాత్రము వారికి హితమైనను ప్రపంచమును మోసగింపజాలవు. వారు హిందూస్థానమునకు జేసిన మహోపకారములందు నిర్బంధవిధాన విజయమును, ప్రభుత్వము చేసిన అప్పులవిజయమును, ఒటావాసమావేశఫలమును, సాంఘిక నియోజకనిర్ణయమును ప్రశంసించుటయందు వారికి సహజమైన నిరంకుశాధికారాభిమానము వెల్లడియగుచున్నది. నిర్బంధశాసనపరిపాలనము నన్నిపక్షములవారును నిరసించుచున్నపుడు దానిని ప్రశంసించుట నిరుపయోగము.

హిందూస్థానము నిటీవలనే సందర్శించి దేశపరిస్థితులను స్వయముగను గనుగొనిన లోథియనుప్రభువుగారి యభిప్రాయములనైనను విశ్వసించుట హోరుగారికి కర్తవ్యము. లోథియనుప్రభువు జాతీయ ప్రభుత్వమునందు బాధ్యతగల సహాయమంత్రి. వారిపర్యటనమునందును, సంప్రతింపులందును ప్రజాభిప్రాయమును దేశపరిస్థితులను కొంతవరకైనను గ్రహించుట కవకాశములను గలిగియుండిన లోథియనుప్రభువుగారి సలహాను సయితము పెడచెవిని బెట్టుట హోరుగారికి నిర్బంధవిధానమునందుగల విశ్వాసమును విశదముచేయుచున్నది. ప్రశాంతస్వభావముగల పండిత మదనమోహన మాలవ్యగారు దేశమునందిట్టి అశాంతియెన్నడును గలుగలేదనియును, ఏ పక్షమువారికిని విశ్వాసము లేదనియును ఇటీవలనే కలకత్తాయందు కంఠోక్తిగను దెలిపియుండిరి. ఇంగ్లాండునుండి హిందూస్థానపరిస్థితులను బరిశీలింప వచ్చిన ఇండియాసమితిప్రతినిధులును కన్సర్వేటివు సభ్యుడు హేలుగారు మొదలగు నాంగ్లప్రముఖులును లోథియనుప్రభువు తెలిపిన సద్భావములనే వెల్లడిచేసిరి. నిర్బంధవిధాన ప్రయోజనమును విశదముచేయునవి ప్రజాహృదయములు గాని కల్లుపాటలు, విదేశవస్తువుల దిగుమతులును గావు.

నిస్సహాయస్థితియం దున్న ప్రజలు ధర్మ విరుద్ధమైన కార్యములను జేయుటయందు విచిత్రము గనుపడదు. మహానిర్బంధప్రస్థాన మారంభమై ఎనిమిదిమాసములు గతించి నను ప్రజాశక్తి విజృంభించుచున్న విధ మును దేశవ్యవహారములు విశదము చేయు చున్నవి. లాఠీప్రయోగములు, నిర్బంధములు జరిమానాలు, జప్తులు, రహస్యదండన నిర్బం ధములు ప్రజాశక్తిని వృద్ధిచేయుచున్న విధ మును వివిధప్రాంతములందును జరుగుచున్న సత్యాగ్రహ వ్యవహారములు రుజువుచేయు చున్నవి. నిర్బంధవిధానము శాంతి స్థాపనము నకు బదులు అశాంతిని వృద్ధిచేయుట ప్రకృతి ధర్మము. ప్రపంచమంతయును శాంతికై పరిత పించుచున్న సమయమునందు శాంతి దూతను నిర్బంధించుటయును, నిర్బంధవిధాన వ్యాపన మును సర్వారిష్టములకును సాధన భూత ముగా గలదు. ప్రపంచేతిహాసములం దెచ్చ టను నెప్పుడును విజయమును బడయని నిర్బంధ విధానము హిందూదేశమునందు విజయమును బడయజాలదు.

*　　*　　*　　*

అప్పులవిజయము

ప్రభుత్వము చేసిన యప్పుల విజయము దేశశాంతికిని ప్రజావిశ్వాసమునకును నిదర్శ నము గాజాలదు. బ్యాంకులు, వ్యాపారము విదేశీయుల వశమునం దున్నపుడు ప్రాత గవర్నమెంటు పత్రములను క్రొత్తపత్రములను మార్చుట కవకాశ మున్నప్పుడు అప్పును వ్రా రించుట ప్రజల నిస్సహాయస్థితికి నిదర్శనము కానివిశ్వాసప్రత్యయములకు నిదర్శనముగాదు. దీనివలన శ్రీమంతులు, విదేశీయులు లాభ మును బొందినను ప్రజల కెట్టి లాభమును నుం డదు. హిందూస్థానమునుండి విదేశములకు గతించిన పదిమాసములందును నెగుమతియైన ౯౦ కోట్ల రూప్యముల బంగారమును హిందూ దేశము నాపరించిన దురవస్థను విశదము చేయుచున్నది. గతించిన కతిపయమాసము లందును హిందూస్థానమునుండి సహజమైన పదార్థముల యెగుమతి ౩౦ కోట్ల రూప్య ములవి తగ్గుటయును, ౯౦ కోట్ల రూప్యముల బంగార మెగుమతి యగుటయును హోరుగా రికి సంతృప్తిని కలుగజేసినను దేశక్షేమ పరా యణుల కెవరికిని సంతృప్తిని గలుగజేయ జాలదు. ప్రపంచమంతయును నొకమార్గము నను హిందూస్థాన మొకమార్గమును నడు చుట విపరీతమైన యార్థికనీతియనియును సహ జమైన యార్థికనీతి కాదనియును బాలిశులు నయితము గ్రహింపగలరు. ఒటావా సమావేశ మున నాటిన విషబీజములఫలమును కాలము పరిపక్వము చేయగలదు.

*　　*　　*　　*

సాంఘికసమస్యానిర్ణయము

ఈనిర్ణయము బ్రిటిషు ప్రభుత్వమునకు హిందూస్థానస్వాతంత్ర్యముపట్ల గల నిజాభి ప్రాయమును లోకమునకంతకును విదితముచేసి నది. హోరుగారే బ్రిటీషుప్రభుత్వసద్భావ మునకు నీనిర్ణయమును ప్రమాణముగ నుదాహ

రించిరి. బ్రిటీషుప్రభుత్వమునకు పరమార్థము జాతీయబాధ్యతాయుత ప్రజాస్వామికపాలన స్థానము. ప్రభుత్వము ప్రకటించిన సాంఘిక నిర్ణయ మీపరమార్థమును నూరేండ్లకైనను సాధ్యపడనీయదు. హిందూస్థానమునందు రెండువంతులు ప్రజలైన హిందువులకు నియోజకవర్గమునందు నామరూపములు పోయినవి. సామాన్యనియోజకవర్గమునం దెవరు గలరో యది పరమరహస్యము. హోరుగారికిని, వారి యాంతరంగికులకును మాత్రము విదితము. హిందూస్థానమును జాతిమతలింగశాఖావృత్తి స్థితి భేదములతోను తుత్తునియలుచేయుటయం దీనిర్ణయము భయంకరరూపమును దాల్చుట సహజము. హిందూమహమ్మదీయ సిక్కు-భేదములను, యూరోపియను ఆంగ్లో-ఇండియను క్రైస్తవభేదములను, స్త్రీపురుషాదిభేదములను కల్పించి హిందూస్థానమును చీలికలు చేసిన హోరుగారి రాజ్యనీతి ప్రశస్తమైనను వారిసద్భావములు మాత్రము ప్రశంసాపాత్రములు గావు. ఈప్రక్కనుగల వివిధరాష్ట్రము లందలి స్థానముల పట్టిని పరిశీలించినవారలకు నిజము విశదమగుచున్నది.

మదరాసు శాసనసభకు నిర్ణయించిన ౨౧౫ స్థానములందును సామాన్యస్థానములు ౧౩౪ ను ప్రత్యేకస్థానములు ౮ యు కలవు. ప్రత్యేకస్థానములందు ప్రత్యక్షముగనో పరోక్షముగనో యూరపియనులకు ౨, స్త్రీలకు ౮, నిమ్నజాతులకు ౧౦, కార్మికులకు ౬ స్థానములు గలవు. మహమ్మదీయక్రైస్తవ స్త్రీలకు స్థానములను ప్రత్యేకించినపుడు యూరపియను ఆంగ్ల ఇండియను స్త్రీల కేల ప్రత్యేకింపలేదో తెలియకున్నది. స్త్రీలు ప్రత్యేకస్థానములను నిరసించుచు తీర్మానములను జేసిరి. అయినను వారిని సామాన్యస్థానములనుండియును, స్వీయసంఘస్థానములనుండియును విడదీయుట దేశమునకును, సంఘమునకును ప్రయోజనకరము గాదు. మద్రాసు గవర్నరుగారు పక్షములు సిద్ధాంతముల ననుసరించి ఏర్పడవలయుననియును, సంఘముల ననుసరించి ఏర్పడజనదనియును చేసిన హితోపదేశమునకును, సాంఘికనిర్ణయములకును గల సంబంధమును దేశక్షేమ పరాయణులు గ్రహింపగలరు.

వంగరాష్ట్రమున కేర్పడిన ౨౫౦ స్థానములందును సామాన్యస్థానములు ౮౦ మాత్రము గలవు. మహమ్మదీయులకు ౧౧౯, యూరపియనులకు ౨౫, నిమ్నజాతులకు ౧౦ స్థానములును కలవు. ఈమూడు సంఘములును కలిసి ౨౫౦ స్థానములందును ౧౪౪ స్థానములను గలిగి యున్నపుడు వీరి శాశ్వత బలమును భేదించుట కెట్టి యవకాశములును గలుగజాలవు. సామాన్యపక్ష మేర్పడుట కేవిధమైన యవకాశములును గలుగజాలవు. ఈ విధముననే వివిధరాష్ట్రములను చీలిక చీలికలుగను జేసిన సాంఘికనిర్ణయమునందలి సద్భావములు సర్ సామ్యుయల్ హోరుగారు గ్రహించినను హిందూస్థానము యొక్క క్షేమ పరాయణు లెవ్వరును గ్రహింపజాలకున్నారు. బ్రిటీషు

| రాష్ట్రీయశాసన సభలు | మదరాసు | బొంబాయి సింధు | బెంగాలు | సంయుక్త రాష్ట్రములు | పంజాబు | బీహారు-ఒరిస్సా | మధ్యరాష్ట్రములు-బేరారు | ఆసాము | సరిహద్దు రాష్ట్రము | సింధు | సింధువినా బొంబాయి |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| మొత్తము స్థానములు | 215 | 200 | 250 | 228 | 175 | 175 | 112 | 108 | 50 | 60 | 175 |
| సామాన్యస్థానములు | 134 (పు 128- స్త్రీ 6) | 97 (పు 92- స్త్రీ 5) | 80 (పు 78- స్త్రీ 2) | 132 (పు 128- స్త్రీ 4) | 43 (పు 42- స్త్రీ 1) | 99 (పు 96- స్త్రీ 3) | 77 (పు 74- స్త్రీ 3) | 44 (పు 43- స్త్రీ 1) | 9 | 19 (పు 18- స్త్రీ 1) | 109 (పు 104- స్త్రీ 5) |
| నిమ్నజాతులకు | 18 | 10 | — | 12 | — | 7 | 10 | 4 | — | — | 10 |
| వెనుకబడియున్న ప్రదేశములకు | 1 | 1 | — | — | — | 8 | 1 | 9 | — | — | 1 |
| మహమ్మదీయులకు | 29 (పు 28- స్త్రీ 1) | 63 (పు 62- స్త్రీ 1) | 119 (పు 117- స్త్రీ 2) | 66 (పు 64- స్త్రీ 2) | 86 (పు 84- స్త్రీ 2) | 42 (పు 41- స్త్రీ 1) | 14 | 34 | 36 | 34 (పు 33- స్త్రీ 1) | 30 (పు 29- స్త్రీ 1) |
| దేశీయక్రైస్తవులకు | 9 (పు 8- స్త్రీ 1) | 3 | 2 | 2 | 2 | 2 | — | 1 | — | — | 3 |
| ఆంగ్లోఇండియనులకు | 2 | 2 | 4 (పు 3- స్త్రీ 1) | 1 | 1 | 1 | 1 | — | — | — | 2 |
| యూరోపియనులకు | 3 | 4 | 11 | 2 | 1 | 2 | 1 | 1 | — | 2 | 3 |
| వాణిజ్యము, పరిశ్రమలు, గనులు, తోటలకు | 6 | 8 | 19 | 3 | 1 | 4 | 2 | 11 | — | 2 | 7 |
| భూస్వాములకు | 6 | 3 | 5 | 6 | 5 | 5 | 3 | — | 2 | 2 | 2 |
| విశ్వవిద్యాలయములకు | 1 | 1 | 2 | 1 | 1 | 1 | 1 | — | — | — | 1 |
| కార్మికులకు | 6 | 8 | 8 | 3 | 3 | 4 | 2 | 4 | — | 1 | 7 |
| సిక్కులకు | — | — | — | — | 32 (పు 31- స్త్రీ 1) | — | — | — | 3 | — | — |

జాతీయ ప్రభుత్వము నిర్ణయించిన సాంఘిక నిర్ణయమును స్వార్థపరాయణులకు సంతృప్తి కరమైనను సామాన్యముగను సకలసంఘముల యొక్కయు నిరసనమును బడయుచున్నది. స్వార్థ పరాయణులయొక్కయును పూర్ణామోదమును బడయజాలకున్నది. బ్రిటీషు ప్రభుత్వముచేసిన సాంఘికనిర్ణయమునకు బాధ్యులు హిందూ దేశీయులని యంగీకరింపవలయును. ఈ విషమసమస్యకు బీజములు ప్రభుత్వవిధానమునందే కలవని రాజ్యాంగానుభవము విశదముచేసినది. హిందూస్థానమునందు జాతీయ ప్రజాస్వపరిపాలనమును స్థాపించుట బ్రిటీషు పరిపాలనమునకు ప్రయోజనమని బ్రిటీషు రాజనీతిజ్ఞులు సమయాసమయములు లేకను ప్రకటించుచుందురు. ఆప్రయోజనము నీసాంఘికనిర్ణయ మెంతవరకు సమకూర్చునో బ్రిటీషు ప్రభుత్వమును ప్రజలును యోచించుట ధర్మము. స్వరాజ్యమును గోరెడి హిందూ దేశీయులు స్వరాజ్యసిద్ధికి వారిశక్తిమీద నాధారపడుట ధర్మముగాని పరులమీద నాధారపడుట ధర్మముగాదు. భారతజాతీయమహాసభ ౪౭ ఏండ్లు నిర్వహించిన మహాకార్యమును సాంఘికనిర్ణయమును నిరంకుశశాసన పరిపాలనమును నిర్మూలముచేయ సమకట్టినను, భారతీయచైతన్యము చిరకాలసంవర్ధితంబైన భారత జాతీయశక్తిని అధర్మ సంకల్పము నాశనము చేయజాలదు.

* * * *

హిందువుల కర్తవ్యము

సాంఘిక ప్రాతినిధ్యనిర్ణయమునం దధిక సంఖ్యాకులైన హిందువుల పేరైనను గనుపడదు. ఇందులకు గారణము నిరంకుశాధికారుల యాగ్రహమై యుండనోపును. వారి ఆగ్రహ మెటులున్నను నిర్ణయము వారి సంస్కారమున కనురూపమైనఫలమును సమకూర్చినది. అధిక సంఖ్యాకులైన హిందువు లితరసంఘములకు వారికోరికల కనురూపముగను స్థానముల నంగీకరించి దేశక్షేమమునకును, స్వాతంత్ర్యమునకును వారి శక్తిసామర్థ్యములను వినియోగించుట పుణ్యమును పురుషార్థమును గాగలదు. క్షీణించుచున్న దేశము శుభప్రదముగ నున్నపుడు వివిధసంఘములును వర్ధిల్లుట కవకాశము లేర్పడగలవు. దేశక్షేమమే దుర్లభమైనపుడే సంఘమునకును క్షేమము గలుగజాలదు. బ్రిటిషుప్రభుత్వమునకు గల సద్భావములను సాంఘికనిర్ణయమువలె రాజ్యాంగ నిర్ణయములును తెలుపగలవు. రాజప్రతినిధి సోమవారమునాడు శాసనసభయందు జేసిన ప్రసంగము ఫలమును ద్యోతకము చేయుచున్నది.

* * * *

రాజప్రతినిధి ప్రసంగము

కాంగ్రెసుపక్షము నడచివేయుటకు ప్రభుత్వ మవలంబించుచున్న నిరంకుశప్రస్థానము సఫలమైనను కాకపోయినను రాజ్యాంగ తంత్రమునునడపుటకైనను హిందూస్థానప్రజలు

గావలసియుందురు. మితవాదులైనను వారు రాజ్యాంగములందు ప్రమేయమును గల్పించుకొనుటకు గావలసిన నిర్ణయములను వెల్లడిచేసిరి. మూడవ రౌండుటేబిలుసమావేశమును జరుపవలయును. ఆ సమావేశమునందు భారతీయప్రతినిధులకును బ్రిటీషుప్రతినిధులకును సమానప్రతిపత్తి యుండవలయును. ఈ సంప్రతింపులఫలము శాసనరూపమును దాల్చవలయును. కుడుపబోయెడికూడు విషయమై రుచి యడుగవలసిన యవసర ముండదు. అనతికాలములోనే తేలనున్న విషయముల విషయమై వితర్కము లనవసరము. కాని రాజప్రతినిధిచేసిన ప్రసంగ మెప్పటివలెనే సందిగ్ధముగ నున్నది.

బ్రిటీషుప్రభుత్వము, బ్రిటిషుపార్లమెంటు, బ్రిటీషుప్రజలు భారతీయులకు రాజ్యాంగసంస్కరణము లనుగ్రహింపదలచుట నిజమే. సంస్కరణశాసనమునందు అఖిలభారత సంయుక్తపరిపాలనము, కేంద్రప్రభుత్వమునందు వీలైనంత బాధ్యతయును, రాష్ట్రీయస్వపరిపాలనము పేర్కొనబడుటయును యథార్థము. కాని క్రియారూపమున నీశాసనము స్వాతంత్ర్యమును ప్రసాదించుటయే నిర్ణయము గావలసిన విషయము. రాజప్రతినిధిగారి ప్రసంగమునందును ఇండియామంత్రిగారి ప్రసంగములందును నీవిషయమును తెలుపుటకు సూచనలు కనుపడవు. వారేమి నిర్ణయించునదియును నవంబరుమాసము తెలుపగలదు. కాని హోరుగారిప్రసంగము లీవిషయము నసందిగ్ధముగ వ్యక్తముచేయుచున్నది.

భారతీయ రాజ్యాంగములను నిర్ణయించుట కధికారము పార్లమెంటునకుగలదు కాని అనుభవింపవలసిన భారతీయులకు లేదు. పార్లమెంటు నిర్ణయించిన విధానమును భారతీయులు హర్షధ్వానములతో నాచరణమునందు పెట్టవలయును. రాజ్యాంగ సంస్కరణముల ప్రయోగమును సుకరముచేయుటకు స్వాతంత్ర్యనిరోధకశాసనములు సహాయము చేయగలవు. నిర్బంధశాసనముల సారమును శాసనరూపమున ప్రభుత్వము స్థిరముచేయుటకు సంకల్పించినది. ప్రభుత్వసంకల్పము నరికట్టుటకెవ్వరికిని శక్తిలేకపోయినను నిత్యమైన ధర్మమునకుమాత్ర మట్టి శక్తిగలదు. బ్రిటీషు ప్రభుత్వము విల్లింగ్డనుప్రభుత్వముద్వారా హిందూస్థానమునందు నిజమైన బాధ్యతాయుత స్వపరిపాలనమును స్థాపించినపుడు కాంగ్రెసుప్రయోజనమె య[illegible]రించినను విచారము గలుగదు. కాంగ్రెసు హిందూదేశమునకు స్వపరిపాలనమును సాధించుటకు సాధనముగ నేర్పడినది కాని పరిపాలించుట కేర్పడలేదు. విల్లింగ్డను ప్రభువుగారు స్వయముగ నీసంకల్పమును సఫలము చేసినపుడు కాంగ్రెసునకు పూర్ణవిజయము గలిగినదని యెంచనగును. కాని నిరర్థకములైన సంస్కరణప్రణాళిక నేర్పాటుచేసి కాంగ్రెసును నిర్బంధించినంతమాత్రాన ప్రజాహృదయమునందు సంతృప్తియును దేశమునందు శాంతియును గలుగజాలవు. స్వారాజ్య

వేదనతో నారంభమైన స్వరాజ్యసత్యాగ్రహోద్యమము స్వరాజ్యముతో గాని యంతరింపజాలదు. రాజ్యతంత్రప్రవీణులు ఇరువదవ శతాబ్దమునందు మాటలతో ప్రజలను సంతృప్తులనుజేయ దలపెట్టుట కేవలము నిరర్థక ప్రయత్నమని గ్రహించుట వివేకము.

* * * *

రౌండుటేబిలుసమావేశము

మూడవ రౌండుటేబిలు సమావేశము నవంబరుమాస మధ్యభాగమునందు లండను నగరమునందు గూడుననియును, కొందరు భారతీయప్రముఖులును, సంస్థానాధీశులును నాహ్వానింపబడుదురనియును, విషయ విమర్శనము గోప్యముగ చేయబడు ననియును రాజప్రతినిధిగారు తెలిపియుండిరి. గాంధిమహాత్ముడు, పండిత మాలవ్యా, సరోజినిదేవిగారులును నాహ్వానింపబడుదురనియును వార్తలు తెలుపుచున్నవి. కాంగ్రెసును నిర్మూలము చేయుటకు యావచ్ఛక్తిని వినియోగించుచు కాంగ్రెసునకు ప్రధానప్రతినిధియైన గాంధిమహాత్ముని నాహ్వానించుట విచిత్రమైన రాజ్యనీతిగ నుండును. దురభిమానము విఘ్నములకు సాధనమైనటులు కార్యసిద్ధికి సాధనము గాజాలదు. రెండవసమావేశమునకు పూర్వమువలెనే వర్తమానసమయమునందును సందిగ్ధస్థితి ఏర్పడినది. కాంగ్రెసువాదులు నిర్బంధముల ననుభవించుచున్నపుడు గాంధిమహాత్ముడు రౌండుటేబిలుసమావేశమునకు వెడలజాలడు. ఒకవేళ వెళ్లినను నిసుమంతయైనను ప్రయోజనము గలుగదు. గతసంవత్సరమునందు ఇర్విను ప్రభు వవలంబించిన మార్గమునే ఈయేడు విల్లింగ్డను ప్రభువును నవలంబించుట శ్రేయస్కరము. కాని కన్సర్వేటివుపక్ష రక్షితమైన, బలవత్తరమైన జాతీయప్రభుత్వమున కిట్టి వివేకము గలుగుటకు బలవత్తరమైన భగవదనుగ్రహము శరణ్యముగాని మానవప్రయత్నములు నిరర్థకములు.

blished by C. Seshagiri Rao, B.A., at the Andhra Patrika Press, No.7, Thambu Chetty St., Madras
Editor: G. Subbaramayya.

# భారతి

## సచిత్ర మాసపత్రిక

అధిపతి

కా. నాగేశ్వరరావు

సంపాదకుడు

గన్నవరపు సుబ్బరామయ్య

సంపుటము ౯. సంచిక ౧౦.

ఆంధ్రపత్రికా ముద్రాలయము, మద్రాసు.

౧౯౩౨

## నవరాత్ర పూజ



# వి ష య సూ చి క

## చిత్రములు



---

ప్రపంచము ప్రకృతిమయము. ప్రకృతివిలాసము ప్రపంచవిలాసము. ప్రకృతివినా ప్రపంచము లేదు. ఈ ప్రకృతియందు స్త్రీత్వ మారోపితమయినది. అపుడు ప్రకృతి ఆదిశక్తి అయినది. అనంతరము స్త్రీరూపము కల్పితమయినది.౧ అంత నాదిశక్తికి ఆదిదేవి, మహాదేవి మొదలగు పేరులు గలిగినవి. క్రమముగా నాయాదిశక్తికి పెక్కురూపములు, పేరులు ఏరుపడినవి.౨ కీడు తొలగి మేలు కలుగుటకును, కోరికలు సమకూరుటకును జనసామాన్య మీకల్పితరూపముల నారాధింప దొడగెను.౩ ఆ యారాధనము తొలుత నమానుషము, నతిబీభత్సము నయి మానవుని కేవలపశుస్వభావమునకు నిదర్శనమయ్యెను. రానురాను సంస్కారము కారణముగా మానవుని హృదయమునుండి పశుస్వభావము తొలగిపోవుచు రాగా ఆరాధనమునను మార్పు గలుగజొచ్చినది.౪ కాని ఆయమానుష విధాన మింకను పూర్తిగా రూపుమాయకున్నది.

అంబిక, హైమవతి, ఉమ, కాత్యాయని, సతి, దుర్గ, భద్రకాళి, కాళి, కాళరాత్రి, చండి మొదలయిన పేరులతో వెలయుచున్న సౌమ్యాసౌమ్యదేవీమూర్తులాయాద్యశక్తియనంతరూపములలో కొన్ని.౫ వీనిలో 'అంబికా' నామము శ్రుతులయందు ప్రస్తావింప బడినది. అంబికయే రుద్రునకు భగినిగా పేర్కొనబడినది౬. ఉమా హైమవతీ దుర్గాదినామములు, వానికి సంబంధించిన గాథలు నుపనిషత్తులయందు గలవు. ప్రపంచమునందలి చరాచరవస్తుజాలమున నిండియున్న సకలశక్తులు నీయాదిశక్తియంశములే యనియు, ఈశక్తియే బ్రహ్మవిద్య యనియు, ఈమెయే పరమాత్మయనియు, త్రిమూర్తిస్వరూపిణి యనియు, ౭సరస్వతీ లక్ష్మీ పార్వతీ నామముల త్రిమూర్తులకు భార్యలయినముగ్గురు త్రిధావిభక్తయగు నీశక్తియే యనియు నవి తెలుపుచున్నవి. తక్కినదేవీనామముల కన్నింటికి ననురూపములగు గాథలు పురాణాదులయందు గలవు.

తొలుత ఆదిశక్తి మహిషాసురుని సంహరించుట కవతరించినది. మున్నొకమారు దేవతలకు, రాక్షసులకు యుద్ధము జరిగినది. అందు రాక్షసుల కపజయము కలిగినది. రాక్షసమాతయగు దితి తన కుమారుల యోటమికి వగచి యతికుపితయయి దేవతలనునిర్జింపగల సుతు నొక్కని బడయగోరి మహిషీ(గేదె) రూపమును దాల్చి బ్రహ్మదేవుని గూర్చి తీవ్రముగ తపము చేసినది. బ్రహ్మదేవు డామెకు దర్శన మొసగి యామె కోరిన వరము

---

౧. తొలుత ప్రకృతి శక్తిగా మారుటకు స్త్రీ సాధనమయినది. తరువాత స్త్రీయే శక్తిగా మారిపోయినది. కావుననే శాక్తేయులు పెక్కుశక్తులకు మారుగా స్త్రీని పూజింతురు.

౨. ఈదేవీభేదముల విచిత్రచరిత్రములు కల్పితములయి పురాణాదులయందు వివిధవిధముల వర్ణితము లయినవి. అవి యొకదాని నొకటి పోలియుండవు.

౩. ఈ యారాధనవిధానములే ఆగమములు, కల్పములు నని బరగినవి. ఇందునను వైవిధ్యము గలదు. కాలదేశములు, తత్త్వదర్శికాని మనుజునియొక్క మనఃపరిణామాదికములు నిందుకు కారణములు కావలయును.

౪. ఆరాధనము సాత్త్వికము, రాజసము, తామసము నని మూడువిధము లయినది. ఇందు తామసవిధానము అమానుషము. అది యింకను కొన్నిచోట్ల జరుగుచున్నది.

౫. గ్రామదేవత లనబడు శక్తులుగూడ నీ ఆద్యశక్తియొక్క క్షుద్రరూపములు. జాతర లనుపేర నేటేట జరుగు నీగ్రామశక్తుల యుత్సవములయందు లెక్కలేని జీవజంతువులు 'బలి' యను నెపమున చంపబడుచున్నవి.

౬. "ఏష తే రుద్ర భాగః; సహ స్వస్రాంబికయా తం జుషస్వ."—తైత్తిరీయసంహిత.

౭. సరస్వతి=బ్రాహ్మీశక్తి; లక్ష్మి=వైష్ణవీశక్తి; పార్వతి=శాంభవీ శక్తి. ఇట్లు తమతమ శక్తులను త్రిమూర్తులు తామే సృష్టించగలరు.

౮. ఈ మహిషాసురుని యుత్పత్తిని గురించిన గాథ లనేకవిధములుగా పురాణములయందు కనుపించుచున్నవి.

నిచ్చెను. ఆమె కంత మహిషాసురుడు౧ జనియించెను. వాడు పరమశూరుడు, అతిమాయావి యై పెరిగి పెద్ద యయ్యెను. వాడును పరమశివుని గూర్చి యుగ్రమగు తపస్సు చేసి తనకు పురుషులచే చావు లేకుండ వరమును బడసెను. అంత వాడు వరగర్వితుడై ఇంద్రుని నిర్జించి స్వర్గాధిపత్యమును బడసెను; దిక్పాలకుల నెల్ల జయించి తరిమివైచెను; ఋషులను బాధించెను. ఇట్లెల్ల లోకకంటకుడయిన మహిషాసురుని బారి కోరువజాలక యింద్రాదిదేవతలు బ్రహ్మదేవుని శరణుచొచ్చిరి. బ్రహ్మయు నాయసురుని మట్టుపెట్టు నుపాయము నాలోచించుటకయి, శివునికూడ దోడ్కొని, దేవతలందరు వెంటరా విష్ణుదేవునికడకు బోయెను. విష్ణువు వారందరిరాకకును కారణమును దెలిసికొనెను. అపుడందరు కలిసి యాలోచించుచుండ వారందరి యంగములనుండి తేజోరూపమున వారియంశములు వెలువడెను. ఆ తేజఃపుంజమంతయు మహోజ్జ్వలరూపిణియు, సుందరాకారయు దివ్యాభరణభూషితయు, అష్టాదశ భుజయు౨నగు నొక యువతి రూపమును ధరియించెను. ఆయువతి మహాదేవీనామమున ప్రసిద్ధి కెక్కెను. ఆమెకు బ్రహ్మాదిదేవతలెల్లరు తమతమయాయుధముల నొసగిరి. సింహము వాహనమయ్యెను.3 దేవతలు ఆమెను మహిషాసురునిజంప నియోగించిరి.

ఇట్లవతరించినదేవి తన్ను చంపి రక్తమును పానము చేయుచుండినట్లు మహిషాసురు డొకనాటిరాత్రి కలగనెను. వాడు మరునాడు మొదలుకొని దేవిని భక్తితో నుపాసించుచుండెను. కొంతకాలమున కామె వానికి (భద్రకాళీరూపమున) ప్రత్యక్షమయ్యెను. ఆమెకు వాడు తనస్వప్నవృత్తాంతమును విన్నవించెను. 'దేవీ, నీచేత నెట్లును నాకు చావు తప్పదు. నేనందు కించుకయు వగపుగొనను. నాతండ్రి శంభుదేవు నారాధించుటవలన నేను జన్మించితిని; ఎల్లలోకములను జయించితిని; ఇంద్రపథమును గాంచితిని; సకలభోగముల ననుభవించితిని. నిరంతరము నీపాదముల నాశ్రయించియుండుటతప్ప నాకు నీక నేకోరికయు లేదు. దాని ననుగ్రహింప వేడుచున్నాను' అనెను. 'ఓంబూ, నీవు నాచే మృతుడ వయ్యెదవు. నేను నిన్ను చంపుటకు మూడుమారులుమూడుమూర్తులను౪ దాల్పవలెను. నీవు మృతుడ వయ్యును నీశరీరము నాపాదము నంటియే యుండును.౫ నాకు కావింపబడు పూజ నీకును

౧. మఱియొక గాథ వీనిజననమునుగూర్చి—యిచట అనుసంధించుకొనదగినది — ఇట్లు కలదు: రంభుడను రాక్షసు డొకడు, అపుత్రకుడు శంభుదేవు నారాధించెను. వాని యారాధనమునకు మెచ్చి శివుడు ప్రత్యక్షమయి వానిని 'వరము వేడుకొ'మ్మనెను. 'నీవే నాకు పుత్త్రుడవయి పుట్టవలెను' అని వాడు కోరెను. మహాదేవు డందు కంగీకరించెను. అంత రంభాసురుడు తన యింటికి మరలి వచ్చుచుండెను. త్రోవలో ఋతుమతియైన మహిషి యొకటి వానికి గానుపించెను. వాడు కామోద్రేకమున దానితో గలసెను. అది గర్భవతియయి మహిషాసురుని గనెను. ఈమహిషియే మహిషీరూపమును దాల్చిన దితి కావచ్చును. కాని యామె యిట్లు మహిషీరూపమును దాల్చుటకు కారణము కానరాదు.

౨. ఈభుజములసంఖ్య నాలుగు, ఎనిమిది, పది, పదునారు, వేయి అని యిట్లు పెక్కుతెరగులుగా పురాణములయందు కానవచ్చుచున్నది.

3. ఈసింహమును హిమవంతు డొసగెనని కొండొకచో గలదు.

౪. ఈమూడుమూర్తులు ఉగ్రచండ, భద్రకాళి, దుర్గ అను పేరులు గలవి. ఈమూర్తుల పూజతోపాటు మహిషాసురునికి పూజ జరుగునని యొకట గలదు.

౫. దేవీవిగ్రహములయందు మహిషాసురుని శరీరమును వామపాదాంగుష్ఠమున దేవి నొక్కియుండుట కాననగును. ఇట్లుండుటకు మఱియొక కారణమును చెప్పబడినది. దేవి ఖండించిన మహిషాసురుని శిరము నేలపయి బడినతోడనే వాని కళేబరమునుండి క్రూరుడగు రాక్షసు డొకడు పుట్టుచుండెను. అది కని దేవి మహిషుని కళేబరమునుండి రాక్షసుడు సంపూర్ణముగ వెలువడకుండ వానిభుజముపయి తన ఎడమకాలి బొటనవ్రేలుంచి నొక్కి పట్టినది.

జెందును' అని సెలవిచ్చెను. తరువాత నామె మూడు మూర్తులు దాలిచి వానిని రూపుమాపెను[1]. ఇట్లు మహిషాసురుని వధియించి మహాదేవి (ఆదిశక్తి) 'మహిషాసురమర్దని' యయ్యెను.[2]

పూర్వము రురునికొడుకు దుర్గుడను అసురుడొకడుండెను. వాడు కడుమాయాశీలుడు; తపోబలమున మూడు లోకములను జయించెను; స్వర్గరాజ్యము నాక్రమించెను; దేవతల నందరిని మిగుల పీడించెను. దేవతలు భీతులయి శివుని మరుగుచొచ్చిరి. శివుడు దుర్గుని సంహరింప మహాదేవిని (శాంభవీశక్తి) నియోగించెను. ఆమె దేవతల కభయ మిచ్చి దుర్గుని బట్టి తెమ్మని కాళరాత్రిని[3] బంపెను. కాళరాత్రి యట్లు చేయబోయెను. వాడామెను కని తత్సౌందర్యమునకు ముగ్ధుడై యంతఃపురమునకు గొనిరండని తనయనుచరులను బంపెను. హుంకారాగ్నిచే కాళరాత్రి వారిని భస్మమొనరించెను. మరల గొందరు రాగా వారిని తననిశ్వాసవాయువుచే చెల్లచెదరుచేసెను. దుర్గుడంత తానే బయలుదేరెను. అది కని కాళరాత్రి వింధ్యాద్రినున్న మహాదేవియొద్దకు పోయి దుర్గాసురుని ఆగమనవార్తను తెలిపెను. దుర్గుడును తన సేనలతో కాళరాత్రిని వెంబడించిచని వింధ్యమును జేరి యచట మహాదేవిని జూచి యామె భువనమోహనసౌందర్యమునకు మోహితుడయి ఆమెను తనకు భార్యగా గోరెను. దేవివాని పయి క్రూరదృష్టిని బరపి తర్జించెను. వాడామెను బంధించి తీసికొనిరండని భటులను బంపెను. తన్ను పట్టవచ్చినవారినెల్ల మహాదేవి తనచెంతకు చేరనీయకుండెను. దుర్గుడు స్వయముగ నామెతో యుద్ధమునకు దలపడెను. అపు డామె శరీరమునుండి అనేకశక్తు[4]లుదయించి దుర్గుని సేనలను చక్కాడిరి. దుర్గుడపుడు గజరూపమును ధరించి దేవి[5] నెదిరించెను.

దేవి ఆగజముతుండము ఖండించివైచెను. రాక్షసుడాపయి మహిషమురూపమున దేవిపయి కురికెను.[6] వానిని దేవి[7] త్రిశూలముతో పొడిచెను. వాడు వెంటనే స్వస్వరూపమున సహస్రభుజములతో ప్రత్యక్షమయి దేవితో పోరదొడగెను.[8] వానిని దేవి[9] మహాస్త్రముతో చంపివైచెను. ఇట్లు దుర్గాసురుని జంపి మహాదేవి దుర్గానామమున వినుతికెక్కెను. ప్రకృతవ్యాసవిషయముతో సంబంధముగల దేవీమూర్తులగాథ లివి.[10]

పూర్వమీ దేవీపూజ వసంతకాలమున—చైత్ర శుక్ల ప్రతిపత్తుమొదలు నవమివఱకు—తొమ్మిదిదినములు 'వాసంతీపూజ' యను పేర జరుగుచుండెడిది.[11] తరువాత శరత్కాలమునకు—ఆశ్వయుజశుక్ల ప్రతిపత్తుమొదలు నవమివరకు—మారినది. ఈతొమ్మిదిదినములు చేయుపూజకు[12] 'శరన్నవరాత్రపూజ' యను పేరు కలిగినది. ఈనాళులయందు ఆరాధింపబడునది, ప్రధానముగ, ఆదిశక్తి మూర్త్యంతరముగ ప్రసిద్ధిగన్న దుర్గాదేవి.[13] ఐశ్వర్యప్రదయగు లక్ష్మియు,

---

౧. దీనినిబట్టి 'దుర్గ' యే మహిషాసురుని నిరవశేషముగ జంపినట్లు తెలుచున్నది.

౨. సకలదేవతల యంశముల వలన సముత్పన్నయయిన యీ దేవిని పూజించుటచేత దేవతలెల్లరు సంతుష్టి చెందగలరు. కావున వారికి ప్రత్యేక పూజనమక్కర లేదని యొకమతము.

౩. 'కాళరాత్రి'యు ఆద్యశక్తిమూర్తిభేదము.

౪. ఈశక్తులు ఆద్యశక్తి యనంత (సహస్ర) మూర్తులలోనివారే కావచ్చును.

౫. 'ఉగ్రచండ' మూర్తి.

౬. ఈ మహిషాకృతి దుర్గుడే మహిషాసురుడు కాదగును.

౭. 'భద్రకాళి' మూర్తి.

౮. మహిషాసురుని ఖండితశిరమునుండి వెలువడిన అసురుడు వీడే యగును.

౯. 'దుర్గా'మూర్తి.

౧౦. ఈ రెండుగాథలకును ప్రకారాంతరముల నేకములుగలవు. వానితో ప్రకృతమంతగా నుపయోగము లేదు.

౧౧. రావణాసురుడు దేవిని వసంతకాలమున పూజించెడివాడట. ఇపుడీపూజ వసంతకాలమున చాల విరళముగ జరుగును.

౧౨. శ్రీరాముడు దేవీపూజను శరత్కాలారంభమున కావించి రావణుని వధియించి విజయమును గాంచెనట. కొన్ని దేశముల నను వర్షము శరత్కాలముననే 'రామలీల' యను శ్రీరామోత్సవమును అతివైభవముతో జరుపుదురట.

౧౩. ఉత్తర హిందూస్థానమున మహాకాళిపూజ జరుగును. కాళియను పేర భయంకరవిగ్రహమును, పదిపండ్రెండడుగుల పొడువుగలదానిని, తయారుచేయించి దానిని ప్రతిష్ఠించి యారాధింతురు.

జ్ఞానదాత్రియగు సరస్వతియు ఆనుషంగికముగా పూజింపబడుచుండును. ఒక్కొక్క దేశమున నొక్కొక్క తీరున నీపూజ జరుగును.

పూజకు ఏడువిధముల కల్పములు గలవు: ౧. నవమ్యాదికల్పము; ౨. ప్రతిపదాదికల్పము; ౩. షష్ఠ్యాదికల్పము; ౪. సప్తమ్యాదికల్పము; ౫. అష్టమ్యాదికల్పము; ౬. అష్టమీకల్పము; ౭. నవమీకల్పము. సంపన్నులు ప్రతిపదాదికల్పము ననుసరింతురు; సామాన్యులు సప్తమ్యాదికల్పమును స్వీకరింతురు. తక్కినకల్పము లల్పప్రచారము గలవి.

ఇట్టికల్పముల ననుసరించి చేయబడుపూజ సాత్త్వికి, రాజసి, తామసి యని మరల మూడుతెరగు లయినది. నిరామిష నైవేద్యజపయజ్ఞ పారాయణాదులతో కూడిన పూజ సాత్వికి; బలిదానసామిష నైవేద్యాదులతో నాచరితమగుపూజ రాజసి; కేవలసురామాంసాదులచేతను, జంతుబలులచేతను నిర్వర్తింపబడుపూజ తామసి.౧

ప్రతిపదాదికల్పము ననుసరించి ఆశ్వయుజ శుక్ల ప్రతిపత్తునాడు ప్రతిమా, కలశ స్థాపనాదులు కావించి కేశసంస్కారద్రవ్యములను, ద్వితీయను కేశబంధనసామగ్రిని, తృతీయను దర్పణ సిందూరాలక్తకాదులను, చతుర్థిని మధుపర్క తిలక నేత్రమండనాదులను, పంచమిని అంగరాగాదులను సమర్పింపవలెను. షష్ఠిని, సాయం సమయమున, బిల్వతరు శాఖయందు బోధనము౨, ధ్యానము, సప్తమిని స్వగృహమున పూజనము (షోడశోపచారములతో), అష్టమిని ఉపవాసము, అష్టశక్తిపూజ, నవమిని

౧. ఉత్తరహిందూస్థానమున మహాకాళీపూజ సప్తమ్యాదికల్పము ననుసరించి తామసీవిధానమున అనుష్ఠింపబడును. వేలకొలది మేకపోతులు, పొట్టేళ్లు, నూరులకొలది దున్నపోతులు కాళీవిగ్రహమునెదుట బలి యీయబడును. బలినొసగ దెచ్చినజంతువులసమ్మర్దము, బలియిచ్చునపుడవి కావించు దీనభీషణధ్వనులు, నరుకబడినజంతువులశీర్షములు, కళేబరములు, వానినుండి స్రవించురక్తప్రవాహము గలిసి యా దేవీపూజామందిరము కరుణబీభత్సభయానకరసములకు స్థానమయి పొడకట్టునట. కలకత్తా యందలి కాళీదేవాలయమున నిప్పటికి నిట్లే జరుగుచుండునట. ఒకానొక సంస్థానపు రాజీపూజాకాలమున ౫౩౫ జంతువులను బలియిచ్చెనట. ఇక నక్కడ బండుబూతుమాటలకు, చేష్టలకు, త్రాగుడుకు మితిమేర లుండవట. ఈపూజకొరకు ఏటేట లక్షలకొలది ధనము వ్యయమగుచుండునట. స్మరణమాత్రముననే యసహ్యముగొలుపుచున్న యీ దారుణ పశుమారణకర్మము, దుర్నీతిచేష్టితములు గ్రామశక్తుల జాతరలయందును జరుగుచుండును. ఈకాళీపూజలను, ఈజాతరలను తన కభ్యుదయమును కలిగించునను పిచ్చినమ్మకముతో మానవుడు చేయుచున్నాడు. వానియీపిచ్చినమ్మకమే తొలుత తన్నుబోలిన మానవుని సయితము బలిపశువునుగ జేసినది. ఇది వీరకర్మముగాదు; స్వార్థపరుడగు మానవుని వంచనాయుతమగు ఘాతుక కర్మము. ఇది క్రమముగా నంతరించిపోయినది. పశుమారణకర్మముగూడ చాలవరకు తగ్గినను పూర్తిగా నశింపకున్నది. మానవుడు తానే దుర్గ, మహాకాళి, మున్నగు శక్తులు ఆదిశక్తిమూర్తు లన్నాడు; సర్వోత్కృష్టతను గల్పించినాడు. సామాన్యగ్రామదేవత లనబడు అంకాళమ్మ, పోలేరమ్మ మొదలగు శక్తులను క్షుద్రశక్తు లన్నాడు; నికృష్టతను గల్పించినాడు. స్వార్థపరుడయి మరి యా శక్తిమూర్తుల యుత్కృష్టతా నికృష్టతా విభేదమును కాల దన్నివయిచినాడు. అయ్యది తాను గల్పించినవ్యవస్థయే యని యెరిగియు, ఎఱుగనివానివలె ప్రవర్తించినాడు. స్వార్థపరత ఏలుబడిమహిమ యట్టిది!

౨. బోధనము=నిద్రించుచున్నవారిని మేలుకొలుపుట. దేవతలకు దక్షిణాయనము రాత్రి. నిద్రాకాలమగు రాత్రియందు కావించు బోధన 'అకాలబోధనము'; కావున శరత్కాలమునందలి దేవీబోధనము 'అకాలబోధనము' అనబడినది. రావణుని జంపి విజయమును బడయుటకయి శ్రీరామునిచేత పూజింపజేయ బ్రహ్మదేవి నిట్లకాలమున మేలుకొలిపెనట. అది మొదలు దేవికేటేట నిద్రాభంగము గలుగుచునే యున్నది.

ఉగ్రచండాదిదేవీపూజ, బలిదానాదులు, కుమారీపూజ కావింపవలయును. దశమినాడు పూజ కావించి మధ్యాహ్నానంతరము ఉత్సవముతో దేవిని కొనిపోయి నదీజలమున విసర్జించవలెను. ఇది మహాపూజ యనబడును. ఈ తొమ్మిది దినములలో చివర మూడుదినములు ప్రశస్తములు.

సప్తమ్యాదికల్పము సప్తమినాడారంభమయి నవమితో నంతమొందును-౨.

కల్పవేదియాయినను ఉత్తర హిందూస్థానమున పురాణాదులయందు వర్ణింపబడినవిధమున మృత్తికాదులచే దుర్గాదేవి[3] రూపమును నిర్మించి దానిని ప్రతిష్ఠించి పూజ కావింతురు. ఈవిగ్రహమునకు కుడిప్రక్క సరస్వతీ గణేశులయు, ఎడమ వైపున లక్ష్మీకార్తికేయులయు విగ్రహముల నిలిపి పూజోపహారాదులు సమర్పింతురు. దక్షిణహిందూస్థానమున కలశమును స్థాపించి దుర్గాదేవి నావాహనముచేసి తొమ్మిదిదినములు సాత్విక

౧. సాత్వికవిధానమున, గుమ్మడిపండ్లు, చెరకుగడలు, నిమ్మపండ్లు, టెంకాయలు మొదలగునుపహారములతో 'బలి' సమర్పణము నిర్వహింపబడును.

౨. పూర్వోక్త ప్రతిపదాదికల్పమునకును, ఈ సప్తమ్యాదికల్పమునకును మహదంతరము కలదు. ఇది ప్రశస్తముగా పరిగణింపబడినది. తామసపూజ కావించువారికిని ఈమూడురోజులే శ్రేష్ఠములు. అష్టమీ నవముల సంధికాలమున చేయుపూజ యుత్తమోత్తమము.

3. దుర్గాదేవివిగ్రహము మహిషాసురుని సంహరించుచున్నట్లు నిర్మింపబడును. దేవి వాహనమగు సింహమును దక్షిణపాదముతోడను, మహిషాసురుని శీర్షమును వామపాదాంగుష్ఠముతోడను మెట్టియుండును. పదిభుజములు (నాలుగు, ఎనిమిది, పదునెనిమిదికూడ కొన్నిటికి), మూడు కన్నులు నుండును. త్రిశూలముతో మహిషాసురునివక్షమును పొడచుచున్నట్లుండును. ఇట్టి విగ్రహము బంగారముతోను, వెండితోను, రాగితోను వారివారి సంపదకు దగినటులు చేసికొందురు. జనసామాన్యము మృత్తికతో చేయబడిన విగ్రహములనే పూజింతురు.

ఈవిగ్రహములనుబట్టి వేదాంతార్థ మిట్లు సంభావింపబడినది. దుర్గాదేవి పరబ్రహ్మము. త్రిశూలము జ్ఞానము. సింహము, మహిషాసురాదులు కామక్రోధాదులు. త్రినేత్రములు త్రికాలములు. దశభుజములు దశదిశలు. లక్ష్మీసరస్వతులు, వినాయక కార్తికేయులు చతుర్విధ పురుషార్థములు. గణేశుడు వివేకమును కార్యసిద్ధిని ప్రసాదించును గావునను, లక్ష్మి యైశ్వర్యము నొసగును గావునను, కార్తికేయుడు శక్తిని సామర్థ్యమును సమకూర్చును గావునను, సరస్వతి జ్ఞానము ననుగ్రహించును గావునను ఆనలుగురు క్రమముగా ధర్మార్థ కామ మోక్ష చతుర్విధపురుషార్థము లనబడిరి.

సాధకుడు పురుషార్థసాధనము ద్వారమున జ్ఞానమును సంపాదించుకొని కామక్రోధాదులను ధ్వంసముచేసి, త్రికాలవేదియయి సర్వవ్యాపియగు పరమాత్మను దెలిసి ఆత్మసిద్ధిని బడయునని దుర్గాపూజనము నంతరార్థము.

ప్రపంచము ఆదిశక్తి. ఆదిశక్తియే పరబ్రహ్మము. కావున ప్రపంచమంతయు పరబ్రహ్మస్వరూప మయినది. అందున సాధకుడు, సాధనము, సాధ్యము అన్నియు పరబ్రహ్మస్వరూపములే. ఈ సిద్ధాంతమునబట్టి, "బ్రహ్మార్పణం బ్రహ్మహవిః బ్రహ్మాగ్నౌ బ్రహ్మణాహుతమ్, బ్రహ్మైవ తేన గంతవ్యం బ్రహ్మకర్మ సమాధినా" అను గీతావచనమునకు సరిపోవునట్లు దుర్గాపూజనము బ్రహ్మయజ్ఞము నయ్యెను. పైసిద్ధాంతమును స్ఫురింపజేయుటకొరకే తామస పూజనమునకు నయితము బ్రహ్మయజ్ఞ మను పరిపాటి కల్పింపబడినది. ఖడ్గము జ్ఞానము. బలి పశువులగు దున్నపోతు, మేకపోతు, పొట్టేలు మొదలగునవి క్రోధము, కామము, లోభము మొదలగునవి. కామక్రోధాదులకు దాసుడగు మానవుడు జ్ఞానమును సంపాదించుకొని వానిని రూపుమాపి మోక్షము నధిగమించు ననుట. ఇట్టి కల్పనములు నాటిమానవునికిని తరువాతి తరువాతి మానవులకును గల సంస్కారము యొక్క పరిణామమునకు నిదర్శనములు. మానవుడు తనయావశ్యకతనుబట్టి పందిని నందిని, నందిని పందిని చేయుచున్నాడు. అది వానికి సైజము.

విధిప్రకారము యథాశక్తి పూజానైవేద్యాదుల నర్పింతురు.[౧] దుర్గ మొదలయినశక్తులవిగ్రహములకు మారుగా బొమ్మలను కలశముచుట్టు నుంచెదరు.[౨] సప్తమిని గాని అష్టమిని గాని, అథవా దశమినాడు మంటపమున నొకచో నలంకృతమగు వేదికపయి పుస్తకములను పేర్చి సరస్వతీదేవి నాపొత్తములయం దావాహనము చేసి షోడశోపచారపూజ కావింతురు. నవమినాడు రొక్కముగల పెట్టెలనువడ్లునిండినకొట్లులను,వస్త్రాభరణాదులనుపూజింతురు. ఇది లక్ష్మీపూజ. ఇట్లు దుర్గాలక్ష్మీసరస్వతీదేవులపూజ జరుగును. తొమ్మిదవనాటి రాత్రితో నీకొలువు తంతు తీరిపోవును. బంధుమిత్రులను, కూతుల నల్లుండ్రను పిలువ బనిచి వారితో కూడి గృహస్థు లిష్టమృష్టాన్నభోజనములతో, ఇతరవినోదములతో నీరోజులను గడపుదురు. రాజగృహములయందు నవరాత్రపూజ కల్పోక్తప్రకారము జరుగును 'బొమ్మలకొలువు' మహావైభవముతో నుంచి నిత్యము ఉత్సవము కావింతురు. అనుదినము విద్యావినోదములతో, సంగీతసభలతో ప్రభువులు ప్రొద్దుపుచ్చుచుందురు. కంచరము, వ్యవసాయము మొదలగు వృత్తులే జీవనముగాగల ఆయాజాతులవారును తమతమ నిత్యజీవనమున కావశ్యకములగు నుపకరణముల నన్నింటిని నవమినాడు పూజించి[౩] పండుగుచేయుదురు.

మరునాడు విజయదశమి.[౪] నాడు రాజులు రాజాశ్వసింహాసనాదులయు, ఛత్రచామరాదులయు, గజాశ్వాదిసేనాంగములయు పూజను, 'లోహాభిసారకర్మ'ము

౧. 'శరన్నవరాత్రములు' అను నొకవ్యాసము, శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు రచియించినది, రక్తాక్షి సంవత్సరపు టాశ్వయుజమాస భారతి సంచికయందు గలదు. అం దీపూజాప్రకారము విరివిగా వర్ణింపబడినది.

౨. దీనిని బొమ్మలకొలువు అనెదరు. ఇంట ననువయినచోట మేలుకట్టులు మొదలగువానితో మంటపమును నిర్మించి, యందు సోపానములవలె వరుసగా పలకల నమర్చి, వానిపయి శుభ్రవస్త్రముల బరపి, రామకృష్ణాది దేవతావిగ్రహములను, సుందరశిల్ప శిలావిగ్రహములను, వినోదములగు వాయువిమాన ధూమశకటాదుల ప్రతికృతులను, మృద్దారుదంతలోహ పుత్రికలను, రాజులయు, మంత్రులయు, సైనికులయు బొమ్మలను వరుసలు దీర్చి, వింతవింత తెరగుల కొలు వమరుతురు. చొక్కపు చిత్తరువుల మంటపముచుట్టుపట్టుల వ్రేలగట్టుదురు. ఆమంటపాలంకారము, ఆకొలువుచెలువు రాత్రులయందు దీపములవెలుగున చూడ సొంపుగ నుండును. ప్రతిదినము సాయంకాల మొకటిరెండు గడియలప్రొద్దుండగనే బాలికలు యువతులు కురులు దువ్వుకొని, పూవులు ముడుచుకొని, మోమున తిలకమును దిద్దుకొని, కన్నులకు కాటుక దీర్చుకొని, తమకుగల నగల నన్నింటిని బెట్టుకొని, మేలివలువలను గట్టికొని, కుంకుమభరణులను కేల గొని యిరుగుపొరుగు ముత్తయిదువులను పేరంటమునకు పిలువ బోవుదురు. పూచిన గుబురు తంగేడుగున్నలవలె సాయంకాలపు మదురుటెండలో మిలమిలలాడుచు రాకపోకలు గావించు తలిరుబోడులతో నిండి గ్రామముల—విశేషించి నగరముల—వీథులు కలకలలాడుచుండును. మరల దీపములు పెట్టినది మొదలు వారు ఇరుగుపొరుగు వారలయిండ్లకు గుంపులుగట్టి పేరంటమునకు బోవుదురు. ప్రతియింటను పేరటాండ్రెల్లరు 'కొలువు'న కెదుట గూరుచుండి పాటలు, పద్దెములు పాడుకొందురు. ఆవల నాయాయియిండ్ల యిల్లాండ్రు పేరటాండ్రకు కుంకుమచందనాదుల నొసగి తమశక్తికి దగినట్లు ఫలములనో, భక్ష్యములనో తాంబూలములతో నిచ్చెదరు. ఇట్లీతొమ్మిదిదినములును సాయంకాలమునుండి రాత్రి జాముప్రొద్దువరకు పేరటాండ్రసందడి మెండుకొనియుండును. పగటివేళకూడ రాత్రికి వలసినపనులను సవరించుకొనుటయం దిల్లాండ్రకు తీరుబడి యుండదు. అవి వారి రాజ్యపుదినములు. వారి నడ్డువా రెవ్వరు లేరు. వారి యానందమునకు మేర లేదు. వారియం దారోపితమయిన శక్తిత్వ మీదినములయందు ముగ్ధప్రసన్న సుందరస్వరూపమున మానవుడు కనుగొనగలడు.

౩. ఇదియు 'లక్ష్మీపూజ' యనదగినదియే.

౪. దేవి దుర్గాసురుని రూపుమాపి విజయమును గాంచిన దినమనియు, రాముడు రావణుని వధియించి గెలుపుగొనిన దినమనియు నైతిహ్యము.

ను,౧ ఆయుధాదిపూజను పరిపూర్తిచేసి ఆయుధములు గైకొని, సైనికులు వెంట రా, అశ్వముల నధిరోహించి మంగళవాద్యములతో తరలి నగరమున కీశాన౨ దిశను పొలిమేర చేరువనున్న శమీవృక్షము (జమ్మిచెట్టు)3 నొద్దకు జని యచట తొలుత 'నపరాజితా' పూజన నొనరింతురు. తరువాత శమీపూజ౫ ను చేసి తత్పత్రములను గ్రహించి, సీమాంతమును గడచి ముందునకు మూడడుగులు వయిచి పరసీమ నుంచబడిన శత్రువులవిగ్రహముల౬ హృదయమున నమ్ముల నాట నేయుదురు. పదపడి గృహాభిముఖులయి మరల జమ్మిచెట్టునుండి ఆకులను దూసికొని శిరముల నుంచుకొని మహోత్సవముతో నగరు సొచ్చి౭ దర్బారు చేయుదురు; సామంతులు, పౌరులు, రాజ్యాంగమువారు సమర్పించు కానుకలను స్వీకరింతురు; కవి పండిత గాయకాదులను సన్మానింతురు; అనుచరుల కెల్లరకు వారివారికి దగిన పారితోషికముల నిచ్చి యానందింపజేయుదురు.౮

---

౧. రాజులు నవరాత్రపూజాదివసములం దొక మంటపమున శస్త్రాదియుద్ధోపకరణములను, ఛత్రచామరాందోళికాదులను నిలిపి పూజించుచు అందొక కుండమును త్రవ్వి తత్తదాయుధాదుల యాధిదేవతల మంత్రములతో పాయసహోమము గావింతురు. దశమినాడును తత్పూజాహోమాదులను నిర్వర్తింపవలెను. ఇది 'లోహాభిసారకర్మము' అనగా 'శస్త్రప్రస్థాపనకర్మ'. పూర్వము 'లోహు' డను రాక్షసు డొక డుండెను. వా డతిమాత్రబలయుతుడు. వానిని దేవతలు యుద్ధమున జంపి తునుకలుగ త్రుంచివైచిరి. ఆతనుకలన్నియు లోహపు ముక్కలయినవి. ఇపు డాయుధములను జేయ నుపయోగించు లోహము వాని యవశేషమేనట. కావున తన్మయములగు నాయుధములు మొక్కపోవకుండుటకు నేటేట నీ'లోహాభిసారకర్మ' ను కావింతురు కాబోలు!

౨. తూర్పుదిశ నని గ్రంథాంతరము.

3. జమ్మిచెట్టు దిక్కున లేనియెడల దాని కొమ్మనయిన దెచ్చి యచ్చట నాటి దానిని పూజింతురు.

౪. అష్టదళ పద్మమును రచియించి అం దపరాజితను, దక్షిణవామభాగముల జయావిజయలను ఆవాహనముచేసి షోడశోపచార పూజ చేయుదురు. 'అపరాజిత' యనగా దుర్గాదేవిమూర్తి భేదము, శమీవృక్షవిశేషమును కావున అపరాజితాపూజ యనగా శమీవృక్షాధిదేవతాపూజన మనదగును.

౫. జమ్మిచెట్టుమొదట నీరు పోసి మన్ను త్రవ్వి అం దక్షతలను గలిపి తరువాత శమీపూజ కావింతురనియు, సీమోల్లంఘనమును గావించి గృహములకు మరలి వచ్చునపుడు ఆ యక్షతలు గలిపిన మృత్తికను గొనివత్తురనియు మతాంతరము.

౬. ఈ బొమ్మలను ముందే తయారుచేయించి యచట నుంచెదరు.

౭. సామాన్యజనులు చుట్టములు, నెచ్చెలులు పరిచారకులు మొదలగు వారలతో గలిసి తమ యింట నొక్కచో గూరుచుండి తాము వారి బహుమతుల నందుచు, వారికి దా మొసగి సత్కరింతురు.

౮. ఈ శమీపూజనము చేయుటకు మరియొక కారణ మిట్లు గలదు:

పాండవు లజ్ఞాతవాసము చేయబోవుటకు మున్ను తమ యాయుధముల నన్నిటిని కట్టగా గట్టి దానిని మత్స్యపుర ప్రేతభూమి పరిసరమున నున్న యొక జమ్మిచెట్టుపయి దాచిరి. ఆసమయము తీరగనే అర్జును డా కట్ట యందలి గాండీవమును గొని కౌరవులను పారద్రోలి విరటు నావులను విడిపించెను. నాడు సుత పాండవులకు విజయపరంపర చేకూరుచుండెను. కావున విజయకాంక్షతో జనులు-తత్రాపి రాజులు-శమీపూజా సీమోల్లంఘనాదుల నాచరించు టాచారమయినది. పయి పాండవుల కథకును ఆచరణమునకును గల సంబంధ మీక్రింద సూచింపబడుచున్నది.

రుద్రునకు శ్మశానభూమి విహారస్థానము. ఆయన యీశానదిశ కధిపతి; కైలాసవాసి. కావున శ్మశానము గ్రామమున నీశానదిశకు చేరువుగా—అనగా ఉత్తరము తూరుపు దిక్కుల గూడ చేరియుండుననుట—పొలిమేర కడ నుండుట గాననగును. (గ్రామమున కుత్తరమున గాని

ఇట్లీనవరాత్రదినములు మహోత్సవ దివసములయి చిరకాలమునుండి యాచరింపబడుచున్నవి.౧ అప్పటనప్పట అక్కడనక్కడ మానవుని అజ్ఞానమును, ఆవశ్యకతను, అభిరుచిని అనుసరించి ఈ పూజలు, ఈ పండుగులు, వీనికి జెందిన 'తంతు' వేరువేరు తెరగుల నేరుపడినవి.౨ వానిలో గొన్ని పరిశీల నార్హములు. తత్కార్య మవకాశాభావముచే స్థల కాలాంతరాపేక్ష మయినది.

---

తూర్పున గాని ఆందరకును, దక్షిణపుదిక్కున నుత్తమ వర్ణమువారికిని ఉండవలయునని కౌటిల్యుని మతము.) పాండవు లాయుధముల దాచిన జమ్మి శ్మశానముకడ నుండినది. కావున విజయదశమినాడు ఈశానదిశ (కొండొక్కమతమున ఉత్తరదిశ) నున్న జమ్మిని పూజించుట. పాండవు లాచెట్టుపయి నుండిన ఆయుధముల గొనిరి; కావున ఆయుధములకు మారుగా చెట్టునుండి జమ్మియాకులను గొనుట. అర్జునుడు కౌరవవీరులను మత్స్యదేశ సీమ దాట వెంబడించి తరిమి ఆవులను మరలించెను; కావున, జమ్మికడనుండి కొంతదూరము పోయి పొలిమేరదాటి యక్కడనున్న శత్రువుల బొమ్మలను బాణముతో గొట్టుట.

జమ్మిచెట్టుమొదటి మట్టిని కొనితెచ్చుట శత్రు రాజురాజ్యము నాక్రమించుటయనియు, జమ్మి ఆకులను దూసి తెచ్చుట ఆతని సంపదను కొల్లగొట్టుట యనియు సూచన.

౧. మైసూరు మొదలగు కొన్ని సంస్థానములయం దీయుత్సవము లీనాడును చక్కగా జరుగుచున్నవి. దసరా పండుగులు అని యీ పూజాదినములకు ప్రసిద్ధి.

౨. గృహలక్ష్మి ప్రకృత (౧౯౩౨ అక్టోబరు) సంచికయందు 'దసరా ఉత్సవములు' అను పేరుగల వ్యాసము, డాక్టరు వి. వి. యస్. ఆరాధ్యగారు (యల్. ఐ. యం.) రచియించినది, ప్రకటితమయినది. అందీ దుర్గా మహిషాసురాదుల చరిత్రాదులకును, ప్రాచీన భారతదేశ చరిత్రకును గల సంబంధమును, వాని పరస్పర సమన్వయమును గూర్చి కొంత తెలుపబడినది.



బావిచెంత

చిత్రకారుడు: శ్రీ యం. వి. సుబ్బారావుగారు, బ్రాహ్మణకోడూరు.